# Rohini Sudhakara Vijayam.

A Drama in Seven Acts.

BY

Hota Venkatakrishnayya,

2nd Edition 1000 Copies.

Published by

Parupudi Subbarow

Cocanada.

1913



Price 0-12-0

# పీఠిక.

చదువరులారా !

యవనయామినీ వినోదములలోని "కేమర్లమాన్" అను రాకుమారుని యొక్కయు "బిదోరా" అను రాజకన్యామణి యొక్కయు లీలావినోదముల ననుసరించి బ్ర॥ హా॥ శ్రీ॥ వేంకటకృష్ణ కవివర్యులచే వ్రాయఁబడి నిరుపమానమై జగత్ప్రసిద్ధిం గాంచిన రోహిణీసుధాకర విజయమిప్పు డాంధ్రభాషాభిమానుల యాదరణముచే ద్వితీయముద్రణ భాగ్యముం బడసినది. కథ జగద్విదితము గావున నిందు వేఱుగా వ్రాయఁబడలేదు. ముద్రాప్రమాదములు లేకుండునటుల సాధ్యమగునంతవరకు జాగ్రత్తగ నేచూడఁబడెను.

ఇంకను నేమేని దోషములున్నఁ బాఠకులు తెలుపఁ బ్రార్థితులు.

ఇట్లు.

సుజనవిధేయుఁడు

పంగుపూడి సుబ్బారావు.



శ్రీరస్తు.

# ఇష్టదేవతాప్రార్థనాదికము.



రామాకుచగంధకర్దమలస ◆ చ్ఛ్రీవత్సవక్షంబునం
దారూఢోన్నతిఁ గ్రాలుకౌస్తుభమునం ◆ దత్యంతమున్బింబితా
కారంబందుచుఁ దానవెల్గి పొలయ ◆ ల్కన్వేఱుగా నెంచునా
నారీరత్నముఁ జూచినవ్వుకమలా ◆ నాథుం బ్రశంసించెదన్.

క. శంకరు నిజభక్తాళివ
శంకరుఁ జిత్స్వప్రకాశు ◆ సకలకలుషనా
శంకరుఁ దాపసజనహృ
చ్ఛంకరు మదినిల్పి నేన ◆ జస్రముఁ గొల్తున్.

శా. కాళిందీపులినంబునందు వ్రజము ◆ గ్ధస్త్రీలు మైనుండఁగ
చ్చేలంబుల్ హరియించి పొన్ననిడి వా ◆ సిన్ వారు ప్రార్థింప గ
త్కాలోలుండయి చీరలిచ్చు మురళీ ◆ గానంబు చేనొప్పు గో
పాలుం డీకృతికన్యఁ గైకొని ననుం ◆ బాలించు నశ్రాంతమున్.

ఉ. మున్ను కవిత్వసంపదల ◆ భూరియశోవిభవాభిరాములౌ
నన్నయభట్టు శంభుకవి ◆ నాథుని బమ్మెరపోతనార్యుఁ బే
రెన్నికఁ గన్న తిక్కనక ◆ వీంద్రుని నాచనసోము పెద్దనన్
మన్ననసేంతు నారసన ◆ నవ్యవచోలహరుల్ జనింపఁగన్.

వ. అని యిట్లభ్యుదయపరంపరాభివృద్ధికై యిష్టదేవతాప్రార్థనంబును, సత్కవిపుంగవ పురస్కారణంబును గావించి,

ఉ. నాదుమహ్యాద్వయుల్దవిలి ♦ నాటకముల్ రచియించికీర్తిసం
పాదనఁజేసియుండిరి స ♦ మాహిత బుద్ధినిఁ గాన నాటకం
బేదియునైనఁ జేయఁదగు ♦ నెంచి యటంచుదలంచి దీనిస
మ్మోదముతోరచించుటకుఁ ♦ బూనితి నిశ్చలభక్తిపెంపునన్.

సీ. ఎలమిభూవలయంబు ♦ తెల్లనుగల్పింప,
మనుపంగ్రమంపన ♦ మస్థఁడెవఁడు
సనకాదియోగిహృ ♦ త్సారసిజాంతరములఁ,
విమలకగీడించు ♦ వేల్పెవండు
భక్తసంరక్షణా ♦ సక్తిఁదెల్పఁగఁగోపి,
కాలోలుఁడై యుండు ♦ ఘనుఁడెవండు
శిష్టులరక్షింప ♦ దుష్టులశిక్షింపఁ,
బలురూపములఁదాల్చు ♦ భవ్యుఁడెవఁడు

గీ. అట్టిసర్వేశుశ్రీవేంక ♦ టాద్రివాసు
మకరకుండలకేయూర ♦ మణివిహారు
చిన్మయానందు విశ్వేశు ♦ చిద్విలాసు
నాదుహృత్పద్మపీఠినిఁ ♦ బాదుకొల్పి.

సీ. గర్భభారమునోర్చి ♦ కనిపెంచునట్టినా
జననికిమున్నయం ♦ జలిఘటించి
వేల్పుపగిదినన్ను ♦ వీక్షించుచుపోచునా,
తండ్రికిభక్తివం ♦ దనమొనర్చి
విద్యాధనమొసంగి ♦ వెలయించుగురులకు,
[illegible]ంబుతోవమ ♦ స్కృతిదొనర్చి
చిత్తమెలర్పనా ♦ క్షేమమునారయుచుండు,
నత్తమామలపైని ♦ బత్తినిలిపి.

సీ. తక్కుఁగలబాముగులకుఁగై • దండయొసఁగి
మిత్రబృదంబుగానియాడి • చిత్రఫణితి
సాక్కుకథనాటకంబుగా • నొనరఁజేయఁ
గడఁగితిని సజ్జనాఘన • త్కరుణ పేర్మి

క. శాంతుఁడుధీనిధి కరుణా
స్వాంతుం డుపన్యాసకుండు • సరసుఁడవిద్యా
ధ్వాంతప్రభాకరుండగు
పంతులశ్రీరామశాస్త్రి • భక్తనుతింతున్.

విబుధవరుల కొకవిజ్ఞాపన.

శా. ఛందశ్శాస్త్ర మెఱుంగనా కితరశా • స్త్రజ్ఞానమున్ సున్న నా
డెందంబందుఁదలంపవ్యా కరణ•పాండిత్యంబు పూజ్యంబు నిం
పొందన్నాటకముల్ రచించుటకు నే•నూహింపశక్తుండనే
సందేహించుచు వ్రాసితిన్ బుధులు ! నా•సందేహముల్బాపుఁడీ॥

ఉ. బాల్యమునన్ గుమారకుల • పట్టునఁగల్గెడు తప్పులెల్లసా
కల్యముచేతఁ దండ్రులెడఁ • జేయరె ధీయుతులార! పుత్రవా
త్సల్యముఁజూపియుండుఁగల • తప్పులనెల్ల క్షమించిదీనిసా
కల్యముగాఁ బఠించియును • గంప నమున్ గృతికృత్యుఁ జేయరే॥

ఇట్లు
కం — వెంకన్న,

# ఈనాటకములోవచ్చు ముఖ్యపాత్రలు.

## పురుషులు.

| | |
|---|---|
| రత్నాకరుఁడు. సింహళద్వీపము నేలెడు రాజు. [కథానాయకుని తండ్రి.] | పుష్పదంతుఁడు గంధర్వుఁడు. [మనోరంజనిభర్త.] |
| సుధాకరుఁడు. రత్నాకరుని పుత్త్రుఁడు. [కథానాయకుఁడు.] | జయుఁడు., విజయుఁడు. } హరిద్వారపాలకులు. |
| శ్రుతకీర్తి. రత్నాకరుని ప్రధానమంత్రి. | ఇంద్రుఁడు స్వర్గాధిపతి. |
| విశారదుఁడు. సుధాకరుని నర్మసఖుఁడు. | కామపాలుఁడు., సుదంతుఁడు } పురజనులు. |
| బలాహకుఁడు. కంచుకి. [రత్నాకరుని భటుఁడు.] | రాజశేఖరుఁడు మగధదేశాధిపతి. [సుధాకరునితో నేకార్థసమవేతుఁడు.] |
| దక్షుఁడు. పాంచాలదేశమును పాలించు రాజు. [కథానాయకితండ్రి.] | మానవర్మ. రాజశేఖరునిమంత్రి. |
| సుమతి. దక్షుని ప్రధానమంత్రి. | రక్తముఖుఁడు., దీర్ఘకర్ణుఁడు., లంబకేశుఁడు., శంబరుఁడు. } రాక్షసులు. |
| చిత్రసేనుఁడు బాటసారి. [రోహిణిని పెంచిన దాయాకొమారుఁడు.] | |
| జయమిత్రుఁడు. కంచుకి. [దక్షునిభటుఁడు] | |

ఇంకను బృహస్పతిప్రముఖదేవతాగణంబును కొందఱు వేఁటగాండ్రును వైశ్యులును, యోధవీరులును నాయాచోటుల సమయానుగుణ్యంబుగవత్తురు.

## :స్త్రీలు:

| | |
|---|---|
| మందాకిని-రత్నాకరునిభార్య | వకుళ, మాధవి } రోహిణిచెలికత్తియలు |
| రోహిణి-దక్షనరేంద్రునికూఁతురు. [కథానాయకురాలు.] | మనోరంజని-గంధర్వవనిత. [పుష్పదంతునిభార్య.] |
| మణిమంజరి-చిత్రసేనునితల్లి. [రోహిణిని పెంచినదాయీ.] | |

ఇంకను రంభాద్యప్సరోగణంబులువత్తురు



శ్రీరస్తు.

హయగ్రీవాయ నమః

శుభమస్తు-అవిఘ్నమస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

నాంది-ప్రస్తావన,

మ. అకలంకుం డనఘుండు నాదిపురుషుండు ని ♦ త్యానందుండు జ్యోత్స్నాప్రకా
శకుఁ డానందమయుండు నవ్యయుఁడు వి ♦ శ్వస్రష్టలోకాధినా
యకుఁ డామ్నాయవిహారుఁ డచ్యుతుఁడు న ♦ వ్యక్తాంచితాధ్యాత్మత
త్త్వకళాలంకృతుఁ డీసభాసదుల ని ♦ త్యంబున్ గృపన్ బ్రోచుతన్.

ఉ. తమ్ములసూను మామ వెలి ♦ దమ్ములు బాణచయంబులం డజా
తమ్ములు వాజులిక్షువును ♦ ధర్మనుగాఁగఁ బ్రియమత్తచంచరీ
కమ్ముల శింజినీరవముఁ ♦ గల్గి విరాగజనమ్మెచ్చ నొప్పునా
కమ్మనివింటిజోదుకుతు ♦ కమ్మన సౌఖ్యము సంగుమీకిలన్

(అనిసభ్యులపైఁ బుష్పములను జల్లుచున్నాఁడు.)

ఇట్లు నాంది ముగియగా నే

సూత్ర:— ఆహా! నేటికి నాపూర్వభవపుణ్యలతాంకురంబులు ఫలించినవి కాఁబోలు. సకలకళాకోవిదవిద్వజ్జన సందోహబంధురంబగునీ సభామందిరంబున నే నమందానందకందళిత హృదయారవిందుండనై ముందుగ నీమహనీయుల యాజ్ఞఁ గొని నా నేర్చువిధంబున నీనాటకంబును బ్రదర్శించెద.

(అనికొంచెము ముందరకు నడచి తోసిలియొగ్గి)

పూజ్యులగునో సభాసదులారా!

ఉ. ఈభువిలోన నాటకము ♦ లెన్న ననేకము లొప్పుచుండినన్

బ్రౌఢవయుక్తినాదు పరి ♦ పాటిని నాటకమొండునేను జే

తోభయమొంద ముల్లలిగి ♦ దోసిలియొగ్గితి నాదులాస్యగా

నాభినయ ప్రయోగముల ♦ నాదట నాడననుజ్ఞ నీయరే.?

(అని యాకసమువంకఁ దనకర్ణంబు నునిచి,)ఆఁ! సభ్యులేమనుచున్నారు?

"నాటకప్రదర్శన కలాకుశలుండవగు నీవలన సరసకవిసూక్తి ముక్తాఫలగ్రథిత నాటకాలంకారంబును గనమే మత్యుత్కంఠముతో వేచియున్నారము. కావున నో భరతపుత్రా! ఆనాటకరాజంబు నతిశీఘ్రముగఁ బ్రయోగింపఁజేసి మాకు నేత్రోత్సవంబు సంఘటింపు" మనియా? సరే. (అనిసవితర్కముగా)అయిన నేనీసామాజికుల నిజకుతూహలానుసారంబుగ నికార్యంబెట్లు నెఱవేర్పఁ గలిగెదనోకదా. ఏమన:—

సీ॥ ఆమ్నాయ పఠన శు ♦ ద్ధాత్ములై వరలెడు,

బ్రహ్మసదృశులైన ♦ బ్రాహ్మణులును

నఖిలశాస్త్రాభ్యాస ♦ నాయత్తచిత్తులై,

తనరుచునుండు వి ♦ ద్వత్ప్రవరులు

సంగీతవిద్యార్థ ♦ సారప్రవీణత,

వెలుఁగొందుగాయక ♦ విదకదంబ

మనయంబు రాజకీ ♦ యానేక కార్యని,

ర్వహణాత్ములౌ లౌక్య ♦ వరులబృంద ॥

గీ. మలరనొప్పెడు నీసభా ♦ భ్యంతరమున

నల్పమతినైన నేను సా ♦ హసముఁజేసి

యీదృశంబగు నాటకం ♦ బెట్టులాడి

నిగ్రహింతునో దైవార ♦ నేర్పు మెరసి॥

అయినను బ్రణయకలహకుపిత యగు నాప్రేయసిం బిలిచి యాలోచించెద

(పరిహాసముగా) ఆర్యా, ప్రసన్నురాలవై తడవు సేయక యిటురమ్ము.

నటి—ఆర్యా, ఇదిగో వచ్చితిని. (అని సూత్రధారుని సమీపించి) నాథా, ఏమిసెలవు? నేనలంకృతురాల నగుచుండ నిట్లేల నన్నింత తొందరగాఁ బిలిపించితిరి? ( అని నలుప్రక్కలఁ గలయఁజూచి. ) ఆహా! ఆశ్చర్యము. ఆశ్చర్యము! (అనివెఱఁగు నభినయించుచు.)

ఉ. అక్కడఁ బ్రేలుచున్న యవి ♦ యందపురంగుల నొప్పుపెండెలల్
మిక్కిలి నాదుచూడ్కి మిఱు ♦ మిట్లను గొల్పెడు దీపకాంతులీ
దిక్కునఁ దంత్రినాదములు ♦ దివ్య పుగానములుం జెలంగున
ల్లిక్కడ సభ్యులందఱుర ♦ యంబునఁగూడి రిదేమి చిత్రమో॥

సూత్ర—ఆర్య! ఇపుడిచట శృంగార కరుణరసంబులు వెల్లిగొల్పెడు నొక్కచమత్కారమైన నాటకము ప్రదర్శింపఁబడునని విని దానినిగౌరవించుటకై సభ్యులందఱు దయచేసియున్నారు. దుర్ఘటంబగు నికార్యంబును నెరవేర్చుటలో నాకు సహకారిణివిగ నుండుదువని నిన్నిటకు రప్పించితిని

నటి—సరేకాని, నాథా, నాటకంబులన నిపుడెన్నియో పరిబలియున్నవి- ఇపుడిచటనెద్దానిం బరిదర్శించెదరు ?

సూత్ర-సతీమణీ ! నీవెఱుగనె యెఱుగవా చెప్పెదవినుము.

మ. పరశాండిల్యసగోత్రపావనుఁడు వి ♦ ద్వద్వర్ణనీయుండు భా
సురసత్కీర్తిరతుండు సుకర్మనిరతిన్ ♦ శుభ్రప్రభావాఢ్యుఁడై
గరిమన్ హాస్యమహారసాంబునిధి రా ♦ కాపూర్ణచంద్రుండనన్
ధరణిన్ వెంకటరత్నమార్యుఁడలరున్ ♦ ధర్మానుమోదాత్ముఁడై ॥

చ॥ వెర ౦రి తత్కుమారుఁడగు ♦ వేంకటకృష్ణుఁడు పల్కుబోఁటికిన్
గర మొకనూత్నమూల్యమును ♦ కానుకగానిడ రోహిణీసుధా
కరవిజయంబు నాగనొక ♦ కల్పిత నాటకమున్ రచించెనో
గురుకుచ, యీసభాసదుల ♦ కోరికనయ్యది యాడఁగాఁబడున్ ॥

నటి—ఆర్యోత్తమా! ఈనాటకము కేవలము స్వకపోల కల్పితమేనా ?

సూత్ర-ప్రియా, ఇయ్యది హూణభాషను భాషాంతరీకరింపఁబడిన యవనయామినీవినోదకథా సంపుటంబులోని "ప్రిన్సుకేమరల్జమాన్" కథ ననుసరించి వ్రాయఁబడినది.

నటి—అయితే, నాథా, ఈ కవికి :—

ఉ. పీనులదోయిచేరల వి ♦ వేకులుజుట్టిగఁజాలు భారతా
మానసపవిత్ర సత్కథల ♦ నోలిగ్రహించి రచించి యార్యస
న్మానము నొందకిట్టుల వి ♦ నంగ విచిత్రము నాటకంబుగా
హూణకథన్ రచించుటకు ♦ నూహయదేలజనించె చెప్పుమా

సూత్ర-ఆర్యా. నీవడిగిన ప్రశ్న బహుచక్కగా నున్నది. కారణముఁ దెల్పెద వినుము- పావనములైన భారత రామాయణ భాగవతకథా భాగంబులన్నియుఁ గావ్యనాటకాది రూపంబుల నిదివరకే ప్రబలియున్నవి. ఇక్రమానంబున విదేశభాషయే మనదేశంబున విశేషంబుగ వ్యాపించియుండుటవలన నందలికథా చమత్కృతుల నొకించుక పండితపామర జనంబులకుఁ దెలుప నీనాటకంబు రచియింపఁబడినది.

నటి—ఆర్యోత్తమా, నాకొక సందియంబు పొడముచున్నది. ఏమన వాచకరోచిక శిల్పికవివేకిప్రముఖ సనాతనాధునాతన గీర్వాణాంధ్ర కవిశిరోమణులచే రచియింపఁబడిన యభిజ్ఞానశాకుంతలాది మహానాటకంబులను విని కని యానందించియున్న యీసామాజికుల మనంబులను నవీనకృతనాటకంబులచే రంజించు టెంతయు నసాధ్యంబై యుండెడు దుర్ఘటంబగు కార్యంబుఁ దలపెట్టితిరి దీనిని మీరెట్లు నిర్వహించెదరో కదా.

సూత్ర-ప్రియా! ప్రాజ్ఞురాలవగు నీవు నట్లుయోచించెదవేమి? నామనోధైర్యమును దెల్పెద వినుము.

ఉ. క్రొత్తగఁ జేయఁగాఁబడిన ♦ కొంచెపు నాటకమయ్యదీనిలో
పాత్రినయప్రవర్తనలు ♦ దంచితభావచమత్క్రియార్థముల్
మెత్తనిమాటలుంగనిన ♦ మేటిపండితపామరాళికిన్
జిత్తముఁ గల్లవింపగను ♦ జేయునటంచుఁ దలంతుఁగోమలీ

అంతియేగాక.

క. మును నీక ప్రపితామహుఁ
డనఘుఁడు కవితాప్రసక్తి ♦ ననదృశుఁడగు వి
స్సనశాస్త్రి నామధేయుం
డనితరసాధ్యోరుకీర్తి ♦ నలరెను వింటే॥

చ. అందముగాఁ దదన్వయము ♦ నందుదయించుటఁ జేసి కీర్తి పెం
పొందకవిత్వనైపుణియు ♦ నొప్పెడు నీకవియందు నెట్లనన్
గ్రిందుగఁ జూత శాఖలనుఁ ♦ గట్టుట నంట్లుగఁ దత్ఫలంబులిం
పొందగ మాధురీరసన ♦ ముజ్జ్వలతే విలసిల్లుచుండవే॥

నటి- ఆర్యోత్తమా! సర్వజ్ఞులగు పండితోత్తముల సమ్ముఖంబున నవీనకృతి నాటకంబులఁ బ్రదర్శించి మెప్పువడయుట దుర్లభమని తలంచెద. అయిన నీ నాటకము:-

చ. వరలు నలంకిృయారహిత ♦ భావములన్ విధిరాణికెంతొ పే
దరికముఁ గల్గఁ జేయదుక ♦ దా? యటులైన నుబండితాళికా
పరమును గల్గఁ జేయదు వ్య ♦ ధాశ్రమమయ్యెడునట్టి పొత్తముల్
సరసకవిత్వముల్వినిన ♦ సత్కవిపీనులకింపుఁ గొల్పునే ?

సూత్ర- ప్రేయసీ! నేత్రేంద్రియపరిగ్రాహ్యమై సామాజికుల హృదయములం గరంచు నటులఁ బ్రదర్శింపఁ బడుటకీ నాటక కథాసందర్భములు బాగుగఁ దగియుండ గా విశ్రితానేక నాటకాలంకార ప్రవీణులగు విద్వద్బృందంబులకు హృద్యంబై యెసఁగునటుల మనమీ నాటకరాజంబును బ్రదర్శింపలేమేమో యని సంశయింపవలదు ఏమన:—

చ. భ్రమరములెల్ల సారమధు ♦ పానముఁ జేయఁగ భిన్న పుష్పసం
ఘములను వ్రాలునట్టులన ♦ ఖండమనీషుల నెమ్మనంబులున్
సమధికవృత్తిమై కవిత ♦ సారము నెల్లెడఁ గ్రోలఁ జూచునో
సుమసమగాత్రి, తత్కవిత ♦ సొంపు విచారణ సేయ నేఁటికిన్॥

నటి- సరే కాని, నాథా, ఇప్పటి కాలములో పండితులైన మహాత్ములరుదుగాను పం.

డితమ్మన్యులు విశేషముగాను నెల్లయెడల ప్రబలియుండుటవలన నట్టిదుర్మనీషుల దుష్పాండిత్యముచే మనప్రోద్యమంబున కెట్టి విఘ్నంబులుఘటిల్లించునో యని యొకించుక సంశయింప వలసివచ్చినది. ఇంతియెగాక, లోకములోసాధారణంబుగ మాత్సర్యంబనునది ప్రధానగుణమై ప్రవర్తిల్లుచున్నదికదా ?

సూత్ర-నీవట్లు దలంపవలసిన పనిలేదు. వినుము.

ఉ. పండితులౌ మహాత్ములకు ♦ పన్బఃకించిగుణంబులెంతురే
దుండినదుర్మనీషులు మ ♦ దోద్ధతిదోషములెంతురెట్లనన్,
బుండమునన్నిండుమేన్విడిచి ♦ పొందుగవ్రాలెడునీఁగ లంచలు
ద్దండత క్షీరనీరముల ♦ ధర్మమెఱింగి గ్రహించుక్షీరముల్ ।

మఱియు, మాత్సర్యంబను నదికుమతుల నాశ్రయించి యుండునేగాని సత్పురుషులదరిఁజేర నేరదు. కావున, నోప్రియా, కూళలయీర్ష్యాసంజనితరంధ్రాన్వేషణచిత్తవృత్తివలన మనప్రయత్నంబెంతయు విఘ్నాయత్తంబగునని శంకింపకుము. భగవత్కటాక్షముకలిగి యుండినచో నెట్టి దుష్కరంబైన కార్యంబును నిర్విఘ్నముగా నెరవేరుట నిశ్చయము. ఏమన:—

చ. జలజముఖి! యసాధ్యములె ♦ సాధ్యములయ్యెడు దైవసత్కృపన్
గలుగకపోవ వెంతఘన ♦ కార్యఫలానుభవంబులైన న
త్యలఘుమహిస్థలిన్ జలధి ♦ యందలిదీవులలోనఁగల్గునా
సలలితకన్యకాపురుష ♦ సంఘటనల్వినమే సతీమణీ.

సతి- నాథా, మీరుచెప్పిన సాదృశ్యముచే మనముప్రస్తుతము ప్రదర్శింపవలసిన నాటకకథాంశము నాకు బాగుగజ్ఞాపకమునకు వచ్చినది. కాని యయ్యదియెంత రసవంతమైన రూపకంబైనను విద్వాంసులెల్లరకు హృద్యంబై యొసఁగినంగదా మనమీకృతార్థతఁ జెందగలిగెదము.

సూత్ర- ప్రేయసీ. నీకట్టిసందియంబేల కలుగవలయును? విద్యాభివృద్ధిని గోరునట్టికోవిదులగు విద్వాంసులుమనయెడల సమార్ద్రహృదయులై యుండరికపోరలే.

కులం గణింపకయ యాదరబుద్ధి మన్నించి మనల నన్నివిధముల చేతను సంపూర్ణకృతార్థులుగఁ జేసెదరని నమ్మియుండును.

నటి—ఆర్యోత్తమా. నిశ్చయముగా నేనటుల నేనమ్మియున్నదానను. ఇంకనతివిస్తరమేల? మనమిట్లు వాక్యోపవాక్యంబుల కాలవిళంబనముఁ జేయుచుండిన నీసామాజికులు తాలిమి నిలుపలేరు. కావున ముందుగ నేను చేయవలసిన కార్యమెట్టిదియో నియోగింపుఁడు.

సూత్ర-సుందరీ. మనము ప్రదర్శింపఁబోవునది శృంగార రసప్రధాన నాటకముగను కతద్రసపోషకంబగు వసంతఋతువును లలితమగు నీకంఠ కలనాదంబు చే శ్రోత్రానందరసంబు వెల్లిగొల్పుచు వర్ణించి ముందుగ నీసభ్యులవీనులకు విందొనర్పుము.

చిత్తము. ఆలాగే చేసెదను.

జంఝూటిరాగము-చాపుతాళము.

(పల్లవి)

చూడుమిదె వసంతసమయశోభ లెల్లను

చరణములు.

1. దిటముగ హిమకరుఁడు మింటఁ ♦ దేజరిల్లఁగా
విటులు మదన బాధచేత ♦ వెతలనొందఁగా
కుటిలత మలయానిలుండు ♦ కొమరుమిగులఁగా
కటకముల దరంభికరుతములు ♦ కలయఁ జెలఁగఁగా ॥ చూడుమిదె

2. వెలయ నికుంజములు పుష్ప ♦ వితతి నలరఁగా
దళితకుసుమగర్భ సుధా ♦ ద్రవ మొసంగఁగా
గ్రోలిఝుంకృతులఁ దేఁటి ♦ కొదమ లొప్పఁగా
కలితవాహ్యాళి మదన ♦ ఘనుఁడు వెడలఁగా ॥ చూడుమిదె ॥

లయగ్రాహి.

కొమ్మలను గ్రాలుచు ఫ • లమ్ముల నుగ్రుంపుచు బి
కమ్ములటు సామవచ • నమ్ములను బాడన్
గమ్మనగు లేఁజిగురు • లమ్మెసఁగు కోయిలలు
చిమ్మునయనాగ్నులున • తమ్మునవెలుంగన్ ॥
దమ్ములసుధార సము • జుమ్మనుచు గ్రోలునల
తుమ్మెదల మాత్రిపర • నమ్ములను కల్యా
ణమ్మువనలక్ష్మికిది • రమ్మగ వసంతునికి
నిమ్మగను సాఁగుసుఖ • దమ్మగఁగనంగన్.

సూత్ర-ఆహాహా! కోమలీ. సకలజన మనోల్లాసకరంబగు నివ్వసంతంబు తావకీన మనోహరగానకలాపాభిజ్ఞవచే నెంతయొప్పుచున్నదో చూడుము.

౯. తే. కమ్మనౌనీదు కలకంఠ • కంఠనాద
మహిమఁగాబోలు మోడులు • మఱిఁజిగిర్చి
మంచుబిందుల మిషచేత • నించుచుండె
బాతిరో! కంటె యానంద • బాష్పములను॥

నటి-చ. మనములరించుగంధగిరి • మారుతముల్ పికకాకలీకల
స్వనములు లేత వెన్నెలలు • సౌరభముల్పొద జల్లునట్టిక్రొ
న్ననలును తేఁటి ఝాంకృతుల • నారతముల్ మిథునోత్సవంబుగాఁ
దనరెడు నివ్వసంతమున • ధారుణినెవ్వరు సంతసింపరో॥

సూత్ర-సతీమణీ! వినుము. అట్లు సంతసింపని వారునుగలరు.

చ. సుతులువిధేయులై హితవ • చోవిజితాత్ములుఁగాక యుండి వ్య
ర్థతనిహసౌఖ్యముల్విడిచి • దర్పకసాయకపఙ్క్తికోడి సం
తతమును భ్రాంతులందగిలి • ధైర్యము దూలఁదపింతురంచు పె
న్వ్యతలమునుంగు రాజులను • వేడుకలెక్కడి వంబుజాననా?

కావున నిప్పుడు రత్నాకరుండు జరాభారపీడితుండై రాజ్యభారమును దానింక వహింపఁజాలక నిజపుత్రునిపై మోపం దలంచి ముందాతనికొరకైన వివాహకార్యాలోచనా పరతంత్రతఁ గళత్రద్వితీయుండై యమాత్యులు కొలువసభకు విచ్చేయఁ దలంచుచుండె.

నటి- అటులైన, నాథా! మనమింక నిటునిలుచుట కర్జంబుకాదు. కాలాతీతమగుచున్నది. కర్తవ్యంబాచరింతము, రండు.

సూత్ర- మంచిది. (అని ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

ఇతి ప్రస్తావన.





# రోహిణీసుధాకరవిజయము.

## ప్రథమాంకము.



[రత్నాకరమహారాజుగారును మందాకినీరాణియుఁ బ్రధానమంత్రు
లగు శ్రుతకీర్తి విశారదులతోఁ బ్రవేశించుచున్నారు.]

రత్నా-ప్రేయసీ! మన కుమారరత్నము యౌవనవంతుండై యున్నవాఁడు. జరాభారపీడితుండనగు నే నింక నీ రాజ్యభారమును వహింపఁజాల. కావున వానికి సకల సద్గుణపేటియు ననన్యసామాన్య సుందరాంగియు నగు నొక కన్యాతిలకంబునుఁ బరిణయం బొనరించి రాజ్యభార మంతయు వానిపై నుంచి నే నింక విశ్రాంతిఁ జెందఁగోరుట న్యాయమే కదా?

మందా-ప్రాణేశ్వరా! పుత్రసంతాన వైభవంబునకు సార్థక మిదియే కదా. మీరు ముఖ్యముగ నటులనే జరిగించి కృతార్థుల రగుఁడు. అయితే నాథా! మనపుత్రుండు వైవాహికోద్యమంబునకు సుముఖుండై యుండెనా?

రత్నా-ప్రియా. లేదు, అతండు లోక జ్ఞానంబునం దల్పానుభవము కలవాఁడై బాలుం డగుటవలన నిపుడు విరాగివలె పరిణయ పరాఙ్ముఖుండై యున్నవాఁడు. కాని వాని చిత్తమును మరలింపఁ జేయుటకై మన సచివాగ్రగణ్యులగు శ్రుతకీర్తి విశారదుల నేమించితి. (అని మంత్రులతో) మంత్రిశేఖరులారా! మీహితోపదేశ మేమైన నా పుత్రుని వైవాహిక ప్రయత్నము విషయమై కార్యకారి యయ్యెనా?

శ్రుత- దేవా. అబ్బాయిగారు మహావైరాగ్యం బవలంబించి మే మెంత బోధించినను పరిణయం బొల్లమని భీష్మించి యున్నారు. అట్టి మీగారాబుపట్టి పట్టును దేవరవారే నిగ్రహింప సమర్థులరు కాని మే మెంతటి వారము?

విశా- మహారాజా?

క. కూపస్థ మండూకము క్రియ
నాపోవని గ్రంథచింత • నా లోలుండై

దీపించు మీ తనూజుం
డేపగిది నెఱుంగఁ జాలు ♦ నిహ సౌఖ్యములన్.

కావున నో దేవా! ముందుగ మీ పుత్త్రుని నిరంతర విద్యావ్యాసంగంబును సంక్షేపింపఁ జేసివాని చిత్తంబునం దనురాగ బీజంబును నాటి శృంగార రసాంకురంబును గలుగఁజేయఁ బ్రయత్నింతురుగాక.

రత్నా. అమాత్యులారా. ఏమి! నా పుత్త్రుని మాఢ్యము.

క. తెలియఁ దనూజునిఁ బడసితి
సలలిత సద్వ్రతములోలి ♦ సలుపుచు; నతఁడున్
గుల దీపకుఁ డగునని నేఁ
జెలఁగితి వాఁ డెంతమూర్ఖ ♦ చిత్తుం డయ్యెన్.

అన్నా! గృహస్థయినం గాని క్షత్త్రియ పుత్త్రుండు రాజ్యార్హుండుఁగా నేరఁడని పెద్దలు చెప్పుదురు. నే నింక నీ రాజ్యభారము నెవరిపాలు జేసెదను? (అని శ్రుతకీర్తితో.)

మంత్రిపుంగవా.

చ. జనకుని యాజ్ఞ మీరుచు య♦శంబుఁగులంబు సముద్ధరింపఁగా
మనమున నిచ్చలేక సభి♦మానముఁ ద్రోచి చరించుచుండెనా
తనయుఁడు నీతిబాహ్యుని వి♦ధంబున నెంతము వీఁడు సింక నే
మనఁగలవాఁడ నాహృదయ♦ మారడిఁ జెందెడు నేమి చెప్పుదున్.

శ్రుత. దేవా! విన్నగింపుఁడు

చ. చనువున మీ పదాబ్జములఁ ♦ జాయ మెలంగెడువాఁడు లోకవ
ర్తనము తెఱంగు నెట్లెఱుగు? ♦ ధర్మమునప్పి నటించు వానిపై
గినియుట పాటిగాదు, పరి ♦ కింపఁగ నేర్పున బోధ సేసినన్
వినఁడె? యవస్యమాతఁడు వి ♦ వేకియ కాఁడె? ధరాతలేశ్వరా.

కావున నో మహారాజా హితవచనంబులచే మీ తనూజుని వైవాహికోద్యమంబున కనుకూలింపఁ జేయుదురు గాక

మంద. ప్రాణేశ్వరా! ఒక చెంపఁగొట్టిన నీరును, వేఱొక చెంపఁగొట్టిన పాలును

గల వసి బాలునకులోక సామాన్య వర్తన ప్రభావ మెట్లు తెలియంగ నయ్యెడు? అట్టివాని యవ్యక్తంబునకు మీరలుగ నేల? హితోపదేశంబులచే వానిఁ జక్కఁ జేయఁ బ్రయత్నింతురు గాక.

రత్నా. సుందరీ! నీవుకూడ లాలనచే వాని చిత్తమును గరంగింప యత్నింపుము జననినైన నీ యెడల నాతండు మిక్కిలి భయ భక్తులు కలిగి యుండు వాఁడు కదా?

సుందా. నాథా! సకల కలా కోవిదుండై నిర్వికార చిత్తుండగు మన సుధాకరుని మనంబుఁ ద్రిప్ప సర్వజ్ఞులగు మీరే సమర్థులరు కాని కించిద్జ్ఞురాల నగు నేనెంతటి దానను? అయిన నా యోపినంత వట్టు హిత వచనంబులు చెప్పి వానిని వైవాహికోద్యమంబున కొప్పింపఁ బ్రయత్నించితిని కాని నా కృషియంతయు వ్యర్థమైనది. కావున ధీమంతులరగు తిమరే మృదుమార్గ మున బోధసేసి సఫలీకృత మనోరథు లగుదురు గాక.

రత్నా. విశారదా! నయవిశారదా! మన సుధాకరుం డిపు డేమి చేయుచుండెనో నీ వెఱుంగుదువా?

విశా. దేవా! యువరాజుగారు పుస్తకాగారంబున దీర్ఘ చింతాపరులై కూర్చుండి యున్నారు.

రత్నా. ఆఁ! ఏమి యీ చిత్రము! వింటివా విశారదా. నాపుత్రుఁడు—

ఉ. ప్రాయమునందు మానవులు ♦ వారిరుహాక్షులఁ బెండ్లియాడి పు
ష్పాయుధ రాజ్యవైభవ స ♦ మన్వితులై చెలువారుచుండి య
త్యాయత కీర్తిచే నెగడ ♦ నచ్చరు వయ్యెడు దీర్ఘ చింతలన్
జేయఁగ నేల? నా సుతుని ♦ చిత్తము నెట్లు మరల్ప నేర్తునో.

శ్రుత. దేవా! మీ ప్రియ కుమారుని చిత్తమిపు డెంతయు డోలాయమాన మై యున్నయది. ఏమన—

క. పరిణయ మగుటకుఁ దనమది
సరిపడ దటంచు జేయుకున్న ♦ జననీ జనకుల్
కరములుగుదు రనుచును దా
విరివిగ లోలాత్ముఁ డగుచు ♦ వెతల మునుంగున్.

కావున నో నరేంద్రచంద్రమా! నీపుత్రుని నిటకు రప్పించి తగునట్లు లాలించి వానికి సామాద్యుపాయంబులహితబోధ సేసి వానిచిత్తంబును బరిణయాయత్తంబగు నటులఁ జేయఁ బ్రియత్నింపుఁడు.

రత్నా. మంచిది. అటులనే చేయుదము. (అని ద్వారముపద్దనున్న సేవకునితో) ఓరీ, సేవకా నీవు పోయి సుధాకరుని మాయొద్దకు శీఘ్రముగఁ దోడ్కొనిరమ్ము.

సేవ. చిత్తము మహా ప్రభూ. (అని నిష్క్రమించి వెంటనే సుధాకరునితోఁ దిరుగ ప్రవేశించుచున్నాఁడు.

సుధా. (స్వగతము) పరమార్థ వృక్ష మూలచ్ఛేద కారకులగు భామినీ జనంబులఁ జేపట్టనేల? దుర్గతుల పాలు కానేల?

చ. అలికుల వేణిచే దశర ♦ థావని పేంద్రుఁడు వీడె ప్రాణముల్
వలపునఁ బొంది జెన్నొయల ♦ వాలుకనుంగవ తళ్కుబెళ్కు చూ
పుల భృకుటీ విలాసములఁ ♦ బొందిక మాటల నెట్టి వారలన్
గలచెద రీ మృగాక్షులు క ♦ నన్మతి మృత్యువు పేఱయున్నదే.

రత్నా. (కుమారుని చేరంజీరి దగ్గఱఁ జేర్చి యాలింగనం బొనర్చి చుంచు దువ్వుచుఁ బుకంబుఁ బుణుకుచు.) కుమారా, పరిపూర్ణ యౌవన వంతుండ వయ్యుఁ బరిణయంబొల్లక నిట్లు భీష్మించి యుండ నేలరా తండ్రీ.

మ. తనయా నీవిటు మూర్ఖచిత్తునికియన్ ♦ ధర్మంబె రాజాన్వయం
బున జన్మించి విరాగివై పొలుపటున్ ♦ బూఁబోణిఁ బెండ్లాడి నె
మ్మని సామ్రాజ్య రమావిభూతిగని పే♦ర్మిన్ భూజనోల్లాసివై
జననిన్ నన్నును వృద్ధులన్ దనుప నీ ♦ స్వాంతంబునన్ దోఁపదే.

సుధా. తండ్రీ, నన్ననుగ్రహింపుఁడు.

ఉ. లోకమునందు మానవులు ♦ లోలతఁ గామిను లన్వరింపుచున్
భీకర మోహ పాశములఁ ♦ బెద్దయుఁ జిక్కితపించుచుండ రే
పాకట భంగి చేడెల వి ♦ వాహముఁ జేసికొనంగ రాదు ద
ర్వీకర మట్ల కామిని వ ♦ రించిన వాని హరింపఁ జూచెడున్.

మఱియు.

ఉ. భూతల నాథ కామినుల • మోహాతమంబున మున్గి వారి దృ
క్పాత శరాగ్ని కీలలఁ గృ • శత్వము నొందెడు పాపరాశి దు
ర్నీతి నెఱుంగ రాదె, కరు • ణింపుఁడు తుచ్ఛ భవాంధువందు నన్
బ్రాతిగఁజిక్కఁ జేయకుఁడు • ప్రార్థనఁ జేసెదతండ్రి మిమ్ములన్.

మంగా. కుమారా! పూజ్యులైన మీతండ్రిగారి యాజ్ఞను దిరస్కరించుట నీకు నీతి కాదు. వరప్రసాదివై కలిఁగియు నీ విట్లు విరాగుండవై సంసారంబొల్లకుండిన మన వంశం బెట్లు విస్తరిల్లు. స్త్రీలలో సహితము రూపవతులును గుణగణాలంకృతలు నగు సాధ్వీమణులు లేరా. మున్ను చంద్రమతి నిజపతివ్రతామహిమంబున నాత్మ భర్తయగు హరిశ్చంద్ర భూపాలుని కౌశిక మాయాప్రకల్పితదారుణక్లేశపరంపరల నిస్తరింపఁ జేసి యాతని నిత్యసత్యవ్రతంబును సుస్థిరంబుగ నిలుపలేదా. ద్రౌపదీదేవి తనభర్తలతోఁ గూడి యనేక వనవాసాది క్లేశంబుల ననుభవింపుచుండియు నెన్నండును వారి యాజ్ఞల నుల్లంఘింపకఁ గను సన్నల మెలంగుచు పరమపతివ్రతా శిరోమణి యనభూమిపై కీర్తి వడయ లేదా? సాధ్వీమణి యగు ననసూయ మున్నొక కాలంబున నాత్మీయ పతివ్రతా ప్రభావంబుచే త్రిమూర్తులను వంచింపలేదా. పరమ పావని యగు నిజ కాంత వల్లనే సత్యవంతుండు పంచత్వంబు నొందియుఁ బునర్జీవితుండై యొసంగె నన విన లేదా. ఇట్టి గుణవల్లులగు సాధ్వీమతల్లు లెందరు కలరు? కావునఁ గులశీల వయో రూప గుణంబుల వన్నెకెక్కిన కన్యకామణి నొర్తు నెంచైన నరసి నీకు వివాహము చేసెదము. నీవు మాఱు మాట యొసంగకఁ గన్యా పరిగ్రహణం బొనరించి రాజ్య భారమును వహించి వృద్ధులైన మీతండ్రిగారికి విశ్రాంతి యొసంగి సకల జన రంజకంబుగా రాజ్యమును బాలించుచుఁ గుల దీపకుండవై యశంబు వడయుము,

సుధా. తల్లీ! మీరెంత చెప్పినను పరిణయంబున కే ననుకూలింపఁ జాల. ఏగ్రంథమందుఁ జూచినను కామినీ జనంబుల దుస్స్వభావ జనితంబులగు ఘోరకృత్యంబు లెన్నియో గాన్పించెడు, ఇంతయేల.

శా. తల్లీ! యెట్టివిలాసినీ వశులఁ జే • తఃప్రీతిఁ బెండ్లాడి రం
జిల్లం గోరిన నీప్రణతియముచేఁ • జిత్తంబు సంసారమున్

కల్లోలాంబుధి జిక్కి ధైర్య ముడలం ♦ గా దుష్క్రియా శాంతుఁ డో
భిల్లుంగాని జడుండు పొందునె సుఖ ♦ స్ఫీతావ్య యానందముఁ గా.

మఱియు.

తే. శాస్త్రవిజ్ఞాన ఘనుఁడైన ♦ శాంతుఁడైన
పూర్ణనయ శాలియైన ప్ర ♦ బుద్ధుడైన
చంచ లాక్షుల మోహ పా ♦ శములఁ జిక్కి
సద్గతి నెసంగు నే యెట్టి ♦ చతురుఁడైన.

శ్రుత. రాజకుమారా, మహీ తలంబున సకల జన్మంబులలోను జ్ఞానాస్పదం బగుమాను షజన్మం బత్యుత్తమంబు. అంసఖండ సామ్రాజ్యలక్ష్మి నిధానంబగు క్షత్రియ వంశంబునం దుద్భవించు టతి దుర్లభంబు. అట్టి మహావైభవసమన్వితంబగు సుక్షత్రియ వంశంబునం దుద్భవించి భోగ్యంబగు నైయ్యభోగంబుల నొల్లక నిట్లు బరమ వైరాగ్యంబును బూన నీ బోంట్ల కుచితంబె.

మఱియు.

చ. జలజవిలోల లోచనల ♦ సంగతినొప్పి సురేంద్ర వైభవం
బెలమినిఁబొంది రాజ్యరమ ♦ నేలుచుభక్తినిఁదల్లిదండ్రులన్
సలలితపూజలం దనిపి ♦ శశ్వదుదార యశఃకలాపుఁడై
బొలిచెడు బుత్రుఁడేతలపఁ ♦ బూర్ణకృతార్థుఁడుభూవరాళిలోన్.

ఇదియునుంగాక.

క. మును ప్రహ్లాదుండును యమ
తనయ విభీషణులు భక్తి ♦ తత్పరు లయ్యున్
ఘనమగు గృహస్థ ధర్మము
లను పరిపాలించి మోక్ష ♦ లక్ష్మిన్ గనరే ?

సుధా. మంత్రిపుంగవా. క్రూరుండగు మీనకేతనుని పరివారంబైన కామినీ జనంబుల వరించు టగ్గి నాడిగట్టుటయ కాదే. ఏమన,

ఉ. మారుని వేడికోలలన ♦ మానిని వీక్షణ జాలమొప్పఁగా
మారుని తేజిమో యనఁగ ♦ మానిని పల్కులు పొల్పెసంగఁగా

మారుని వైజయంతియన ♦ మానిని నేత్ర యుగంబు రాజిలన్
మారుఁడు మాఱుఁడై జగము ♦ మార్చుచునుండఁడె తత్సహాయతన్.

కావున నేను వివాహంబొల్ల. రాజ్యంబొల్ల. నన్ను నిర్బంధింపక మిన్నకుండుఁడు.

రత్నా. అన్నా, నా పుత్రుం డెంత మూర్ఖుండై ప్రవర్తించుచున్నాఁడు. వీనికెట్టి దుర్మంత్రం బెవ రుపదేశించిరో కదా, కుమారా.

ఉ. నీవు వివాహమాడి రమ ♦ ణీమణిఁ గూడి విశేషరాజ్యల
క్ష్మీ విభవంబుఁ గైకొని య ♦ శేష జనుల్ కొనియాడ నేలుచున్.
భూ విదితోరుకీర్తిపరి ♦ పూర్ణుఁడవై యలరారి వంశముం
గావ నెసంగు నిన్నుఁ గనఁ ♦ గన్నులు చల్లనఁ గావె పుత్రకా.

మఱియు .ఉ. పంతము వీడకుండితివి ♦ పాడియె నీకిటువంటి మొట్టవే
దాంతము నేర్పిరెవ్వరు? ముదంబున నానుడి నాలకించి ని
శ్చింతను సత్కులీనయగు ♦ చెల్వనొకర్తను బెండ్లియాడియుం
సంతతి నిల్పి రాజ్యరమ ♦ సమ్మతిఁ జేకొని కీర్తిఁ గాంచుమీ.

మందా. తనయా. యెవరెంత చెప్పినను వినక నీవిట్టి మూర్ఖపు పట్టు పట్టుట పాడి కాదు. వృద్ధులమైన మా కేమగతియు ఏవకావే. అయ్యో "నాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళు" అనునట్లు నీవు పట్టిన పంతంబును విడ నొల్లక నిట్లు భీష్మించి యుండిన మాకు తరణోపాయం బెట్లు కలిగెడురా తండ్రీ. పరమ పవిత్రులైన మీ తండ్రిగారి మాట వినుము. మా ముద్దు చెల్లింపుము.

సుధా. ఓ జననీ జనకులారా! అజ్ఞానాంధ ప్రదాయకులును కలుష క్రియాకరణవిషగర్తలు నైన కామినీ జనంబులఁ బరిగ్రహించిన మాయా సంసారవ్యాపృతి మెండగు. అందుగృహస్థుఁడై నమాన వుండరిష డ్వర్గంబులను పాశంబులచేఁ జిక్కువడి జాలరివాని యురులం దగులుకొనిన విసారంబు చందంబునను లూతాతంతువర్గంబునఁ దగులుకొనిన కీటకంబు మాడ్కి నిఁ బొరలుచుండియు మాయావ్యామోహంబున నీషణత్రయాలోలుండై బహువిధంబులగు ప్రకృతి విషయాసక్తులం దగిలి గాసిల్లుచుండు. ఇదియునుఁ గాక.

తే. ఘన ఘనాంతర విద్యుత్ప్ర ♦ కాశకంబు
లఖిల భోగ పరంపర ♦ లనిలచలిత

జలజదళనీరశీకరం ♦ బులు మనుష్య
జీవితంబులు ప్రాయమ ♦ స్థిరము తలఁప.

పితరులారా. అపవర్గమార్గము నభిలషించి జీవన్ముక్తులు కాఁదలంచిన వాచంయములందఱు నస్థిరంబులగు నిట్టి తుచ్ఛభోగంబుల నాసించియుండిరే.

విశా. మిత్రమా. రాజకుమారా, ఉదాహరణములు కావలెనా? వినుము.

మ. ప్రపదభ్రాంతి నరణ్యమందెసగు నా ♦ వాతాంబుపర్ణాశనుల్
తపసుల్ గౌతమ జామదగ్న్య భృగుద ♦ త్తాత్రేయ వాసిష్ఠక
శ్యపజాబాలిపరాశ రాత్రిముని వి ♦ శ్వామిత్రులే కాంతలన్
జపలత్వంబునఁ గోరఁగానిటు లహో ♦ శంకింపనీ కేటికిన్.

బాల్యుఁడవైన నీవిట్టి వైరాగ్యమును బూనరాదు. వినుము.

చ. గుణనికురంబ సచ్చరితఁ ♦ గోమలసుందరగాత్రిఁ గన్యకా
మణిని వివాహమాడి జన ♦ మాన్యుఁడవై పవిత్రపుత్రయాచక
ప్రణుతులనొప్పుచు న్విజిత ♦ రాజకిరీటమణిప్రభన్ గృహాం
గణము నలంకరించి చిర ♦ కాలము కీర్తి నెసంగరాదొకో.

శ్రుత- యువరాజవతంసమా! దైవస్వరూపులైనట్టియుఁ బరమపావనులైనట్టియు జననీజనకుల యాజ్ఞను తిరస్కరించుట పుత్రులకు శ్రేయస్కరము కాదు. పితరులను భగవత్సదృశులుగ భావించి వారలనిరంతరము భక్తితాత్పర్యంబులఁ బూజించు పంచమజాతులు సహితము గృహస్థాశ్రమం బవలంబించియు మహామహులనంబరఁగి ముక్తింగాంచెదరు. ఎట్లన, మాంసమును విక్రయించి బ్రతికిన కిరాతకులసంజాతుండగు ధర్మవ్యాధుని చారిత్రంబును జ్ఞప్తికిఁదెచ్చికొనుము. మఱియు.

చ. గురుతరరమ్యదీపములు ♦ కుంఠితమై చెలువారినన్ సుధా
కరుఁడు నభంబునందొరయఁ ♦ గాంతిసలముజ్జ్వల చంద్రికారుచుల్
బరఁగిన తారకావళులు ♦ భాసిలుచుండినఁ గాంతలేనిచో
నరయనవచ్చు నంధతమ ♦ సంబున కున్ నృపపుత్ర రాజ్యముల్.

సుధా. మంత్రిశేఖరులారా! మీరెంతయు నజ్ఞానాంధకార నిర్మగ్నులై యున్న వారుకదా. చూడుఁడు.

తే. సకియచూడ్కియె విషవహ్ని ♦ సదృశమరయఁ
బొలఁతివిభ్రమ మాభోగి ♦ భోగతుల్య
మట్టిజవరాలినోర్తుఁ జే ♦ పట్టువెల్లఁ
బన్నగంబునుదరిఁ జేర్చు ♦ పగిదికాదె.

ఇదియునుఁగాక, ప్రకృతివిషయ వాంఛాలవాలంబును, తామసరజోగుణ సంకీర్ణమూలంబును, చింతాపరంపరా పత్రంబులును, అస్థిరానంద ప్రదర్శక గర్భాంతర దుఃఖక్రిమి సంకలితైహిక వినోద పుష్పంబులును, పాపకర్మ ఫలంబులును, గలిగి యొప్పుచుండు సంసార వృక్షంబు నాశ్రయించి, దుర్గతుల పాలుకానేల? వినుండు.

మ. అమలాంగిన్వరియింపఁజింతయు, నప ♦ త్యప్రాప్తికై చింత కూ
టమి మెండై నభరింపఁ జింతయును, జా ♦ డ్యగ్రస్తతన్ జింత దుః
ఖములుం గల్గినఁజింత, సౌఖ్యములురా ♦ కన్ జింత సంసారకూ
పమునం ద్రెళ్ళినవారికెల్లనివిసం ♦ ప్రాప్తంబులౌ చూడుఁడీ.

రత్నా. (సామర్షంబుగ) డింభకా. ఎవరెంత బోధించినను నీపట్టిన పంతంబును విడువకుండితివి. నీవుమూర్ఖుండవై వివాహంబొల్లనిచో నీకురాజ్యార్హతలేదు. అనేకతరములనుండి వన్నెవాసిఁ గనుచున్న యీమన సద్వంశము నీమూలమున నంతమయ్యెడు, ఇట్టికులపాంసనుండవగు నీవు పుట్టనేమి? గిట్టనేమి?

మందా. తనయా. నీతండ్రిగారి యాజ్ఞను దిరస్కరించి యాయన యహంకారంబునకు లోనుగాకుము. అయ్యో, పరమశాంత మూర్తులగు మీతండ్రిగారు నిర్దయత్వంబునుఁ బూని నిన్ను శిక్షించుచుండిన నేనెట్లుఁజూచి సహింపఁ గలిగెదనురా, తండ్రీ? తల్లినైన నామాటవినుము. నీవలనఁ గాక మాముచ్చటలన్నియు నెట్లుదీరెడు చిన్నతనమునుండియు నిన్నతిగారాబముగాఁ గనుచుటలో ననేక యుపవాసాది క్లేశంబులకులోనై నీకొఱకు మేముపడిన యిడుములన్నిటికి నేమి ప్రతిఫలంబొసంగెదవు? నీకన్నమాకు వేఱొండు శరణ్యంబు కలదే? ఇంకనైన నామాటవినుము. (అని భర్తతో) ప్రాణేశ్వరా. పుత్రునిపైఁ గినియ

కూఁడు మీరలిగిన నీరేజజగంబులు వడంకు. అప్రాజ్ఞుండతఁడు బాలుండగుటచేత వీనినిప్పటికిఁ గరుణించి పునరాలోచనముఁ జేసికొన వీనికి మఱికొంచెము వ్యవధి యొసంగుటయ మేలని తలంచెద.

రత్నా- సుందరీ. కులశీలంబు లెఱుంగని కఠినచిత్తుండగు వీనిపైఁ జాలిబూనరాదు. నీవుతొలంగియుండుము. (అని పుత్రునితో) అర్భకా. సమాధానముఁ జెప్పక యిన్నకుంటి వేమిరా?

సుధా.ఆ.తల్లిదండ్రులార! ♦ ధర్మంబుఁదలపఁడ
స్థిరములై హికములు ♦ తెలిసిచూడ;
బుద్బుదములవంటి ♦ భోగకాంక్షలదుఃఖ
పుంజయుతభవాబ్ధి ♦ ముణ్గఁదగునె?

రత్నా. మంచిది. మంచిది.

విశా. మిత్రమా! పరమ పూజ్యురాలగు మీతల్లిగారి పలుకులాదరింపుము.

మ. నవమాసంబులు నిన్ను మోచికనినా ♦ నాకష్టములోర్వ్పంది పెంచి వినోదింపఁగనున్న తల్లిసుపుత్రుల్ ♦ చెల్లింపఁగారాదె యీ
భువినక్షీణకృపాకటాక్షమునని ♦ బోషించుమీతండ్రియా
యువనీపాలునియాజ్ఞలన్ నెఱపినా ♦ ఖ్యాంబందగాలేవొకో.

సుమతి- రాజకుమారా! ఏలనీవింత మురస్కారమును వహించెదవు? పరమశాంతమూర్తులగు మీతండ్రిగారికి నాగ్రహముఁ గలిగింపనేల? నీవిదుమలఁగుడువనేల?

క. ఆయతరూపంబునసుమ
నాయకుఁడవు కాకపక్ష ♦ సంయుతుఁడవునీ
పాయపుబాలురు నవ్వఁగ
నాయమొవైరాగ్యవర్త ♦ నంబుకుమారా.

రత్నా-(మహాకోపముతో) అరే. మూర్ఖా. నీకింత మాధ్యమేమిరా? నీపట్టిన పంతంబును విడువకుంటివేని నిన్నిప్పుడేమి చేసెదనో చూడుము. (అని గద్దించుచుండగా సుధాకరు సహించుచున్నాఁడు.

మందా. (పెనిమిటిని వారింపుచు.) నాథా! క్షమింపుఁడు. క్షమింపుఁడు. అయ్యో ప్రాణేశ్వరా. చిరకాల మనపత్యులమైయుండి పరితపించి లేక లేక నపూర్వముగఁ గనుంగొనిన మా వరప్రసాదియగు పుత్రుని యజ్ఞానము నిప్పటికి సైరింపుఁడు. చిన్నతనమునందియు మిగుల గారవంబునఁ బెనిచినందున వాఁడిప్పుడు మీయెదుట నిట్టి భల్లూకపు పట్టుపట్టుచుండెనేకాని మఱియొకటి కాదు. వానిపట్టుదలను దల్లిదండ్రులమైన మనమే సహింపలేకున్న మఱియెవ్వరు సహింతురు? కావున మీరాగ్రహింపకుఁడు. మీకు నమస్కరించెద.

సత్యా. సుందరీ; నీమాటలేమియు నిప్పుడు కొఱగావు. దండనవల్లఁగాని వీని ముష్కరము మానదు. నీవీ విషయంబునఁ బూనికొనకఁ దొలంగి యుండుము.

సుధా. తండ్రీ! వినుండు.

చ. సతతముఁ బెండ్లియాడిభవ ♦ సాగరదుఃఖపరంపరోర్మికా
వితతిని మున్గితేలుచును ♦ వేసటఁ గాసిలుచుండఁ జాలనో
క్షితితలనాథ! యేమిననుఁ ♦ జేసిపఁ జేయుఁడు కాని నామనం
బలివలఁ గూర్చి దుఃఖముల ♦ నార్తిఁ గృశింపఁగ నోపదెమ్మెయిన్.

(కోపోద్దీపితుండై) ఓరి కులద్రోహీ! అలాగునంటరా. నీమౌఢ్యము నపనయించెదఁ జూడుము. వింటివా, విశారదా వీనిముష్కరమెట్లుండెనో. శ్రుతకీర్తి.

క. జననీజనకుల యానతి
వినవొల్లని దుర్మార్గచిత్తు ♦ విగతవివేకున్
గొనిచనిచే బంధింపుఁడు
కనికరమెద నేది బంది ♦ గంబున వీనిన్.

మంత్రిశేఖరులారా! మాయాత్మజుఁడైనట్టియుఁ గులద్రోహియైనట్టియు వీని మొగముఁ జూడరాదు. కావునఁ వీనిని నాయెదుటనుండి శీఘ్రంబ తొలఁగించి చెరసాలయందుంప నియోగింపుఁడు.

మందా. (కడుదుఃఖితయై) ప్రాణేశ్వరా! కరుణింపుఁడు. కరుణింపుఁడు. సుకుమార శరీరుఁడగు మన యర్భకుండు కారాగృహంబున నవయుచుండిన నే నెట్లుజూచి సహింపఁగలిగెదను? పుత్రుని నే నెట్టు బెడబాసియుండఁగలను? పరిసన్నమా

ర్థులరై కటాక్షించి నాకు పుత్త్రభిక్షంబుఁ బ్రసాదింపుఁడు. మీకు నమస్కరించెద.

రత్నా. ప్రియసఖీ! నీవిట్లు బలుమారు వాని పక్షంబవలంబించి పలుకుచుండుటచేత నే వానియుపకారం బంతకంత కధికమగుచున్నయది. వినుము.

తే. గీ. తల్లిదండ్రులపలుకు లా ◆ దరణబుద్ధిఁ
వినగనొల్లనికఠినాత్ము ◆ విడువవలయు;
కులమువారికి నపకీర్తిఁ ◆ గూర్చుసుతుఁడు
కలుగనేటికి? తల్లుల ◆ కడుపుచేటు.

కావున నీవిచ్చట మాఱుమాటేమియు నొసంగక నంతఃపురంబునకుఁ బొమ్ము.

మందా. (కుమారునితో) అయ్యో! తనయా నిన్నెడబాయఁజాలక పరితపించుచున్ననాపైజాలిఁబూనవేమిరా, తండ్రీ. కుసుమకోమలంబగు నీమేను దుర్గంధబంధురం బగు ప్రాచీనకర్కశశిలాగారంబున శయనింపనెట్లోర్చెదు? మీతండ్రిగారి మాటవినుము. నన్ను దుఃఖపెట్టకుము.

(అని మందాకిని నిష్క్రమించుచున్నది.)

సుధా. జనకా! అజ్ఞానులవలె మాయామోహితులరై పెండ్లాడుమని నన్నేలనిర్బంధించెదరు? వినుండు.

మ. సకలక్ష్మావరులున్ మహీస్థలినిసం ◆ సారక్రియాకాంక్షఁ బా
యక సామ్రాజ్యవిభూతిఁ జెన్నలరి య ◆ త్యంతంబు మోహాంధులై
ప్రకటౌద్ధత్యము నన్నిదించి సతమున్ ◆ రంజిల్లిరే కానియై
హికసౌఖ్యంబుల నమ్మ, వారలిపుడే ◆ రీనిత్యులై యుండిరే?

అస్థిరంబులగునీయైహికసౌఖ్యంబుల నేలనమ్మెదరు? నానిశ్చయము వినుండు.

చ. గడుకొని యోగమార్గరతి ◆ గల్గినమానసమంతరాత్మతో
విడువక నేకమై వెలుఁగ ◆ విశ్రుతుఁడై చెలువొందువానికిన్
బడతుల సౌఖ్యమేమిటికి? ◆ భాగ్యము లేటికి? వేయునేల నా
నుడువు వినుండు నామదిమ ◆ నోజసుఖంబులఁ గోరదెమ్మెయిన్.

రత్నా. మంచిది. విశారదా! వింటివా యీమూర్ఖుఁడు నన్నుఁగూడఁ దిరస్కరించుచున్నాఁడు. ఇట్టిదుర్మదాంధుని దండించుటకు మీ రేల సందేహించుచుంటిరి?

విశా. దేవా! అబ్బాయిగారిని కారాగృహము నందుంచినచో లోకసామాన్యవర్తన మాతనికి దృగ్గోచరంబుగాక వానిచిత్తము మఱింతయెక్కుడు వైరాగ్యంబునుఁ బూనియుండెడు. అందువలనలాభ మేమి? దేవరవారు మఱియొకదండనోపాయము నూహించిన మేలని తలంచెద.

రత్నా. మంత్రిపుంగవా! అట్లుగాదు. నామాటకడ్డుచెప్పకుము. వీనినిప్పటికి మనయుద్యానవన పరిసరప్రాంతంబునంగల పరులకుఁ జొరశక్యము కానియేకాంత ప్రాచీన కారాగృహము నందుంచుమనటుల మన తలారుల కాజ్ఞాపింపుము పిమ్మట మఱియొక సాధనోపాయంబును విచారింప వచ్చును. శ్రుతకీర్తీ! మనమింకనిట నిలువవలసిన పనియేమి? మనమింక నాస్థానముఁ జాలింతము

(అని శ్రుతకీర్తి రత్నాకరులు నిష్క్రమించుచున్నారు.)

విశా. (సుధాకరునితో) మిత్రమా! ఏలనీవిట్లు బేలవై చెడియెదవు? నీకు కారాగృహమునందుండుటయే శ్రేయమనితోఁచెనా?

సుధా. సఖా! నాచిత్తముపరమార్థ దాయకంబగు మఱియేపనికైన నంగీకరించునుగాని కన్యాపరిగ్రహణంబునకు మాత్రమిచ్చగింప నేరదు.

చ. పరమపదంబుఁ బొందుకల ♦ భాషిణులన్వరియించుకంటెదు
ష్కరమిఁక నెద్దికల్గు? చెర ♦ సాలవసించిననేమి? కాననాం
తరములనిల్వనేమి? వసు ♦ ధాధరగహ్వరసీమలందుసం
చరణము సేయనేమి? భవ ♦ సాగరసంగతిఁ బాయఁగల్గినన్॥

విశా. మిత్రమా! నీకు కారాగృహయోగ ముండగా సూమాటలేలహితంబులయ్యెడు? (అని తనలో) వీనితో వృథా వాగ్వివాదమేల? రాజాజ్ఞ నెరవేర్పవలయును. (అనియిటునటుఁజూచి) ఆఁ! తలారులిటులనే వచ్చుచున్నారు.

(అంతదలారులు ప్రవేశించుచున్నారు.)

తలా. దేవా! ఏమిసెలవు? మీరు మమ్మలనిటకు రప్పించినకార్యం బెట్టిదియో యానతిండు.

విశా. తలారులారా! మన ప్రభువైన రత్నాకర మహారాజుగారు కుపితులై నిజపుత్రుండగు సుధాకరుని రాజుగారి కేళికోద్యాన వనపరిసర ప్రాంతంబునం గల కారాగృహంబున నుంచుమని యాజ్ఞాపించినారు. కావున మీరిప్పు డెంతమాత్రమును నిశీధినీసమయంబని సందేహింపక రాజాజ్ఞ నెరవేర్పవలయును.

తలా. చిత్తము. మహాప్రభూ, అటులనే చేసెదము. (అనిసుధాకరునితో) సుధాకర మహారాజా, రండు.

సుధా. మంచిది. (అనితనలో) బాహ్యాకరణీయంబులగు నీదండ నోపాయంబులు ధైర్యకంచుకితంబగు మదీయచిత్తమును చలింపఁజేయ నేరవుకదా! నాకేమి భయము? (ప్రకాశముగా) తలారులారా, పోవుదమురండు.

(అనిసుధాకరుండు తలారులతో నిష్క్రమించుచున్నాడు.)

విశా. (తనలో) ఓహో ఈసుధాకరుని మహిమ యనిదంబూర్వంబుగఁ గాన్పించుచున్నది, ఇంతవైరాగ్యంబు వీనికిట్టి బాల్యావస్థలోనే యెట్లులభ్యమయ్యెనో తెలియరాదు. ఇదియంతయు నాయోగపురుషుని వాత్సల్య ప్రభావమే కాఁబోలు. ఎట్లయినను వీనినిశ్చల జ్ఞానసంపత్తి శ్లాఘనీయంబేకదా. ఆహా! గంధర్వసంచార సముచితసమయంబగునీ నిశీథంబున ఘోరాంధకారంబు నకుఁదలంకక కంటకావృత్తంబగు మార్గంబున నెంతనిర్భయముగాఁ బోవుచున్నాఁడు!

క. పాదపబంధురమునుగ్ర
వ్యాదవిహారాంచితంబు ♦ బహుఘూకమృగీ
నాదార్భట ఝిల్లీకుల
మేదుర రవభయదవనము ♦ మిక్కిలిదీనన్

మానవులు సంచరించు టనుచితంబుకదా.

(అంత నేపథ్యంబున నొకధ్వని)

ఆఁ! ఏమిచెపుమా? నాకిపుడొకధ్వని వినిపించుచున్నది. గంధర్వసంచారజనితంబు కాఁబోలు. నేనింకనిట నిలువరాదు. పోయెదను.

(అనివిశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

(అంతరిక్షమునుండి మనోరంజని యనునొక ఖేచరి ప్రవేశించుచున్నది.)

మనో. (అద్భుతరసమునభినయించుచు.) ఒహో! ఏమి! ఆరాజకుమారుని దివ్యస్వరూపము. ఈలాటి నవమోహనాకారము భూలోకమునలేదు సరేకదా సిద్ధసాధ్య గంధర్వామరశ్రేష్ఠుల యందైనఁగానరాదు.

క. దీపము లేకుండినవే
దీపములంబెట్టినట్లు ♦ దీప్తులునిగుడన్.
దీపించెడు రాకొమరుఁడు
కాపురుషుండుంచె బంది ♦ గంబునవానిన్

అకటకటా! అంతఃపుర సౌధాంతరంబులఁ బ్రకాశింపఁజేయు సుకుమారశరీరుండగు నృపకుమారుని నిర్దయుండై కారాగృహబద్ధునిఁజేయుట కెవరికిట్లు మనసొప్పునోకదా. అన్నా, ఎంతపని జరిగెను!

ఉ. దాసనకాచపాత్రసువి ♦ తానముఫుర్గ్వలబూజు పెంటలన్
భాసురచందనాగరుసు ♦ వాసనజాలముగబ్బిలాలను
ర్వాసనహంసతూలికను ♦ భాస్వదశయ్యశిలామహీస్థలిన్
జేసినబందిఖాననృప ♦ శేఖరసూనుఁడు దూఱుచుండెఁగా.

ఇట్టియపూర్వతేజోరూప లావణ్యాతిశయంబుల దేవతానేతయగు శచీనవునకు ముఖ్యముగ శ్రుతపఱచి రావలయును.

(అనిమనోరంజని నాకంబును గూర్చి ప్రక్రమించుచున్నది.)

గద్య. ఇది శ్రీమద్వేంకట రమణకరుణాకటాక్షవీక్షణాసారసమాసాదిత ర
సబంధురకవిత్వవైఖరీ ప్రవీణాపస్తంబసూత్రశాండిల్యస గోత్ర
పవిత్ర, హోతృకులకలశార్ణవరాకాకైరవమిత్ర, వేంకట
రత్నసుపుత్ర, వెంకమాంబాగర్భశుక్తిముక్తాఫల, వివిధ
విద్వజ్జన విధేయ, వేంకటకృష్ణ నామధేయప్రణీ
తంబైన రోహిణీసుధాకర విజయంబను
నాటకంబున
ప్రథమాంకము.





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## ద్వితీయాంకము.

[రంభాద్యప్సరోంగనల నృత్యగీతాది వినోదంబులతో బృహస్పతిప్రముఖదేవతాగణంబులు కొలువ దేవేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

**రంభ.** జే, దేవేంద్రమహారాజా!

ఉత్సాహ. పుష్పమాలికాబంధము.

దారితారిసూరివంద్య ♦ ధైర్యశౌర్యహార్యవృ
త్తారిభూరివారిజాక్ష ♦ ధర్మకర్మనిర్మలా
చారశారపూరణప్ర ♦ చండదండమండనో
దార ఘోరతారకాంత ♦ దానమానమానసా.

పంచచామరము, ముక్తపదగ్రస్తము.

విలాసవైభవప్రపూర్ణ ♦ విశ్రుతోగ్రదోర్బలా
బలాసురారివీరగర్వ ♦ భంజనోన్నతాకలా
కలాపహృష్టమానసాబ్జ ♦ కామితార్థసత్ఫలా
ఫలాశనాంతభవ్యకీర్తి ♦ పాలనామహోజ్జ్వలా.

(అని రంభ నృత్యముఁ జేయుచున్నది.)

**ఇంద్రు.** ఆహాహా, రంభా! నీమూర్ఛనలు మమ్ము మూర్ఛిల్లం జేయుచున్నవి. నాట్యవిలాస

వైభవంబుల నీచేయునృత్యగీతాదివినోదంబులు నామనంబు నెంతయుం బవిత్రత
తను బొందించుచున్నవి. వహ్వా:—

ఉ. మేళనఁ జేసితంత్రులను ♦ మీటుచు భావనుచిద్విజావళుల్
బాళిగ హాళిఁ గూర్పశ్రుతి ♦ పారగమైక మదమ్ములీనము
త్తాళిసమంచితంబుగ వి ♦ కస్వరభాస్వరశింజితంబులన్
బాలకురంగనేత్రకృత ♦ నర్తనగానములింపుఁ గొల్పెడున్.

అప్సరోంగనలారా! చాలు. చాలు. ప్రహృష్ట మానసుండనైతి. మీరలింక
వీడ్కొనుఁడు.

అప్స- చిత్తము, మహేంద్రా. (అనిరంభాద్యప్సరోంగనలు నిష్క్రమించుచున్నారు)

ఇందు- (నిలింపులనుద్దేశించి)

చ. అనిమిషులార! మీ రెఱుఁగ ♦ నట్టివి శేముషులెందు లేవు కా
వున నొకసంశయంబునుగఁ ♦ బూనితి మీగుమదిన్ దలంచి మే
దినినెటనైన దివ్యులును ♦ తింపఁగఁ జాలిన రూపసంపదల్
పొనరఁగఁగల్గు నేమనుజ ♦ లోకమునందు నెఱుంగఁ బల్కుఁడీ.

(అనినా దేవతలంత ఱుఁబరస్పర ముఖావలోకనంబులు చేసికొనుచుండ దేవతో
గురుండగు బృహస్పతిలేచి.)

బృహ- పురందరా! నీవడిగిన ప్రశ్నంబపూర్వంబైనది యగుటచే నీబృందారక బృం
దంబులందుకు సదుత్తరం బెట్టులియ్యవలయునో యని గుజగుజలువోయుచు
న్నారు. దివ్యదృష్టిచే నాకుందోచిన విషయంబును విన్నవించెద నవధరింపుము.

ఇంద్రు-గురువర్యా! అదెట్టిదియోఁ దెల్పుఁడు.

బృహ- బలారీ!

ఉ. ప్రాకటరూపసంపదల ♦ భాసిలుచుండిరి ధాత్రిలోన ర
త్నాకరునాత్మజుండగు సు ♦ ధాకరనాముఁడు దక్షపుత్రికా
శ్లోకచరిత్రరోహిణియు ♦ శుభ్రవినిర్మలతేజ మొప్ప న
స్తోకతపఃప్రభావ! మెట ♦ జూడగ రాదటువంటి రూపముల్

ఇంద్రు-గురువర్యా. అనన్యసామాన్య సౌందర్యంబులు దేవతాస్త్రీలను నియతంబులే కాఁబోలు.

బృహ- సందేహమేమి.

ఇంద్రు-అట్లైన,

ఉ. డెంపముకందళింపఁగవ ♦ డిన్నివరించిధరిత్రిలోని యా
సుందరరూపసంపదయ ♦ శోవిభవాన్వితులైనవారిలో
సుందరరూపమెక్కుడుగ ♦ శోభిలుచుండెనొ రాకొమారుచ
క్కఁదనమెక్కుడో దెలుపఁ ♦ గావలెనో గురువర్యవేడుకన్.

బృహ- పురందరా! సానబట్టిన జాదుమానికంబులవలెఁ నీడుదీయక భాసిల్లుచుండిన వారిద్దరి సౌందర్యంబులం గలతారతమ్యంబు లిట్టివియని ప్రత్యక్షంబుగఁ జూడక యేనెట్లు నేర్పఱుపనగు ?

చ. తరళవిలోలనేత్రఁగనఁ ♦ దనర్మహనీయసముజ్జ్వలాంగమున్
గరమరుదందగానసగి ♦ కన్నులపండువయైతనర్చునా
పురుషవతంసమున్ గనన ♦ పూర్వమనోహరతత్స్వరూపము
బ్బురముగఁదోచు. వారలను ♦ బోల్పఁగనొక్కఁడుఁజూడఁగాఁదగున్

ఇంద్రు-ఆహాహా ! గురువర్యా, మీరుచేసెడి వర్ణనయే వారిమోహనాకారములను సుమనోమనోహరంబులుగఁ జేయుచున్నయది. నేను ముఖ్యముగ భూలోకంబునకుఁబోయి యామనోజ్ఞ తేజోరూపంబుల నాసహస్ర నేత్రములచేతను వీక్షించి రావలయును.

చ. అలసుమనోమనోహరము ♦ లై తనరారెడు రూపసంపదల్
దలచినమాత్ర నేయలరి ♦ తన్మయతన్ హృదయంబువారి భా
సిలుమహనీయతేజముల ♦ శీఘ్రముగాఁ గనఁగోరుచుండె నిం
దలరఁగఁ గాన వారల మ ♦ హోముదమందఁగఁ జూచి వచ్చెదన్

(అంత ధరాతలంబునుండిమనోరంజని ప్రవేశించుచున్నది.)

మనో-జే. ఇంద్ర మహారాజా

సీ. జయభూరిరణభీమ ♦ జయదైత్యభగ్నోద్దామ,
జయఘనస్తుత్యనామ ♦ జయసుధామ
జయనృశంససంహార ♦ జయసింధుగంభీర,
జయసుగుణోదార ♦ జయసుధీర
జయమహోజ్జ్వలరూప ♦ జయత్రివిష్టపభూప,
జయగతభవతాప ♦ జయకలాప
జయపాపనిర్మూల ♦ జయభక్తజనలోల,
జయకీర్తిగుణజాల ♦ జయసుశీల.
ఆ. వె. జయశచీకళత్ర ♦ జయమునినుతిపాత్ర
జయపవిత్రచరిత ♦ జయసుగాత్ర
జయసుధర్మలసిత ♦ జయదేవతానుత
జయపురందరజయ ♦ జయబిడౌజ.

(అనినమస్కరించుచున్నది.)

ఇంద్రు-ఖేచరీ! నీ వెటనుండి వచ్చుచుంటివి?

మనో-దేవా! నేనుధరాతలంబునుండియే వచ్చుచున్నదానను.

ఇంద్రు. భూలోకమున నేమైన విశేషములుకలవా?

మనో-మహేంద్రా! వినుండు, క్షోణీతలంబునంగల సింహళద్వీపంబున నలకూబరజయంతవసంతులను రూపనియంత్రుండనంబగు నొకనరపాలతనూజుండు నిర్దయాత్ములచేఁ గారాగృహస్థాపితుండై యందు శారదాంబుదాంతర్గతుండగు యుడుపతి వడువునఁ దేజరిల్లుచున్నాఁడు.

[అంతపుష్పదంతుండు ప్రవేశించి,]

పుష్ప. ఆ! సుందరీ! ఏమని చెప్పుచున్నావు? (అనివగభేదితో) శ్రీ దేవా! పురందరమహారాజా! నేనుగూడ భూలోకంబునఁ గ్రుమ్మరుచుండి వేఱొకచోట నొకవిచిత్రంబుఁగంటి. విన్నవించెద నవధరింపుఁడు. దేవా! పాంచాలదేశంబున తేజోరాశియనందగు కన్యకాతిలకంబొండు గానలుచున్నయది. అద్దాని

సోయగంబెన్న నలుమోములఁ దాల్చిన తమ్మిచూలికైనను, వేయిమోములఁ దాల్చిన చిలువరాయనికైనను నలవికాదు.

ఉ. ఆ యెలనాగ నెమ్మొగము • నంబుజవైరియటన్న భ్రాంతిచేఁ
బోయి యనంత మార్గమునఁ • బోయెడు చంద్రునిఁజూచి యద్దిరా!
యీయెడఁ జంద్రులిద్దరుద • యించిరిదేమని రాహుకేతువుల్
సేయఁగలేమి నెద్దియుశ • శిగ్రహణంబటఁ గల్గలేదుసూ.

చ. తలిరుల బోణివాక్ప్రియశ • తాంగము నెక్కి విలోల నేత్రముల్
కలితపతాకలై చెలఁగఁ • గన్బొమలన్ దగు విల్లుబూని చూ
డ్కులగమి తూపులుప్పతిలఁ • గుంతలసైన్యముతోడ స్వచ్ఛమా
గళమను శంఖమొత్తుచును • కాముఁడులీలఁ జరించు నిచ్చలున్.

ఇంద్రు-బళె, పుష్పదంతా.

పుష్ప-దేవా, వినుండు.

చ. అతివముఖాబ్జపుష్పరస • మానఁగ గుంపులుకూడి తేటులూ
ర్జితగతి నేగుదెంచియటఁ • జెన్నగు చంపక మంచు నాసికన్
మతిభ్రమయించి పాదసలి • నంబులఁ జేరఁగ నేగె నాఁగనం
చితగతి వేలుచుండువన • జేక్షణ దీర్ఘశిరోజ పుంజముల్.

గీ. కాంతకుచములు చక్రవా • కములనేలు
వనితయూరులు ననటికం • బములఁ గేరు
కలికికర్ణంబులొప్పు శ్రీ • కారములన
రమణినఖములు నక్షత్ర • రాజిఁబోలు.

ఇంద్రు. ఓహోహో! ఏమి యీ మోహనాంగి సుస్వరూపము! పుష్పదంతా! నీవు చేసెడి వర్ణనాకర్ణనంబున నేనెంతయు నానందపరవశుండ నగుచుంటిని.

పుష్ప-దేవా! ఇంతియె కాదు. వినుండు.

మ. అనయం బా చెలి రోమరాజి ఫణిగం • గా వర్తమన్నాభి స
ద్ఘనవల్మీకమునందుఁ బుట్టి ముఖరా • కాబింబమున్ ద్రింగఁ జూ
చిన రాకుండఁగ నాపుఁ దత్కుచగిరి • శ్రేష్ఠద్వయంబంతయుం
గని తెల్పన్వడి నేగుఁ గర్ణములకా • కన్యాంబకాబ్జాతముల్.

మఱియు.

చ. నలినదళాక్షి మందగమ • నంబున కోడి మదేభపంక్తులి
మ్ముల లేదమ మూలలందడఁగె • మోహనగాత్రికలావినోదముల్
పొలుపుగఁ గాంచి భారతియుఁ • బోలఁగఁజాలక వెల్లఁబోయెనా
చిలువలఱేఁడడంగె చెలి • చెన్ను నుతింపఁగలేక భూమిలో

వేయేల ?

సీ. తేనియఁజిమ్ముచు వా • తెర చవుల్చ చరించు,
చందమెన్నుటకు మా • నంబు పట్టు
మిలమిలఁ గ్రాలెడు • మీననేత్రంబుల,
పటిమ నెన్నగ మహా • బ్ధంబు పట్టు
తిలపుష్పములఁ జగి • దళుకొత్తు నాసిక,
డంబు శ్లాఘింపయు • గంబు పట్టు
పూర్ణచంద్రుని భాతి • బొలుపొందు వదనంబు
వర్ణింప బ్రహ్మకు • ల్పంబు పట్టు

తే. గీ. నింకనితరావయవముల • నెన్నఁదరమె
తమ్మిచూలియు నెత్తావి • ద్రగముఁ బసిఁడిఁ
జెన్ను మీరఁగఁ గఱగించి • చేయఁబోలుఁ
గాక నాయింతి సొగసెటుఁ - గలుగ నేర్చు.

ఇంద్రు. పుష్పదంతా! చాలు చాలు. ఆకన్యకారత్న మసమాన సౌందర్య తిలక ...

టకు సందేహమెంత మాత్రమును లేదు. మనోరంజనీ! ఆమోహనాంగుని సుక
రూప మెట్టిదియో వివరింపుము.

మనో. చిత్తము. దేవేంద్రమహారాజా. ఆరాచకుమారుని దివ్యసౌందర్య రేఖావిలాసం
బులం గొనియాడ నేనెంతటిదానను. వానినెల్లవినినచో మీరింతకన్నను మోహా
వేశ పరవశులగుట నిశ్చయము. వినుండు.

సీ. నిండుచందురుఁబోలు • నెమ్మోముఁగలవాఁడు,
మిసిమిబంగరుచాయ • మేనివాఁడు
నిద్దంపుచెక్కుళ్ళ • ముద్దుగుల్కెడువాఁడు,
లలినూగుమీసముల్ • గలుగువాఁడు
చేరలకనుమించు • జిగికన్నుఁగవవాఁడు,
నెగుబుజంబులవాఁడు • సొగసుకాఁడు
కొదమతేఁటులఁబోలు • కురులనొప్పెడువాఁడు,
డంబుమీఱెడుపేరు • రంబువాఁడు.

తే. గీ. చెలులవలపింపవలరాచ • ములికివాఁడు
హాయలుకలవాఁడుసింగార • మొలుకువాఁడు
బుసుతనెలవంటినుదుటిచే • బొలుచువాఁడు
రహిఁదనర్చెడునలపసి • రాచవాఁడు.

వేయేల ? వాని సౌకుమార్యంబుఁ గన్నులారఁ గాంచినచో బురుషులకైన మనోజవికారంబు 'లంకురించును. (అని పెనిమిటితో) నాథా. మీరాసుందరాం గునిఁ జూచియుండలేదు కాఁబోలు. చూచియుండినచో మీరిట్లేల పలుకుదురు?

క. వానిమనోహరాంగమును • వానిముఖేందువిలాసరేఖయున్
వానివిశాలనేత్రములు • వానిభుజద్వయిదైర్ఘ్యసంపదల్
వానియురస్థలోన్నతియు • వానినఖంబులు హాసచంద్రికల్
కానకమీరుచూచినను • మానిని నింతగ బ్రస్తుతింతురే.

బృహ. సుందరీ! ఈవిషయములో వ్యతిరేక భావము నవలంబించి నీమదికప్రియం బొనరింపవలసి వచ్చినందు కెంతయుఁ జింతిల్లుచున్నాఁడను. నిశ్చయముగ నాకోమలాంగితో సమానులగు సుందరాంగు లేలోకంబుననుఁ గానరారు. మనపృథగ్భావంబులను సమీకరింపఁ దేవతానేతయగు పురందరునికిఁదక్క నన్యులకు సాధ్యంబు కాదు.

ఇంద్రు. ఖేచరులారా! మీలో మీరేల వితండవాద మాడెదరు? చతుర్విషయ సంయోగంబులనంగాని భిన్నపక్షాభిమానంబులేకీభూతంబులు కానేరవు కావున మనమందరము భూలోకంబున కేగి యామహనీయ తేజశ్శాలుర నొక్కచోఁ జేర్చిచూచి వత్తమురండు.

(అంతవైకుంఠంబునుండి జయవిజయులు ప్రవేశించుచున్నారు.)

జయ- జయ జయ సహస్రాక్షా.

విజయ-స్వస్తిశ్రీ సకలవిజయ సామ్రాజ్య వైభవమహేంద్రా.

ఇంద్రు-ఓహో. వైకుంఠనాధుండగు పరాత్పరుని సందేశంబున వచ్చిన పరమపావనులగు జయవిజయులారా! మీకుస్వాగతము. కూర్చుండుడు (అనియున్నతాసనంబులఁ గనఁబఱచి) హరిద్వార పాలకులారా! మీరలెట్టి కార్యార్థమై యిపుడిటకు విచ్చేసియుంటిరి?

జయ- సురేంద్రా! ఆదిదేవుఁడగు నారమామనోహరుండు మీపేర నొక యాజ్ఞాపత్రికను వ్రాసి దయచేయించినారు. చిత్తగింపుఁడు. (అని శ్రీముఖమును చేతికిచ్చుచున్నాఁడు.)

ఇంద్రు. ఓహో! గురువర్యా! భగవద్దాసుండనగు నాకొసంగిన దైవాజ్ఞయెట్టిదియో చూడుడు. (అని శ్రీముఖమును బృహస్పతిచేతికి నిచ్చుచున్నాఁడు.)

బృహ-మంచిది. (అని శ్రీముఖము నందుకొని) సుత్రౌరీ! భగవదాజ్ఞ వినుము. (అని చదువుచున్నాఁడు.)

"స్వస్తిశ్రీ సకలబృందారక బృంద పరివృత జగజ్జేగీయమాన వైభవోల్లాస సుధర్మాసభాధిష్ఠిత త్రివిష్టపాధినాథా! మేము నీపేరవ్రాయు యాజ్ఞాపత్రికయేమనగా, భూలోకంబున మాభక్తుండును సింహళద్వీప మండలాధీశ్వరుండగు రత్నాకరుని పుత్రుండునగు సుధాకరుఁడు పరమవైరాగ్యం బవలంబించి గృహస్థాశ్రమం బొల్లకఁ బరిణయ పరాఙ్ముఖుండై భిక్షించి జన్మాంతర కర్మ

శేషంబున కారాగృహస్థాపితుండై యందు నిరంతరము మన్మథధ్యానించుచు నవయుచున్నాఁడు. ఆ నృపకుమారునకుం దగిన కన్యకాతిలకంబును సృజియింప నింతకుఁ బూర్వమే తమ్మిచూలికి నాజ్ఞాపించి యుంటిని. విరించి ప్రేరితంబునఁ బాంచాలదేశాధిపతియగు దత్తునకు రోహిణియను దుహితృరత్నంబుదయించియుండె. ఆకన్యయు యోగినీవ్రతమవలంబించి భక్తిపరాధీన చిత్తయైయిల నిల్లుచున్నయది. కావున నీవు శీఘ్రంబుగ మన్మథాను గమ్యమానుండవై మహీతలంబునకేగి యా రాజకుమారులకుఁ బరస్పర సంఘటనం బొనర్పవలయును. శ్రీ

మహేంద్రా! ఆదిదేవుండగు శ్రీమన్నారాయణ ప్రేరితంబగు నీకార్యంబనివార్య కర్తవ్యంబు. కావున మీరందరు వెంటనె భూలోకంబున కేగి యారాజకుమారికా కుమారకుల నొక్కచోఁ జేర్చి వారలకుఁ బరస్పరావలోకనంబును గలిగించి మన్మథసహాయంబుచే వారి హృదయంబుల ననురాగబీజంబుల నాటెదరఁడు.

ఇంద్రుడు గురువర్యా! ముఖ్యముగ నీ కార్యంబును నెరవేర్చి భగవంతుని సంతోషపెట్టెద, చూడుఁడు. (అని ద్వారమువద్దనున్న కింకరునితో) ఓరీ, సేవకా. మన్మథుని శీఘ్రముగ నిటకుఁ దోడ్కొనిరమ్ము.

కింక — చిత్తము, దేవా. (అని నిష్క్రమించి వెంటనె మన్మథునితోఁ దిరుగఁ బ్రవేశించుచున్నాఁడు.)

మన్మ. భో దివిజాధినాథా! మీరునన్నిటకు రప్పించిన కార్యమెట్టిదియోఁ దెలుపుఁడు.

ఇంద్రు. మదనా! భూలోకంబున భగవద్భక్తులగు రాజకుమారికా కుమారకులు పరమవైరాగ్యంబునుఁ బూని వివాహంబొల్లకున్నవారఁట. నీసహాయంబుచే వారి చిత్తంబులఁ బరిణయాయత్తంబులగునటులఁ జేయుమని భగవదాజ్ఞయైనది. కావున మనమిప్పుడే భూలోకంబునుఁ గూర్చిపోవుదము రమ్ము.

మన్మ. చిత్తము. మహేంద్రా. నాపంచాయుధములతోడను నేనుసిద్ధముగనుంటి. రండు.

ఇంద్రు. మంచిది. గంధర్వులారా. పోవుదము రండు.

(అనిమన్మథగంధర్వులతో నింద్రుండు మహీతలంబునుగూర్చి నిష్క్రమించుచున్నాఁడు.)

(భూలోకంబున కారాగృహంబులోని సుధాకరుఁడు.)

సుధా. (స్వగతము) అన్నా! లోక మెంత మాయామోహితమై యున్నయది! అవిద్యావృక్షంబునకు మూలాలవాలంబగు కామినీవ్యామోహ మహిమను పామరు

జనంబులెంత యెక్కుడు చేయుచున్నారు! అన్నా! నిష్కారణము జనులెట్లు మోహమదాంధులై చెడిపోవుచున్నారు! పరమదాక్షిణ్యమూర్తియగు పరమేశ్వరుండు మానవులకీయజ్ఞానము నేలఁబాపకుండెనో తెలియరాదు.

ఉ. కామినులన్వరింపమదిఁ ♦ గల్గెడుకామము కామపూర్ణతన్
బ్రేమములూరు బ్రేమమునఁ ♦ బెద్దయిమోహవశాత్ముఁడై నరుం
డేమఱితృష్ణ చేఁదవిలి ♦ తృప్తినిఁజెందక లోభమగ్నుఁడై
తామసవృత్తి దుష్క్రియలఁ ♦ దద్దయుఁజేయుచునుండునిమ్మహిన్.

సహా. నాకీ కారాగృహావాసమే యుక్తమైనది. ఇచట నిశ్చలాంతరంగుండనై యేకాంతంబుగఁ బరమార్థవిచారణఁ జేసికొనుచు బాహ్యప్రపంచంబుతో సంబంధమునుఁ దొలగించుకొనఁ బ్రియత్నించెద. కాలాతీతమైనది, నేనింక శయనించి నిదురింపవలయును-

(అని సుధాకరుఁడు శయనించి నిద్రించుచున్నాఁడు.)

(అంత వజ్రియు స్వరగంధర్వులును బ్రవేశించుచున్నారు.)

సునో. దేవా! మహేంద్రా! ఇదియే యాసోమరునిచే నలంకరింపఁబడిన కారాగృహము. వానిఁజూతమిటురండు?

పుష్ప. దేవా! ఆరాజకుమారికా కుమారకులనొక్కచోఁ జేర్చియుంచిన మేలుకదా. దేవరవారాజ్ఞ నొసంగినచో నే నాకన్యాశిరోమణి నిటకే గొనివచ్చెద.

ఇంద్రు. మంచిది. అటులనే చేయుము మాగిరుసర్యని| యభిప్రాయముఁగూడ నదియేకదా.

పుష్ప. చిత్తము. దేవా. (అనిపుష్పదంతుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సునో. (సుధాకరునిజూపుచు) దేవా ఇంద్రమహాప్రభూ. ఎటనైనమీరీ రాసోమకుని వంటి సౌందర్య తిలకునివీక్షించి యుంటిరే? చూడుండు.

ఉ. ఎందఱిరాజపుత్రులను ♦ నిందునిభాస్యులఁజూడలేదొ వా
రందరువీనియందమగు ♦ నాకృతికెన్నగఁగాలిగోరికై
నందలపంగఁబోలరుక ♦ నన్బరికింపఁగరానియట్టియా
చందముమిన్నుమన్నుపయి ♦ సత్యముగాఁగనియుంటిమేయెటన్.

సీ. వీనిసౌందర్యంబుఁ • వినియుంటఁగాఁబోలు
నలరుపూవిల్కాఁడ • నంగుఁడయ్యె
వీనిసత్కళలను • వీక్షించి కాఁబోలు,
వనజారికళలను • బాయుచుండె
వీనిలావణ్యంబు • కానంగఁగాఁబోలు,
చనిజయంతుఁడనిమి • షత్వమొందె
వీనితనువికాస • వినలేకఁగాఁబోలు,
నలకూబరుండుఁదా • నలకఁజెందె

తే. గీ. ఇంకనితరులనెన్నంగ • నేలసిద్ధ,
సాధ్యవిద్యాధరామర • సమితిలోన
వెదకినను గానరాదెందు • వీనిసొబగు,
ఇతనిసృజియించియేధాత • చతురుఁడయ్యె.

ఇంద్రుఁడు- ఖేచరీ! మనోజ్ఞమూర్తియగు రాకొమరుండు నీచే వర్ణితుండై వన్నెకెక్కియున్నాఁడు. అట్టివాని సౌందర్యంబనన్య సామాన్యంబు కాకుండునే? అదిగో, మన పుష్పదంతుండును కన్యకాసహితుండై యింతలోనే వచ్చుచున్నాఁడు చూడుము.

[అంతటను స్త్రీందవలియున్న సుందరీసహితుండై పుష్పదంతుండు ప్రవేశించి.]

పుష్ప- దేవా! మహేంద్రా! ఏలిక యాజ్ఞానుసారంబుగ నాకలువకంటినిఁ గొనివచ్చితి. చూడుఁడు. (అనియా కోమలాంగినిఁగనఁబఱచుచు)

ఉ. ఈ యువతీలలామ కెన • యే పరికింపఁగనెట్టివారలున్
గాయజుపిండ్లు కన్యకలు • కాంచనకందుకములౌకుచంబులే
మాయొననంగమధ్యమున • మానుషతేజమునిట్టినారి నే
రేయుగమందునైనఁగని • నే? వినినే? మఱి ధారుణీస్థలిన్.

క. నాకర్కశహస్తంబుల
నీకోమలగాత్రినిటకు • నేదెచ్చినవా

హా ! కంటె ! యీ మోహసిషిస
లాంకుపుటము వెట్టి కట్టు ♦ లంగనుపట్టుగా.

మనో. దేవా ! రోహిణీమలాంగిని సుకుమారరాజకుమారుని పజ్జం జేర్చితిమేని వారివారి సౌం దర్యంబులంగల తారతమ్యంబులు స్పష్టపడియెడు.

ఇంద్రు. మంచిది అటులనే చేయుదము. (అని పుష్పదంతునితో) పుష్పదంతా! ముందు నీవాకారాగృహంబులోనికిం బోయి మెల్లగ నీకుటిలాలక నా రాజకుమారుని పజ్జం జేర్చి రమ్ము.

పుష్ప. చిత్తము. మహేంద్రా. (అని పుష్పదంతుండా యిందువదనతోం గారాగృహం బుగూర్చి నిష్క్రమించుచున్నాఁడు!)

ఇంద్రు. ఆహాహా ! ఈతనుమధ్యయు నాణిముత్తియమువలెం బ్రకాశించుచున్నది. ఇట్టి స్త్రీపురుషరత్నంబుల సృజియించి విధాత తన నేర్పుకడిమి నెఱపెంగదా!

మనో. దేవా! దేవేంద్ర మహారాజా ! ఆకోమలాంగినింగూడం జూచియుంటిరికదా. మీ యభిప్రాయమేమి ?

ఇంద్రు. ఖేచరీ ! వీరిద్దరిసౌందర్యంబులును వర్ణనాతీతంబులుగ నేం గాన్పించుచున్నవి. ఆహాహా !

క. సుందరరూపంబులనా
నందముగా నాసహస్ర ♦ నయనంబులనిం
పొందుగఁజూచిన డెందము
మందపరవశత్వమొందె ♦ మైయుప్పొంగన్

(అంత పుష్పదంతుండు తిరిగి ప్రవేశించి).

పుష్ప. దేవా! మహేంద్రా! దేవరవారి యాజ్ఞానుసారంబుగఁ గృతార్థుఁడనైవచ్చితి. తమరుదయచేసి చిత్తగింపుఁడు.

మనో. (భర్తతో) నాథా, మనమందరమచ్చోటికొకసారిగ నేగినచో వారలకు నిద్రాభంగమగునేమోకదా.

పుష్ప. జాయా ! మనమావిషయమై సంశయింపవలసిన పనిలేదు. గంధర్వమాయచే వారలఁగాఢనిద్రాముద్రితులుగఁ జేసివచ్చితిని.

ఇంద్రు. అట్లయినఁ శీఘ్రముగఁ బోవుదమురండు. (అని ఇంద్రుఁడును ఖేచరులును చెరసాలలోని సజ్జనుసమీపించుచున్నారు)

పుష్ప. దేవా. మహేంద్రా! ఈ తేజోరాశులలో తారతమ్యంబుల నేర్పఱుపఁ బ్రయత్నింపుఁడు.

ఇంద్రు. ఓహోహో! ఏమియీమోహనాకారములు.

మ. కలితోద్భాసితరూపసంపదలనేఁ ♦ గన్నారవీక్షింపస
ల్లలితానందరసాబ్ధివీచికలచో ♦ లాకేళిలోలాత్మమై
లలినొప్పారుమదీయమానసమరా ♦ ళం బిప్పుడత్యద్భుతో
జ్జ్వలతేజంబులతారతమ్యములనె ♦ బ్భంగిన్వివర్ణించునో!

మనో. దేవా! సహస్రాక్షా! వీరిద్దరుసమానసుందరాంగులేయని మాయభిప్రాయమా యేమి?

ఇంద్రు. ఖేచరులారా! నాబుద్ధికట్లనే తోచుచున్నది. కాని నేనొక్కయుపాయముఁ జెప్పెద నాకర్ణింపుఁడు. మనమదృశ్యరూపంబులఁ గైకొని సద్దుసెయ్యక నీతేజోరాసులలోఁ నొకరునిద్రంజొక్కియుండ వేఱొకరిఁజొప్పనఁ గుట్టిమేల్కొలుపుచు వీరల పరస్పర వర్ణనాతిశయంబుల బాగుగఁబరికించినచో సౌందర్య తారతమ్యం బించుకైన నుండి నేనిస్పష్టపఱచెదను. ఇంతకుమిక్కిలి సాధనోపాయం బెద్దియుఁ నాకుఁ గానరాదు.

పుష్ప. దేవా! ఈనారీపురుషులు పరమవిరాగులుకదా, వీరలెట్లు వ్యామోహితులై పరస్పర వర్ణనలొనరించెదరు?

ఇంద్రు-పుష్పదంతా! పంచాయుధములతోడను విషమాస్త్రుండు మనసమీపమున నుండనీ కట్టిసంధియుంచేల గలుగవలెను. కావున రిత్తసందియంబుల వీడిమీరుభయులు భ్రమరాకృతులం బూని నేను చెప్పిన చొప్పుఁజరిగింపుఁడు. నేనదృశ్యరూపంబును గైకొని జరుగఁబోవునదంతయుఁ బరికించుచుండెద.

పుష్ప. చిత్తము. మేమట్లనే ఒరిగించెదము. (అనిగంధర్వులు భ్రమరాకృతులను బూనుచున్నారు.

ఇంద్రు, అహహా! ఇట్లు దుదీయక భాసిల్లెడు నీయనన్యసామాన్యతేజోరూపంబులపరస్పరావలోకన ప్రభావమెట్లుండునో నేనుముఖ్యముగాఁ జూడవలయును.

(అనిఇంద్రుండదృశ్య రూపంబును బూనుచున్నాఁడు.)

సుధా. (శయ్యపైనుండి దిగ్గునలేచి.) అబ్బా ! ఈప్రమదాళి నాచెక్కిటనెంత తీవ్రము గాఁగొట్టినది. (అనిఇటునటుఁజూచి) ఆఁ! ఏమిది ! ఏమియీకాంతి ! ఓహో ! కన్నులు మిఱుమిట్లుగొలుపునటుల దేదీప్యమానంబుగఁ బ్రజ్వరిల్లునీ యపూర్వతేజంబెంతయు నాకత్యాశ్చర్యంబునుఁ గలిగించుచున్నది. (అనిసుప్తిందవిలియున్న సుందరాంగినిఁ బొడగాంచి) ఆహా ! ఆశ్చర్యము ! ఆశ్చర్యము ! ఈజగన్మోహనస్వరూపమిచటికెట్లు వచ్చెనోకదా ! ఇట్టి యపూర్వతేజశ్శాలిని నేనెన్నండును జూడనైతి. ఇదియేమి దైవమాయయో తెలియరాదు. ఓహో !

ఉ. సౌరభమొందుబంగరపు ♦ జంత్రపుబొమ్మయొ ! మార్దవంపుచె
ల్వారెడురత్ననిర్మితశ ♦ లాకయొ ! నిశ్చలలీలఁబొల్చుతో
ల్కాఱుమెఱుంగొ ! జీవకళ ♦ గల్గినచిత్తరువొక్కొ ! నాఁగనీ
తీరునఁబ్రజ్వరిల్లు సము ♦ దీర్ణమనోహరతేజ మేమొకో !

శా. ఏమీ! చూడఁగఁ జోద్యమయ్యె నడిరే ♦ యిట్లిచ్చనా [illegible]
మోమోటంబిసుమంత లేక నిదియే ♦ మోమూ [illegible]
భూమిన్ గ్రుమ్మర వచ్చినట్టి రతియో ♦ పూర్ణేందు [illegible]స్వయమా
భామారత్నము నంపిరో పరులునా ♦ భావంబు శోధింపఁగన్

అట్లుఁగాక.

తే. గీ. నాదు తలిదండ్రులే మంత ♦ నమున నామ
నంబు నైనాహితప్రయ ♦ త్నంబునందు
నిచ్చఁగొనుచుట్లుఁజేయుని ♦ మచ్చకంటి
నర్ధనిశియందు నాపజ్జ ♦ కంపిరేమొ.

మఱియు.

క. ఈతన్వినె కాఁబోలును
నాతలిదండ్రులు కడంగి ♦ నాకు వివాహం

ప్రాతత వైభవ మొప్పగఁ
జేతో మోదమునఁ జేయఁ • జింతించిరహా!

హా! ఈశ్వరా! నేనిపుడెంతయుఁడో లాయమాన మానసుండనై యున్నవాఁడ. ఏమిచే యుదును? ఈకాంతనవలావణ్య దీధితులు నాహృదయ ఖేదనంబొనర్చుచున్న వి. నాచిత్తమెంతయుఁ జలించుచున్నది. వహ్వో. ఏమిది!

సీ. నీలవర్ణపుకాంతిఁ • గ్రాలునియ్యవిబంభ
రాళియేమో కావు • బాలకురులు
అతి మనోహరముగ • నలరారు నిడిచంద
మామయేమో కాదు • భామమోము
కమ్మని వలపులఁ • గడువెల్గు నిడితిల
పుష్పమేమో కాదు • పొలతి నాస
ప్రవిగుళంబగు కాంతిఁ • బరిఢవిల్లెడు నిడి
శంఖ మేమో కాదు • సకియగళము

తే. గీ. అసదృశంబుగ నక్రుమ • లైనయివియుఁ
జక్రములెయేమొ కావింతి • స్తనములరయ.
వరలు చున్నట్టి లావణ్య • వనధి వీచి
కాళియివి యేమొ కావంబు • జాక్షివళులు.

అహా! ఏమి యీసౌందర్యము!

క. నెలఁ బోలిన మొగమును, వె
న్నెలఁబోలిన హాసరుచియు • నెఱినీ పసిఁడిగి,
న్నెలఁ బోలిన కుచములుతి
న్నెలఁ బోలిన పిఱుదులమర • నీటుక యొప్పున్.

హా!

సీ. కిసలయంబులనెల్లఁ • గ్రేణి సేయుచ దొండ
పండుచక్కఁ దెగేడు • పసదలిర్ప
నరవిందములకన్న • నందమ్ముకలవయ్యు
మీనులఁ బుగడించు • మిసిమి మెరయ
విరిదమ్ములనుగ్రమ్ము • సిరిజిమ్మునదియయ్యు
నెలడాలుఁ బోలియించు • జిలుగుగులుక
నాణిముత్తెపుచేరు • లణఁగఁ ద్రొక్కియునుడు
గణములఁ దెగడెడు • కాంతినెసఁగ

తే. గీ. సౌరయీ తన్వియధరంబు • నక్షియుగము
వదనబింబము నఖరాజి • ముదమునింప
నరలు నాభాగ్య మేమన • నచ్చునిట్టి
సుందరాంగినిఁ బొడగంటిఁ • జొక్కుచుంటి.

బాపురే! ఏమి యీచిత్రము! ఇనుమయస్కాంతంబున భ్రాంతంబైనయట్లు నాహృదయం బీమించుఁబోణి రూపలావణ్యాతిశయంబులచే నెంతయు నాకర్షింపఁబడుచున్నయది. ఇట్టితేజోరాశినుండి నామనంబు నెట్టుల మరలింప నేర్తును? ఓ, లలనాశిరోమణీ! నీవు రాజకన్యక వేమైనచో నిన్ను తప్పక పెండ్లియాడెద.

మ. వనజాతాయతనేత్రి నీదు నవలా • వణ్యాబ్ధివీచీ వళీ
దనివోవండగ నోలలాడుచున హో • తన్వంగి నాచిత్తమా
ఘనమీనాంకశతఘ్ని గోలపటలిన్ • గాసిల్లెశిక్ దేహలత
మ్మను మానింపకు వీడియుంటిని సుధీ • యంబైన వైరాగ్యమున్.

ఈకోమలాంగి యెంతగాఢనిద్రాపరవశురాలై యున్నయది!

ఉత్సాహ. కోమలాంగి! కోపమేల? • గోరియుంటి నిన్ను నే
కామబాణజాలములకుఁ • గాంత యోర్వఁజాల నే

భూమిలోన నిన్నుఁబోలు • పొలతి యెందుఁగాననే
మామకార్తి డింపవెమ్మ • మానినీశిరోమణీ.

(అని నిద్రావస్థ నభినయించును.)

అయ్యో యింతలోనే నన్నినుపగజ్జల తల్లి యావహించుచున్నది. ఇంక నెట్లో గదా. నాసర్వేంద్రియ వ్యాపారములును క్రమక్రమముగ మందీకృతంబులగుచున్నవి- అయిన నీ నిద్రాదేవియు నాకొక యుపకారమే చేయుచున్నది. ఓరమణీమణీ !

ఉ. అలివేణీ మృదుపాణి నీదు మహనీ • యంబైన తేజంబు నిం
పలరం జేయగఁ జూడ్కి తీవియలన • త్యంతంబుఁగాఁ బట్టిహృ
జ్జల జాంతర్గత మానటుల్వలిపిశ • శ్వత్ప్రీతి బంధించితిన్
వెలిబోకుండఁగ మోడ్తు నేత్రములఁద • ద్వ్యాప్యోన్నపాపంబికన్

(అని గాఢనిద్రాముద్రితుండై మూర్ఛిల్లుచున్నాఁడు.)

(అంత రోహిణి మేల్కొనుచున్నది.)

రోహి. (చుబుకంబు నివురుకొనుచులేచి) అబ్బా. నాచుబుకంబు నెద్దియో చుఱుక్కనగుట్టినది. (అని నలుప్రక్కలు తేరి పారఁజూచి) ఆఁ! ఏమిది! ఈప్రదేశమంతయు నింతగఁ గాన్పించుచున్నది. అత్యద్భుతంబగు నీయపూర్వతేజంబెటనుండి ప్రజ్వలించుచున్నదో! ఇదియేమి మిది వింత? నేనిపుడెంతయు భయకంపిత చిత్తురాలనగుచుంటి. (అనిభయము నభినయించుచు నిద్రాక్రాంతయై యుండును కనులను మోడ్చియు వెంటనే యులికిపడి లేచి.) అయ్యో. ఏమిది? ఈదుష్టమదేందిందిరంబులేల నన్నిట్లు వేధించుచుండె? ఎన్నడునుజూడని యీవింత తుమ్మెదలు నేడేలవచ్చె? ఇవంతయు నెద్దియో యొకమాయగా నున్నది. (అని ఇటునటు జూచి రాజకుమారుని వీక్షించి.) ఓహో. ఏమి యీమోహనాకారము ! ఈమహనీయ తేజశ్శాలియగు దివ్యపురుషుండెవరై యుండునో కదా. వైరాగ్యోపల సన్నిభంబైన నాచిత్తమీ మోహనాంగునిఁజూచినతోడనే చలించుచున్నది. అనన్య గమ్యంబగు నిజాంతఃపురంబున హంసతూలికాతల్పంబుపై శయనించి నిద్రించుచుండు నీదు రెవ్వరు వాహ్యత్యకలంబున కిట్లు రాఁగనగిరి?

శా. ఓహోహో! కడు చిత్రమయ్యె నిదియే ♦ మో మాయగా నెట్టులన్
బాహాటంబుగ నీనిశీథమున నా ♦ పజ్జం బ్రకాశించు నీ
సాహస్రాంశు సమాన తేజుఁ డెవరో ♦ వర్ణింప నా చిత్తమున్
మోహభ్రాంతినిఁ జెందఁజేయ సఖులీ ♦ మూర్ఛన్య నిందార్చిరో.

అటుగాక,

చ. నిలుకడఁ జెందు క్రొమ్మెఱుఁగొ ♦ నింగిఁ దొలంగిన చంద్రబింబమో
యలరుల వింటివాఁడు తన ♦ యంగముఁ బూసి వసించి యుండెనో
కలఁగని యుంటినో నిజము ♦ గానల కూబరుఁడో జయంతుఁడో
వలపుల యెమ్మెకాఁడగు నృపాలతనూజుఁడో తోఁచరా దహా!

తేజోరూపలావణ్యాతిశయంబుల నొప్పుచుండెడి యనన్యసామాన్య సుందరాంగునిమం తనంబున నానెచ్చెలులే నావద్దకుఁ బంపిరి కాఁబోలు. జననిజనకులారా!

ఉ. ఈనవమోహనాంగుఁడు మ ♦ హీవరపుత్రికుఁ డేని వీని నే
మానకఁ బెండ్లియాడెద హి ♦ మద్యుతి శైత్యము వీడియుండినన్
భానుఁడు చల్లనైనను న ♦ భంబు భువిం దలక్రిందునైననా
మానసమందు నీతని య ♦ మానుష తేజము చిక్కెఁ గావునన్

నా నెమ్మనమును హరించిన యీరూపవిజితమన్మథాకారుని లేపెద. (అని నిద్రాముద్రితుండగు సుధాకరునిపైఁ దనకరపంకజంబు నునిచి.)

ఉ. ఓయకళంక నీకు విను ♦ మో సుకుమార శరీర చిక్కితిన్
మాయలు చాలు నింక నను ♦ మానమె కింతయు లేదు నిన్ను నే
బాయఁగఁజాలఁ బంతమునఁ ♦ బల్కవ దేమిర కోప మెందుకో
కాయజ రూప నీమదిని ♦ క్రౌర్యము డింపుము లెమ్ము చూడుమీ

అన్నా. హా మనోహరా. నిద్రాదేవి నాశిరస్సుపై నెంతయుఁ దాండవమాడుచున్నయది. ఇనుపగుండ్లు కట్టినట్లు నాకనురెప్పలు మూసుకుఁబోవుచున్నవి. ఇంక నెట్లోఁగదా! కానీ, యీమోహనాంగు సంతర్శన జ్ఞాపకార్థము వీనికన

కాంగుళీయంబును సంగ్రహించెద. (అనితనవ్రేలినున్న యుంగరము నాతని వ్రేలినుంచి యాతనియుంగరమును దా గ్రహించి యెప్పటియట్ల పరుండి నిద్రించుచున్నది.

(అంతదేవేంద్రుడును గంధర్వులును నిజస్వరూపములనుధరించి ప్రవేశించుచున్నారు.)

ఇంద్రు. వహ్వా! మదనునిసాహాయంబుననే సంపూర్ణకృతార్థుండనైతిఁగదా. వీరియుభయులకుఁపరస్పరానురాగము బలముగఁగలిగినది. ఖేచరులారా! కంటిరా, యీమోహనాకారుల పరస్పరమోహావేశంబులు తత్తత్స్వరూపాభిజ్ఞులనుగ నాబుద్దినిఁజూడనవన్నియు సమముగనే యున్నట్లుఁగాన్పించుచున్నవి. ఆహాహా! ఏమి యీతేజోరూపంబులు.

చ. కలిత వినూత్నరత్నసమ • కాంతిని వెల్గెడుఁ దేజమొందఁగని
ర్మలతరదీధితిన్ గడుఁబ • రస్పరమున్ బ్రతిబింబితంబులై
యలరెడువీరి యాకృతుల • నద్భుతభంగి సహస్రనేత్రముల్
గలుగుటకున్ ఫలంబునిటఁ • గంటినిధన్యుఁడనైతి నేనహా.

మనో. దేవా. పురందరమహారాజా. అంగుళీయసంగ్రహణకలాపంబుచే నాతనుమధ్యయేయతిశయ మోహావేశంబునుఁ బ్రకటించెనని తలంచెద. మీయభిప్రాయమేమి?

ఇంద్రు. ఖేచరీ. అదియొకవిశేషముకాదు. శృంగారకృత్యములలో స్త్రీలుసహజమైనపున్యాగు కలవారలైయుందురు. తాదృశజన్మురాల వగుటనీవెఱుంగవే.

(మనోరంజని చిఱునగవుతో సిగ్గునభినయించుచున్నది.)

పుష్ప. దేవా. ఆరాజకుమారుండతిశయమోహావేశపరవశుండగుటచేఁ దద్విషయంబును గుర్తెఱుంగఁజాలఁడయ్యె. కావున వాని సౌందర్యంబేమోకించుకయుండినోయొనని తలంచెద.

ఇంద్రు. పుష్పదంతా. అన్నివిధములచేతను వారిద్దరు సమానసుందరాంగులే యనుటకు సందేహమెంతమాత్రమునులేదు. మీరుమాత్రమేమఱియుండక దైవప్రేరితంబగు నిమ్మిథునానుబంధంబును శీఘ్రకాలములో సమకూర్చుటకు సర్వవి

ధములచేతను బ్రయత్నింపుఁడు. (అనినగభేది నిష్క్రమించుచున్నాఁడు.

మనో. ప్రాణేశ్వరా. తెల్లవారకమున్నె మనవిహారకుటిలాలకను పరులెవ్వరికిని తెలియకుండునటుల రహస్యోచితంబుగఁ దిరుగ పాంచాల దేశంబునకుఁ గొనిపోయి యటనిజసౌధాంతరంబున నెప్పటియట్లఁ బరుండఁబెట్టి రావలయును. చూడుఁడు

చ. తెలతెలవాఱుచుండెనని, దీపపుకాంతుల తెల్వి చెప్పెడున్
గలయగఁ దేజమబ్బెనని • కాకులు కావనిఁగూయుచుండెనిం
పులుగులు కంగగాలివల • పుల్పచరించుచు నీచుచుండెని
మ్ములఁగలయంపి ముగ్గులిడ • బోటులు లేచుచునుండిరిప్పుడే॥

పుష్ప- జాయా. ముఖ్యముగా మనమటులనే జరిగించి ఎత్తుమురమ్ము. (అని నిద్రించియున్న కోమలాంగితో పాంచాలదేశమును గూర్చి ఖేచరులు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష వీక్షణాసారసమాసాదిత రసబంధుర
కవిత్వవైఖరీ ప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్రహోత్రుపల
కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న సుపుత్ర, వెంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రోహిణీ
సుధాకరవిజయంబను నాటకంబున
ద్వితీయాంకము.





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## తృతీయాంకము.

(దక్షమహీపాలుండును మంత్రియగు మారుతియుఁ బ్రవేశించుచున్నారు.)

దక్షు. అమాత్యపుంగవా ! నాకుమారీమణి యౌవనవతియైయున్నది. ఆమెకుఁ బరిణయ మొనర్పవలయును. ఆకన్యకాతిలకంబున కిచ్చవచ్చినవరుండెట్లు లభించునో తెలియరాదు. యోగినీవ్రతమవలంబించి పరిణయపరాఙ్ముఖియై యున్న యాపెచిత్తము నెట్లు మరలింతును ?

మారు. దేవా ! మీదుహితృరత్నంబును మగధదేశాధిపతియగు రాజశేఖరునకొసంగ మీరిదివరకే నిశ్చయించి కొనియుంటిరికదా, మీరిపుడేల పునరాలోచనముఁ జేసెదరు ? అదియునుఁగాక స్వయంవరమును గూడఁ జాటించి యుంటిరి. దానిపర్యవసానముఁ జూచినపిదప కదా మఱియొక యోచనఁ జేయవలసినది.

(అంతనొకకంచుకి ప్రవేశించి.)

కంచు. దేవా! రాజశేఖరమహారాజుగారు దేవరవారిపేర నొక జాబువ్రాయించి యిప్పించినారు చిత్తగింపుఁడు. (అనియుత్తరమును జేతికిచ్చుచున్నాఁడు.

దక్షు. మారుతీ ! ఈయుత్తర మేమియోచూడుము. (అనియాలేఖను మంత్రిచేతికిచ్చుచున్నాఁడు.

మారు. చిత్తము. (అనియుత్తరమునందుకొని చదువుచున్నాఁడు.)

సీ. ,, శ్రీరాజమాన్యరా • జితపూజపాంచాల
దేశమహారాజ • తిలకమీకు
వందనంబులొనర్చి • వరమతినేదెల్పు
విషయంబులేమన • విస్తరింతు

మనసు మీఱ ప్రియాత్మజన్ • ఘనతనుగా మాకిచ్చి,
పెండ్లి జేయుదుమంచుఁ • బేర్మిఁ బలికి
తగవు నెంచక మీరు • తా రత్నమునకు స్వ
యంవరంబును జాట • నంపనగునె

తే. గీ. ప్రకటభుజవీర్యమేర్పడఁ • బార్థివులను
ఘోరరణరంగమందునఁ • గూల్చి సిదపఁ
గడగి రాక్షసవైవాహి • కంబు చేతఁ
గన్యఁ గొనియెద,,—

రాజశేఖరునివార్తలు.

దక్షు. మారుతీ ! రాజశేఖరుండు కుపితుండై యుండెను కాఁబోలు. ఆతండును మనబలవద్విరోధియగు సింహళద్వీప రాజాధమునకుఁ దోడ్పడియేని రత్నాకరుండు మనకు దుస్సాధ్యుండయ్యెడు. ఇందులకు బ్రత్యుపాయము నూహింపుము.

మారు. దేవా ! మనమిప్పుడూహించుట కేమియున్నది. దేవరవారి కుమారీమణికి క్షత్రియధర్మానుసారముగ స్వయంవరమును జాటింప నొకరుకినియ నేల? అయిన నారాజేంద్రుని సన్నిధికి రప్పించి శాంతిపఱచుటయే శ్రేయమని తోఁచెడు.

దక్షు. మంచిది. అటులనే చేయుదము. ఓరీ ! కంచుకీ! మీ రాజిపు డెటనున్నవాఁడు ?

కంచు. దేవా, మా రాజుగారి పుడీపట్టణములో నేయున్నారు.

దక్షు. అట్లైన మారుతీ ! నీవే స్వయముగఁ బోయి యారాజేంద్రుని సన్నిధికిఁ దోడ్కొనిరమ్ము.

మారు. చిత్తము. (అని నిష్క్రమించి వెంటనే రాజశేఖరునితో ప్రవేశించుచున్నాఁడు.)

దక్షు. (దవ్వుల రాజశేఖరునిఁ గని) ఓహో. మిత్రవర రమ్ము. ఇటఁ గూర్చుండుము.

(అని యొకయున్నతాసనంబునుఁ జూపుచున్నాఁడు.)

రాజ. (ఆసనమునధిష్ఠింపకయే) రాజా ! దక్షమహీధవా !

ఉ. భోగవిహారలీల పరి • పూర్ణసుఖంబుల నొక్కపాత్రనన్
భోగానుమృత్యుదేవతను • పొల్పుగ రెండవ పాత్రనుంచగా

నూఁగెడు[త్రాసు దానికిన ♦ యోన్నతచూపుడుముల్లు వెనసీ
వేగతిఁజూపెదో తెలుపు ♦ మెక్కుడనీహృదయంబు భూధవా.

దత్తు. రాజశేఖరా! కుసుమాగిరత్నను పరమైశ్వర్యంబు నలంకరింప పరిణయపరాఙ్ముఖియై యున్నయది ఆనారీమణిచిత్తమును పరిణయాయత్తంబగునట్లుఁజేయుటకై నిఖిలదేశాధీశులను రావింపనట్టి యుపాయమునుఁ బన్నితి నేగాని నిన్నుమఱచికాదు.

రాజ. రాజా. నన్నేల మాయచెసెదవు? సర్వజ్ఞుండవగు నీకుకన్యాకాజనంబు లెట్టివరుల వివాహమాడ నిచ్చగింతురో తెలియనుండు నే. వినుము.

చ. కులమునురూపమున్ గుణము ♦ కుంఠితతేజము బాహుపీర్యమున్
సలలిత శీలమున్ సతత ♦ సత్యవచోరచనాకలాపమున్
విలసితసత్కలా కలిత ♦ విశ్రుతకీర్తిహారవైఖరిన్
గలిగిచరించు నవ్వరునిఁ ♦ గన్యక కోరువివాహమాడఁగన్

కావున. ఉ. సొంపగు సత్కులంబునఁ[బ ♦ సూతినెసంగిన నాఁడధాత్రిగా
బెంపును పేరునొందినవి ♦ వేకిని శూరుఁడ సత్యసంధుఁడన్
జొంపునవైరివర్గములఁ ♦ [దెళ్ళఁగఁ జేసితినాఁజిన్నట్టినా
కింపును బెంపనీదునుత ♦ నిమ్ము విశంకటవృత్తిభూవరా.

మఱియు. క. క్షత్రియజాతుండనునీ
పుత్రికకును దగినవరుఁడ ♦ భూపాలకనే
సు[త్రామసన్నిభుండనఁ
బాత్రుఁడనగునాకునీదు ♦ పట్టినొసఁగుమీ.

దత్తు. రాజశేఖరా! నాకుమారీమణిపరోక్షంబున నేనెట్లుస్వతంత్రించి మాటనొసంగెద. ఆకన్నియ యెట్టివరుని చ్ఛగింపునో తెలియరాదుకదా.

రాజ. రాజా! నీవిట్లేల సందేహించెదవు? చూడుము.

ఉ. నాదువిశాలనేత్రసలి ♦ సంబులు నామఖచంద్రకాంతియున్
నాదుశరీరసౌరభము ♦ నాదువిహారము నావిలాసమున్

నాదుమృగేంద్రమధ్యమును • సాకదు దీర్ఘభుజద్వయంబున
మోద్రమముతోడఁ జూపినను • మోహముఁ జెందరె యెట్టికాంతలున్.

దత్తు. రాజశేఖరా ! ఎట్లయినను స్త్రీలనిజాభిప్రాయంబుఁ గుర్తెఱుంగకయ వారలకుఁ బరిణయ ప్రయత్నంబు జేయఁజనదు. అందువలనఁ బిదప నెన్నియిక్కట్టులైనం గలిగెడు. ఇంతియెగాక, నాగారాబు పట్టియసమానశేముషీవిశేషురాలు కావున నామెను సామ్రాజ్యధురంధరుండవును సత్కులప్రసూతుండవును రూపనిర్జిత మారుండవునగు నీకొసంగ నాకిచ్ఛ యౌడమినను మదీయ కుమారీమణిహృదయంబు తెలియఁగ నెఱుంగకయే నేనెట్లు సాహసించెద ?

రాజ. రాజా ! నీవు నాయెడల సుముఖుండవై యుండిన నంతియ చాలును. నేను పోయి వచ్చెద. (అని రాజశేఖరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

దత్తు. (కనుసైగచే మంత్రిని చేరంజీరి నాన్యాకర్ణనీయంబుగ) మారుతీ. నీవుకూడఁ బోయి యిరాజశేఖరుని పోకడలరసిరమ్ము.

మారు. చిత్తము. (అని మారుతి నిష్క్రమించుచున్నాఁడు.

(అంతనొక దౌవారికుఁడు ప్రవేశించి)

దౌవా. దేవా. నిన్నరేయి నర్థనిశీథిసమయంబున దేవరవారి కుమారీమణి హార్మ్యతలంబున కెవరో యొక దివ్యసుందర విగ్రహుండగు పురుషుఁడు వచ్చిపోయెనఁట. అందువలన నమ్మగారు భయభ్రాంతులై యిపుడే మేమిటియోయని మఱచి యాక్రందించుచున్నారు. దేవరవారికీసంగతి నివేదింప నేనిటు వచ్చితి.

దత్తు. (అద్భుతకోపరసావేశపరవశుండై) ఆఁ ? ఏమిది ? నాముద్దులపట్టి హార్మ్యతలంబున కెవరిట్లు రాసాహసించిరి (అని సవితర్కముగాఁ దనలో) ఒకవేళ రాజశేఖరుండే కాదుకదా ? అతండీపట్టణమున కిప్పటికే వచ్చి యుండెనఁట. నాపట్టి హృదయంబును దనయెడలననుకూలింపఁ జేయుటకై యిట్టి దుస్సాహసమొనరించి యుండెనేమో. అయిన నొకరిపైఁ దగునిదర్శనములేకుండ వ్యర్థముగ నిరాపనిందలు మోపరాదు. ఆసంగతి యెట్టిదియో నేనే స్వయముగఁ బోయి కనుగొనివచ్చెద. ఏమిచెప్పుదు ? అక్కడ పౌరులెందరో గుంపులుకూడి మాట్లాడుకొనుచున్నారు. ఈవిషయమును గుఱించియే కాఁబోలు.

(అని దత్తుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత కామపాలుఁడను నొకపౌరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కామ. ఆహా! ఏమియీచిత్రము ! పరులెవ్వరికినిఁ జొరశక్యముకాని రాజకన్యాంతః పురంబునకు సహితము చోరులునిరర్గళముగ వచ్చుచున్నారు. ఇఁకమాబోంట్ల కుటీరనిలయంబు లిట్టిచోరభయగ్రస్తంబులు కాకుండనెట్లుసురక్షితంబు లయ్యెడు? (మార్గమునఁ బోవుచుండు మఱియొక పౌరునింగాంచి) ఓహో! సుదంతా ఏమి?నీవంత తొందరగాఁబోవుచుంటివి ! బాల్యస్నేహితుఁడనైన నావంకఁగన్నెత్తి చూచుటకైనను వీలులేనంత దయతప్పెనా ?

సుదం. ఓహో! మిత్రమా. కామపాలా నీవేనా? ఇప్పటికి నన్ను క్షమింపుము. నేనొక రాజకార్యసంబంధమగు తొందరపనిలో మునిఁగియుండుటచే నిన్నుఁగననేరనైతి. నిన్నరేయి రాజకన్యాంతఃపురంబునఁ జరిగిన యద్భుతచర్య మేమైన నీవెఱుంగుదువా ?

కామ. మిత్రమా ! రాజకన్యామణి చోరభయగ్రస్తురాలై యేమేమిటో మైమఱచి ప్రలాపించుచుండెనని మాత్రమొకవదంతి పుట్టినది. అదియెంతవరకు సత్యమో తెలియరాదు.

సుదం. మిత్రమా ! ఆసంగతినిశ్చయమే. మనరాజుగారి కొమార్తెయగు రోహిణీకన్య తన యేకాంతసౌధాంతరంబున హంసతూలికా తల్పంబుపై శయనించి నిదురించుచుండ నెవరో మహాసౌందర్యశాలియగు నొకదివ్యపురుషుఁడువచ్చి పట్టను బలెంచెనని భ్రమించి పలవరించుచుండె.

కామ. (తనలో) ఆపురుషుండతిసాహసుఁడైన యొకచోరుండే కావచ్చును. (ప్రకాశముగా) అయితే, మిత్రమా, రాజకన్యాంతఃపురంబున నాసాహసునిచే ద్రవ్యముకాని భూషణంబులుకాని యేమియుహరింపఁబడలేదుకదా ?

సుదం. మిత్రమా ! అట్టిపనియేమియుఁ జరుగలేదు. ఇంతియేగాక నాపురుషుండొక స్వప్నసంభవరూపుండే కానినిజమైనచోరుండు కాఁడనితోచెడు. ఏమన,

మ. కమనీయాంచితరత్నకాంచనలస ♦ ద్గ్రైవేయహారావళుల్
విమలస్ఫూర్తినమూల్యవస్తుచయముల్ ♦ వేవేలద్రవ్యంబు వి
భ్రమసంకాశకలాపముల్వీడిచి చో ♦ రుండైన రాజేంద్రగుహ
ర్మ్యమునన్ రోహిణిహంసతూలికశయున్ ♦ రాజిల్లఁగాఁబంపునే.

కామ. అయితే, సఖా! ఇదియంతయు స్వప్నభ్రాంతియేనా? ఇట్టియద్భుతచర్యవలన మనరాజుగారి కుమార్తెకుఁ గీడు పుట్టదుకదా?

సుదం. మిత్రమా! ఈవిపరీతమెన్నో కీడులనైనా కలుగఁజేసినది. ఏమనిచెప్పుదును. ఆమిథ్యాపురుషుని పజ్జనుఁజూచినట్లు భ్రమించినది మొదలు రోహిణీకన్యకచలితచిత్తయై యసంబద్ధప్రలాపములనుజేయుచున్నయది. అట్టిదురవస్థఁజెందియున్ననిజకుమారింగాంచి మనరాజుగారత్యంత చింతాకులస్వాంతులైయున్నారు.

కామ. అన్నా. ఎంతపనివచ్చెను. మిత్రమా, నీవిపుడెట్టి కార్యార్థమైపోవుచుంటివి?

సుదం. సఖా, మనరాజుగారు తమప్రధానమంత్రియగు మారుతినితక్షణమే వెంటఁబెట్టుకొనిరమ్మని నాకాజ్ఞాపించినారు. నేనామహీపాలుని యాజ్ఞానుసారంబుగఁ బోయి మంత్రిపుంగవు నాస్థానంబునకనిపి నేనుగూడ రాజభవనమునుఁ గూర్చి యేపోవుచున్నాఁడను. అదిగో రాజభటుండగు జనమిత్రుఁడిటులనే వచ్చుచున్నాఁడు. నేనుపోయివచ్చెద. (అనిసుదంతుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

కామ. ఇంతటినుండియు మాగృహమును నేనతిజాగ్రతతోఁ గాపాడుకొనుచుండవలయును. మాయింటి యాబిడ యొంటరిగా నుండెను కాఁబోలు, నేనుశీఘ్రముగఁ బోవలెను. (అనికామపాలుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

(అంతజనమిత్రుఁడు ప్రవేశించి)

జన. ఉ. ప్రీతిగఁగన్నదక్షునృపు • నీపతిముద్దులకూతురెంతొ సం
జాతవికారచేష్టలను • జాలనటించెడుపీడఁజెంది, యో
భూతముఁదోలునేర్పుగల • పుణ్యభిషగ్వరులార వచ్చిమీ
ఖ్యాతినుతింపగాఁ జెలివి • కారములందయఁబాపిప్రోవగే.

అనిప్రకటనఁజేయుచు నఖిలదేశంబులం గ్రిమ్మరి యెందైన నొకభూతవైద్యుని యరసి తోడ్కొనిరమ్మని పాంచాలదేశాధిపతియైన దక్షమహారాజుగారు నాకాజ్ఞాపించియున్నారు. ఎంతతిరిగినను సమర్థుండగు వైద్యవరుఁడొక్కఁడును గానరాఁడయ్యె. ఏమిచేయుదును. అబ్బా! నేనింక సంచరింపఁజాలను. (అనిచతికిలంబడి యూపిరివిపులముగా విడుచుచు) అన్నన్నా. అధికపథశ్రమంబుచే శాఖాశాఖలెంతయు నొప్పిపెట్టుచున్నవి. హా, మాయదైవమా! అట్టిగుణఖనియగు

ధరారమణుని గారాబుతనయ కీర్తిదురవస్థను గలుగఁజేసి నిజప్రతాపపరిఖాపటా
ల పరంతపుండనందగు నామహీకాంతునకీ కొలంతనొకదానిఁ గల్పించిదుఃఖా
ర్ణవ నిమగ్నునిగఁజేసి వంతగుందింపుచు మర్త్యుల నీలాగు శ్రమఁబెట్టుచుంటివి
కదా. ఇంక నేనెక్కడికని తిరిగెదను? అదిగో దవ్వుల నొకబాటసారీలాగునకే
వచ్చుచున్నాఁడు. భూతవైద్యుని గుఱించివానికేమైనఁ దెలియునేమో కను
గొనియెద. (అనిలేచియుండును నడుచుచుండ బాటసారి ప్రవేశించుచున్నాఁడు)

బాట. ఏమోయి. రాజభటుఁడా, నీవుచేయుపాటింపదేమని? నీముఖచర్యఁజూడ నేఁడె
ద్దియో యొకవిపరీతముతటస్థింప దానికై నీవుమితిలేని విచారమునుఁజెందియున్న
ట్లుఁదోచుచున్నది. సంగతియెట్టిదియో వివరింపుము.

రా.భ. పాంథా. ఏమనిచెప్పుదును? పాంచాలదేశాధిపతియైన దక్షమహీపాలునకులేక
లేక నొకకుమారీతిలకంబుపయించి యక్కన్నియ శుక్లపక్షచంద్రికవలె దినదిన
ప్రవర్ధమానయై విలసిల్లియిప్పుడొక పీడఁజెంది కృష్ణపక్షసుధాంశు రుచివలెకాంతి
విహీనయై గాసిల్లుచున్నయది. ఆయెలనాగపీడను దొలంగింప సమర్థుండగు భూత
వైద్యుని వరయ నేనిట్లుఁ జాటించుచున్నాఁడను. అట్టివైద్యవరుఁడెందైనఁ నీకుగో
చరుండయ్యె నేని నాకుఁదెలిపి పుణ్యాము గట్టుకొమ్ము.

బాట. (స్వగతము.) అన్నా. ఎంతపని జరిగెను. కానిమ్ము, నేనుసమయమునకేవచ్చితి.
అయినను దీనిసంగతిసకృత్స్నముఁ గనుంగొనిన పిమ్మటంగాని యందులకుఁదగి
నసాధనోపాయంబును విచారింపవలనుపడదు. (ప్రకాశముగా) రాజభటుఁడా
పీడఁజెందియున్న యారాజబింబాస్యవికార చేష్టలెట్టివియో నీకుంతెలిసియుం
డినవానినెల్ల నాకు తేటఁబఱుపుము. పిమ్మటవైద్యునిజాడ నీకుఁదెలిపెద.

రా. భ. (తనలో) వహ్వా. ఈతండొక భూతవైద్యునివలెనే తోచుచున్నాఁడు. ఇంక నా
శ్రమనివారణ కానైయున్నది. కాఁబోలు, (ప్రకాశముగా) పాంథా. తెల్పెద
వినుము.

ఉ. ఆనరపాలపుత్రి యహహా ♦ హా నిజశయ్యను జేరిపోతుటీఁ
గై నను జేరరాని తన ♦ యంతిపురమ్మున నిద్రఁజెందఁ దే
జోనలినాప్తుఁడైనయొక ♦ సుందర రాజకుమారుఁడేగియా
మానిని పజ్జఁబండెనఁట ♦ మాటలికేటికి చిత్రమయ్యెడిన్,

అట్టిస్వప్నసంభూతుండగు మిథ్యారాకామరునిపై మరులుగొని నిజపరిచిత వినోదంబులందగులు! నిండువిలుకాని చేతిబంతియో యనునట్లు మాటిమాటికి మైమఱచి భ్రమల్లుము,—

మ. తలయూచున్ దనలోనదానదగు సం ♦ తాపించులో నూఱకే
బలుకున్ జెక్కెటచెయ్యి జేర్చు సఖులన్ ♦ బల్మారుఁ దూఱున్ బయల్
గలయన్ గౌఁగిటఁ జేర్చు నల్లడలవీ ♦ కన్ జూచు మైసొమ్ములన్
వెలిదీయున్ బెదరున్ గలంగు నలువన్ ♦ వేమారు దూషించెడున్.

మేమెవ్వరమేని చేరఁజననాకృశోదరి తటాలున శయ్యపైనుండి లేచి మేఘగర్జనగంభీర భాషణంబుల నేమేమిటియో మైమఱచి ప్రేలుచుండు. ఈవికారచేష్టలం గాంచి పలువురుపలువిధంబులుగా నుడువ రాజుగారా కోమలాంగికిపీడ సోకెననితలంచి యొందఱినో భూతవైద్యులరప్పించిరే కాని వారిపలన సార్థకమేమియు లేకపోయెఁ గావున.

చ. తిరిగితినెల్లచోటులకుఁ ♦ దెల్పితిభూధవునాజ్ఞ యెంతసే
దిరిగిన నొక్కవైద్యుఁడు మ ♦ దిన్ దిలకింపఁగానరాడి కే
వెరవునఁబోవనేర్తు? బృథి ♦ వీశు చెంగట నెట్టివిన్నపం
బిరవుగఁ జేయుదున్ భిషజుఁ ♦ డెక్కడనుండునో తెల్పుమీ దయన్.

శాట. (ఆకాశమువంకఁ జూచి తలపంకించుచుఁదనలో) ఆఁ! దీనికారణము కొంతనాకు హృద్గోచరంబైనది. అయిన నేనాకోమలాంగింగని స్వయముగ సంభాషించిననగాని యున్నయథార్థకథనంబు తేటఁబడదు. (ప్రకాశముగా) రాజభటుఁడా! నీకోరినకోరిక నేనే నెరవేర్చెదను. నాకుభూతవైద్యమునందు కొంతపరిశ్రమ కలదు. ఆసరోజాక్షియొద్దను రహస్యోచితంబుగ నీవునన్నుఁదోడుకొనిపోఁ గలిగితేని నేనాపిశాచంబును ముహూర్తమాత్రములో నివారణచేసెద.

రా. భ. స్వగ. రాజవనితలు నివసించియుండు రాజాంతఃపురంబులకుఁ బరపురుషుల [illegible]? ఇంతియెగాక మేలుకీడులతోఁ గూడికొనిన యీపనిలోఁ బ్రవేశించి నిగ్రహించుటెంతయు దుర్ఘటము. రాజుగారు శాసనమెట్టిదియో [illegible]?

బాట. ఎఱుంగను. అదెట్టిదియో దెల్పుము.

రా. భ. మంచిది, వినుము.

చ. ముదముగ నాథ రాధిపుని ♦ ముద్దులకూఁతు వికారచేష్టలన్
గుదురుగఁ జేయఁగాఁ గడగి ♦ కోరికతో నెరవేర్పు వానికిన్
సదయతనర్థరాజ్యము నొ ♦ సంగుదునంట కుదుర్పకుండినన్
గుదిదయ లేకఁ దచ్ఛిరముఁ ♦ ద్రుంచెదనంట నికేమి చెప్పుదున్.

పాంథా! ఈశాసనము మిథ్యా ప్రాగల్భ్యులగు వైద్యవేషుల నిదివరకెందఱినో బలిపుచ్చు కొన్నది. కావున నీవవిచారుండవై మెండి చొరవఁ జేయకుము.

బాట. రాజభటుఁడా! ఆవిషయమై నీవెంతమాత్రమును సంకోచింపవలసిన పనిలేదు. ఈలాటివ్యాధుల నెన్నియో నేనిదివరలోఁ గుదిర్చియున్నవాఁడ. ఇట్టివానిం దగు చికిత్సలన్నియు నే నెఱుంగుదు. రాజకన్యాంతఃపురంబు నీకునన్న ప్రత్యేకించి రహస్యోచితంబుగఁ దోడ్కొనిపోవుటకు సందేహించితివేని రాజుగారి సముఖమునకు నే నే స్వయముగఁ బోయెద.

రా. భ. అటులైన వైద్యతిలకమా! శీఘ్రముగఁ బోవుదము రమ్ము, రాజుగారు మనరాకకై యెదురుచూచుచుందురు.

బాట. రాజభటుఁడా! నీవు ముందు నడుచుచుండుము. నే నీప్రాంతంబునంగల యొకవన మూలికను సంగ్రహించి నీ వెనువెంట నేవచ్చెద. కాని యీరాజుగారి సౌధరాజం బెటనుండెనో నాకానవాలుమాత్రము చెప్పిపొమ్ము.

రా. భ. భిషగ్వరా! నీవీమార్గమున నేగినచో దవ్వుల నొకపుష్పవాటికం గాంచెదవు. దానినతిక్రమింపఁ గననగు నత్యున్నత ప్రాకారగభీరపరిఘావిరాజితంబై చుంబితనభోభాగగోపురాట్టాలక శోభాభిరామంబై వెలయు మేడయే మారాజుగారిదని తెలిసికొనుము. నీవు తడవు సేయక శీఘ్రముగ రావలయుఁ జుమీ. నేను పోయివచ్చెద, (అని రాజభటుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

బాట. (స్వగతము.) రాజభటుఁడు చెప్పిన చొప్పునుబట్టి యోచింపగా నారాజబింబాస్యకు నిజమైన విరహావేదనయే వాటిల్లెనని తోచుచున్నది అక్కా! ఇదివరకెంతటి మోహనమూర్తులను దీసికొనివచ్చి కనఁబఱచినను చలింపని యానలినాశిరోమణిచిత్తమును నేఁడింతగ భ్రమియింపఁజేసిన మహానుభావుఁ డెవఁడై యుండెనో తె

విడువరాదు. సింహళద్వీప భూపాలుని పుత్రుండు నిటులనే యర్ధరాత్రమునఁ దనపజ్ఞనెవరో యొక మోహనాంగి పవళించియుండి తెల్లవాఱినతోడనే యదృశ్యయైనట్లు భ్రమించియామెకై మితిలేని విరహపరితాపంబునొందుచున్నట్లు ప్రాంతంబున నీకవసంతిగలదు. అతండే యీమోహనాంగి విరహవేదనలకుఁ గారణభూతుండు కాఁడు కదా. అట్లైనచో దారుణశాత్రవాపత్తునైన నాయిర్వురకుఁ బరస్పరసంఘటనంబు దుర్లభంబు. ఎట్లయినను తొందరపడి నేనిపుడేమియు నిశ్చయింపరాదు. అదిగో పుష్పవాటికలో నెవరో యొకమానవతి పరిదేవనంబుఁ జేయుచుఁ గ్రుమ్మరుచున్నది. ఆమెవిలాపములలో నాముందు ప్రయత్నంబునకనుకూలించెడు విషయంబులు కొన్ని తేలవచ్చును. నేనీచెట్టుచాటుననుండి వినియెద. (అని యొకచెట్టు మాటున దాఁగుచున్నాఁడు.)

(అంత దుఃఖాక్రాంతచిత్తయై మణిమంజరి ప్రవేశించి.)

మణి. హా! పుత్రా! చిత్రసేనా! ఇంక నెన్నఁడైన నిన్ను నాకన్నులఁ జూచు భాగ్యమబ్బునే? ఈభూమిపై నాకున్న యాధారంబీవయని నమ్మియున్న నన్నిట్లొంటరిగ విడనాడిపోయి దూరదేశంబుల నన్నుదలంచుచు నెచ్చోట పంచత్వంబునొందితివిరా తండ్రీ! నేనింకేమి జూచికొని మనఁగలిగెదను.

ఉ. నామురిపెంపుకూన! నను • నాయమెపాయుగఁ జిత్రసేన! నే
నేమిదయొనర్చియుంటి, మును • నేతొలుబామున నోచినట్టి నా
నోములపంటవై కలిగి • నొవ్వఁగఁ జేసెద వేమనందునో
మామకజీవనంబ! పరి • మాణము చెల్లెరయోరి పుత్రకా.

హా! తండ్రీ! చ. ఒనరఁగఁ జేరఁజీరి తని • వోవని ప్రేమములూరనన్ను నే
గనినయనాదిరయొక్క త్రుటి, • కాలమునైనను కన్నులారనిఁ
గనితినె యుగ్రకుమార! యటు • గాంచినచోఁ గనుదృష్టిదోషమౌ
ననుమతింజంకి యింక నెటుఁ • జూచెదనో కదనిన్ను పుత్రకా.

కన్నతండ్రీ! ఇంతకాలము నన్నెడబాసి దూరదేశములం జరించుచుండుటకెట్లోర్చితివిరా కుమారా.

ఉ. కమ్మనిముద్దుమోమెటులఁ • గాంచఁగఁగల్గెదునన్న ప్రీతినీ
సొమ్ములుచూడనాకడుపు • చుమ్మలుచుట్టుఁగదన్న యింక నే
నెమ్మొముఁ నిన్నుఁ బాసిచరి • యింపఁగనోర్చెదనన్న నాదుచి
త్తమ్ముకరాయిఁ జేసెను వి • ధాతకదన్న యనుంగుపుత్రకా.

హా! కుమారా! చిన్ననాటినుండియు నీకుసోదరివలె మెలంగిన రోహిణీకన్యక యునీకై కొంగ పెట్టుకొనియున్నది. ఇట్టితతిసేవుండినదామె మనోభ్రాంతులంబోనాడియ కన్నియకెంత సంతోషమును గలిగింతువో కదా తండ్రీ.

ఉ. ఎన్నడువచ్చునోయనుజు • నెన్నఁడుఁజూతునో నాకొఱంతలిం
కెన్నఁడుదీరునోమదికి • నెప్పుడుసంతసమబ్బునంచునీ
గన్నులఁజూడఁగోరుచును • కన్నులుకాయలుకాయ రోహిణీ
కన్నియసోదరా! యనుచు • గాసిలుచుండెను రారపుత్రకా.

హా! కుమారా!

సీ. చిన్నారిపొన్నారి • చిఱుతప్రాయపునీదు
చిన్నెలెన్నెన్నియో • యెన్నియెన్ని
మమతతోనామోల • మసలెనుతఱినీదు
చేష్టలెన్నియొగణితిఁ • జేసిచేసి
బాల్యమందునఁ బసి • బాలుడౌలోని నీ
యాటపాటలనెంచి • యలరియలరి
తొలజవ్వనమున నీ • సలలితమేధావి
శేషముఁగ్గడితృప్తిఁ • గెందిచెంది.

తే. గీ. యింతకాలంబుఁగడపితి • నింకఋణము
చెల్లెనానీకునాకును • చిన్నికన్న!
హాతవిధీ! మొండికట్టైనై • బ్రతుకుచుంటి
సుతునినొకసారె కనులారఁ • జూపరాదె॥

321

హా! పరమేశ్వరా. (అని చెట్టుక్రింద చతికిలంబడి నిట్టూర్పు విడుచుచున్నది.)

చాట. (స్వగతము) అహాహా! ఆమె చిరకాలమునుండి నన్నెడబాసినానకై విలపించుచుండెడు నాతల్లియేకదా. ఈపట్టున నేగి నాజననికి ప్రియమారఁ గౌఁగిలియొసంగెద. తొందరపడి నేనట్లు చేసినచో నాముందుప్రయత్నమునకు భంగము కలుగునేమో! కట్టా! చిన్ననాటినుండియు నన్నతి ప్రేమచే సహోదరునివలెఁ జూచుచున్న యీ రాజకన్యకయుఁ దనదురవస్థనుఁ దొలఁగింతునని నమ్మి నారాకఁ బ్రతీక్షించుచున్నదఁట. ఓహోహో! చిరంతరు నేన మరణించియుంటినని యే తలచుచున్నారు కాఁబోలు. ఇప్పుడు నేనేమి చేయఁగలయును? పొంగిపొంగివచ్చు నీదుఃఖమును నేనెట్లు భరియింతును? ఏదియెట్లైనను ముందు నాతల్లికి నేనుకనఁబడవలయును. (అని చెట్టుచాటునుండి వెలపలకువచ్చి,) జననీ! చిరకాలపుత్రవియోగానల సంతాపంబుచే మిమ్మును నాయనను సోదరిని వేధించిన పాతకుండనగు మీతనూజుండను. ఇదిగో వచ్చితిని. నన్ననుగ్రహింపుఁడు. (అని తల్లిపాదములపై వ్రాలుచున్నాఁడు.)

మణి. (సంతోషపరవశాత్మయై మైమఱచి, ఓహోహో! కన్నతండ్రీ! ఎంతకాలమునకు నిన్నుఁ జూడఁగలిగితినిరా! (అని పుత్రునిఁ గౌఁగిటఁగదియించుచున్నది.)

చిత్ర. తల్లీ! ఆనందాతిశయంబుచే సద్దుఁజేయకుఁడు మీరు నాపేరైనఁగట్టిగ నుచ్చరించిరచో రాజకన్యకావిషయమైన నాముందు ప్రయత్నంబునకు భంగము కలుగును. రాజుగారు నారాకకై యెదురు చూచుచుందురు. కావునఁబోయి వచ్చెద. నాకిప్పటికాజ్ఞయొసంగుఁడు.

మణి. కుమారా! నీవుదేశాంతరమునుండి తిరుగవచ్చిన సంగతి రాజుగారికిదివరకే తెలిసి యుండెనాయేమి?

చిత్ర. తల్లీ. తెలియలేదు. రాజభటునితో నేనొక భూతవైద్యుఁడనని చెప్పియాతని ముందుగనంపి వనమూలికాన్వేషణకై తపంబున నేనిచటికివచ్చి మిమ్ముఁ గనుఁగొంటిని.

మణి. తండ్రీ! నీవావిషయంబులోఁ బూని వైద్యవేషంబున రాజసంస్థానంబున కేగకుము. రాజుగారిభయంకరశాసన మెట్టిదియో నీవెఱుంగుదువా?

చిత్ర- తల్లీ! ఆశాసనము నేనెఱుంగుదును, ఆవిషయములో మీరెంతమాత్రమును భయపడవలసిన పనిలేదు. రాజుగారి సమ్ముఖంబునకు నే నేవిధము చేరనైనఁబోయివాస

హృదయంబును గరఁగించి తదనుజ్ఞపై రాజకన్యాంతఃపురంబునకేగి రోహిణితో నా నిజస్థితిరహస్యోచితంబుగఁ దెల్పెద. పిమ్మటనన్నియుఁ జక్కంబడు

మణి—తండ్రీ. నీవు పరమార్థదాయకంబగు సత్కార్యమునుఁ బూనియున్నవాఁడవు. అట్టి నీసదుద్యమంబున కంతరాయకంబుగ నేనేమియు ననఁజాల. కాని నీవు జాగ్రతఁ గలిగి యప్రమత్తుండవై ప్రవర్తిల్లవలయును సుమీ.

చిత్ర—తల్లీ! మంచిది. అటులనే సంచరించెద. కాని నేను వచ్చినసంగతి యేరికైనను దెలియకుండునటుల జాగ్రత పెట్టవలయునుసుఁడీ. నేను పోయివచ్చెద.

(అని చిత్రసేనుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

మణి—ఆరాజకన్యకను విడిచిపెట్టి వచ్చిచాలాసేపైనది. నేను గూడశీఘ్రముగాఁ బోవలయును. సర్వకార్యసంధాయకుండవగు నోపరమేశ్వరా! సంకల్పసంభవా! నాపుత్రుని ప్రయత్నంబును నిర్విఘ్నముగఁ గొనసాఁగఁజేయుము

(అని మణిమంజరినిష్క్రమించుచున్నది.)

(దక్షమహారాజును మంత్రియైన మారుతియుఁ దిరుగాఁ బ్రవేశించుచున్నారు.)

దక్షు—మారుతీ, అపారమైన యీవిచార సాగరంబును దరియింప నెద్దియేని నొక యుపాయము దెల్పుము.

చ. అలయక దేహరోగమున ♦ నట్టిచికిత్సలొనర్చియుంటినం
కిలియనమ్రొక్కుకుంటి నర ♦ కేసరి కెంతయుబత్తితోడనా
యలికులవేణికూఁతునకి ♦ వన్నియువ్యర్థములయ్యెఁజేటతోఁ
గలిపినయట్లు మానసము ♦ కందికలంగెడు నేమిసేయుదున్.

మంత్రిపుంగవా! నాకుమారీరత్నము నట్టిమిథ్యామనోభ్రాంతిచేత నే నవయుచుండెను. అయ్యో! ఈభ్రాంతిని నేనెట్లుఁ బోగొట్టఁగలిగెదనోకదా.

మారు—నృపశేఖరా! విచారపడినలాభ మేమి? మానుషప్రయత్నములచేఁ జేయఁదగిన పనులన్నియు దేవరవారు చేయించుచునేయుంటిరి. అయినను, కార్యకారణకర్తయైన పరమేశ్వరుని కటాక్షముండవలయునే గాని లేనిచో మనుష్యమాత్రుల మగు మనవలన నేమియయ్యెడు? మీరలూరక సంతాపించుటవలన సార్థకము లేదు. తగుప్రయత్నములు నింకను నిసువక చేయించుచుండవలెను. మఱియు

సీ. వినుమీ రాజవరేణ్య! మానవుఁ డుపాధ్యాదాస్వతంత్రుండునై
తనమాయన్విడద్రోయఁజాలఁడుతదుత్పత్తిస్థితివ్యాప్తినా
శనకృత్యాశ్రయుఁడీశ్వరుండతనిచే • సత్యంబుగాఁదానుమో
హనిబద్ధుండయి కష్టసౌఖ్యభయమి•థ్యాభ్రాంతులంబొందెడున్

దేవా! రజస్తమోగుణంబులను పాశంబులచే బంధింపంబడి మనము ముక్కుత్రా టిచే పశువు మనుష్యులకు వశంబైన చందంబున నీశ్వరాజ్ఞాయత్తులమై ప్రవర్తించు చున్నారము, అంతియకాని మఱొక స్వాతంత్ర్యంబు కలదే? అయినను మాయా మోహితులమై యుండుటవలన "నోరుగాలిలో దీపము వెట్టి స్వామీ నీమహిమ జూపు" మనిన లాభము లేదనియోచించి దేవరవారి కుమారికారత్నంబునకు పైశాచి కపుపీడ కలిగియుండెనేమోయని తలంచి మీయాజ్ఞగా భూతవైద్యులనరయఁ దిరుగఁజారులను బంపించియున్నాఁడను.

(అంతనొక ఫణిహారి ప్రవేశించి.)

ఫణి.—దేవా!

ఉ. భిక్షుఁడొ యక్షుఁడో వికృతి • వేషముఁ దాల్చి హజారమందుఁ దా
దక్షతఁ జూపఁ గుంకుమను • దస్తము మెత్తి విభూతిఁ బూసి రు
ద్రాక్షలపేరులెంతెయుఁజీ • రంబునఁ గంఠమునందు వేఁనో
రక్షక! భూతవైద్యుఁడట • రా మదిఁ గోరుచునుండె నాజ్ఞనో.

దత్తు.—మంత్రిపుంగవా! వైద్యులనామంబు నెంతయు విసువు దోఁచుచున్నయది ఇదివర కెంతమంది వైద్యులు జేరి యత్యాతిశయోత్కర్షలఁ బ్రకటింపుచుఁ కుదిర్చె దమని పూని తుదకుఁ గుదర్పలేక తమ ప్రాణములం గోలుపోయిరి? కావున బలాత్కారముగ జీవహింసఁ జేయుటయే కాని యింక నీవైద్యములతో ప్రయో జనమేమియు లేదని తలంచెద.

మం.—దేవా! అట్లననేల? ఏమహానీయుని పరిశ్రమ యెట్టిదియో మన మెఱుఁగఁజాలము ఏపుట్టనేపాముండునో మనకుఁ దెలియవచ్చునె? దేవరవారి కఠినశాసనమును వినియుండియు దానిఫలము ననుభవించినవారిం గనియుండియు నిజమైన ప్ర జ్ఞలేనివా నిటుల సాహసించునే? మఱియు

ఉ. పోడిమి నల్పమానవులె • పూని యొనర్చెదు గొప్ప కార్యముల్
వాడిమిఁ జూపనీతఁ డిటు • వచ్చెను లోనికి రా ననుజ్ఞ మీగా
రోడక యియ్యఁ గావలయు • నో నృప! యోడలు బండ్ల వచ్చు బం
డ్లోడల వచ్చు నట్లనుట • యొప్పు నె యెప్పటి కేది కల్గునో.

దత్తు—మారుతీ! అట్లైన నా వైద్యుని మా యెదుటకు శీఘ్రముగ రప్పింపుము.

మారు—చిత్తము (అని కనుసంజ్ఞఁ జేయ ఘణిహారిని ప్రక్రమించి వెంటనే వైద్యునితో తిరుగ ప్రవేశించుచున్నాఁడు)

వైద్యు—(రాజును సమీపించి యథోచితగౌరవంబులం జరిపి) మహారాజా! దేవరవారి కుమారీమణి శోకపీడ సోకనని నా భైషిజ్య ప్రకర్షను ప్రతిభువులైన తమ యొద్దఁ జేటతెల్లంబుగ వెల్లడించి మీ మహిత్రరత్నంబునకు సౌఖ్యమును గలుగఁజేసి మిమ్ము సంతోష పెట్టవలయునని యిచ్ఛపుట్టి వచ్చి యున్నాఁడను దేవా! ఆజ్ఞ సెలవీయుఁడు.

దత్తు—ఓయి భిషగ్వరా! మా శాసనంబులన్నియు నీ వెఱుంగుదువా?

వైద్యు—చిత్తము దేవా! దేవరవారి శాసనంబులలో నే నెఱుంగని దొక్కటియును లేదు.

దత్తు—వైద్యుఁడా! ప్రాణహానిఁ దెచ్చెడు నీ పనిలోఁ ప్రవేశించుట యెంతయు నాత్మహత్యకై పూనుటవంటిది. కేవలము శాపపిశాచంబుచేఁ బట్టుబడిన దేని కీ ముహూర్తమున కాపుదు నీవు బాగుగ యోచించుకొనుము.

వైద్యు—మహారాజా! ఇట్టి ప్రాణోపద్రవకరమైన పనిని నెరవేర్చుటకు నిజసత్త్వము లేకయ చేపట్టి సాహసింతునా? దేవరవారు కేవలము భూతదయాశీలస్వరూపులగుటచే నింత సూచనము సెలవిచ్చుచున్నవారు. కాని నా సామర్థ్యమునందు నాకు దృఢమైన నమ్మకము కలదు వినుఁడు.

చ. ఇలఁ గల వైద్యతంత్రముల • నెల్ల యొనర్చితి ప్రజ్ఞ మీరఁగ
న్వ్రతమతి నాటపర్వజన • మాన్యుఁడనై సలిపిల్లు చుంటి రో
గుల మును మున్న నొంచితినొ • కోర్కి మిసౌఖ్యము నందఁ జేసి యు
జ్జ్వల తరకీర్తిమించితినిఁ • జాల ప్రసిద్ధిని జెందితిన్ నృపా.

మఱియు.

చ. నినునిజశక్తి నేనెఱుఁగ ♦ నేరకఁ గొల్వఁగ రాను కార్యమే
నొనరఁగఁ జేసెదన్ బ్రతికి ♦ యుండినచో బలుసాకులైన నే
దినిబ్రతుకంగవచ్చుఁగడ ♦ తేరిన నిమ్మహి నేను జన్మమొం
దినఫలమేమి? ప్రాణములు ♦ తీపిక దా భువినెట్టివారికిన్.

నా సామర్థ్యముఁ దెల్పెద వినుండు.

సీ. దేహజాడ్యంబైన ♦ దివ్యౌషధంబులఁ
బాయఁగ దానిఁ బా ♦ పంగ నేర్తు
పీడ సోకినగాంచి ♦ వేవేగ మంత్రతం
త్రమ్ములనా బాధఁ ♦ దలఁగ నేర్తు
మతిచంచలించిన ♦ మానకఁ దగు చికి
త్సలదాని బాగుగా ♦ సలుప నేర్తు
విరహాబ్ధిమగ్నయై ♦ వెతలఁ జెందుచునున్న
దవిలి నాథునిఁ దెచ్చి ♦ తనుప నేర్తుఁ
తే. గీ. గాకనింకెట్టి కతమునఁ ♦ గలికి వగల
వెగిలెన వయుచునున్న నా ♦ బింక మొప్ప
తగునుపాయంబు ఘటియించి ♦ తన్నివృత్తిఁ
జేసి మిము సంతసిల్లఁగాఁ ♦ జేయ నేర్తు.

దేవా! నా ప్రాగల్భ్యము విషయమై తమ రెంతమాత్రమును సంశయింప వలసిన పనిలేదు.

రాజు. వైద్యతిలకమా! నీనివాసం బెటనుండు? నీనామం బెద్ది? నీకులగోత్రము లెట్టివి? సమగ్రముగ వక్కాణింపుము.

వైద్యు. దేవా నాకు నివాసస్థల మన నేదొకటి లేదు.

ఉ. పండినచోటఁ బండకయు ♦ బానము ద్రావినచోటఁ ద్రావగా
నుండక యెండవానలకు ♦ నోర్చియరణ్యనదీనదంబులన్
దండిగ దాటి దాటికడు ♦ ధైర్యముతో పురిదుర్గసీమలన్
గొండిక నాఁటనుండియును ♦ గ్రుమ్మరుచుంటిని నేను భూధవా.

తే. గీ- వినుము సర్వంసహాధీశ ♦ విశ్రుతముగ
నవనిజములనుపీడించు ♦ నట్టిరోగ
దమనుఁడన నొప్పుచుండుటఁ ♦ దనరునాకు
దమనుఁడనునామధేయంబు ♦ తథ్యముగను.

ఉ. కులమునుగోత్రమెట్టిదని ♦ కోరగనేల? మదీయదార్ఢ్యమే
దెలిపెడు నేనుదేశముల ♦ ద్రిమ్మరినై చరియించుచుండిమీ
కలికియవస్థఁజూచి యుప ♦ కారముఁజేయఁదలంచివచ్చితిన్
బలుకులికేల ? నాప్రతిభఁ ♦ బాగ్గవమీరలె చిత్తగింపుఁడీ

దత్తు. వైద్యుఁడా ! నీకువైద్యమునందు నిజమైన ప్రజ్ఞకలదేని నాముద్దులపట్టి బుద్ధిని దిద్దుపఱచి మాయొద్దనద్దయు బహుమతులఁదుము.

దమ, చిత్తము, మహారాజా ! (అనిదమనుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

దత్తు. మారుతీ ! ఇప్పుడు మనయొద్దకువచ్చిన వైద్యుఁడు నాముద్దులగున్న వ్యాధిని నివారణఁజేయఁగలఁడను ధైర్యము నీకుఁగలదా ?

మారు. దేవా ! ఈవైద్యతిలకుని పరిభావమనన్య సామాన్యంబనియే యూహించెద. ఏమన, దేవరవారి శాసనఫలానుభవము సోకినదిమొదలిప్పటివరకు నీతండు దక్కవేఱొండు వైద్యుఁడిట్లుదర్పమునుఁ జూపి చలింపని హృదయముతోఁ గుదిర్చెదనని దృఢముగ నకాణింపఁ గలిఁగెనే ? ఇదియుచుఁగాక.

మ. గానాతీతములైన తంత్రము లనే ♦ కంబుల్గ్రహింగల్గఁద
ద్గుణదార్ఢ్యములెన్నఁజాలుదు మెముం ♦ దున? గాక ముంజేతికం
కణముంగాంచగనద్దమేల? నపుడే ♦ గానంగ నాదంభభా
షణయాథార్థ్యములన్ని స్పష్టమగునో ♦ సర్వంసహాధీశ్వరా.

మఱియు.

తే. గీ, పూర్వభవసంచితపుకర్మ ♦ పుంజమిలను
నరయఁబరిపక్వమైనచో ♦ నరులకెట్టి
కష్టములగ్గలినను బాయుఁ ♦ గాన కర్మ
ఫణితి నేయుండువైద్యుని ♦ ప్రాభవంబు.

దక్షు. మంత్రిపుంగవా! మట్టిపిల్లియైనను మానిపిల్లియైనను నెలుకను బట్టుటయే ప్రధానము. ఇంకనీవు నీపనిమీదనుండుము. అంతిపురంబున నేమి జరుగుచుండెనో చూచివచ్చెద. (అనిదక్షమహారాజు నిష్క్రమించుచున్నాఁడు.)

మారు. ఈ వైద్యుని గతియెట్లయ్యెడునో తెలియరాదు (అనిమారుతి నిష్క్రమించుచున్నాఁడు)

(అంతఃపురవర్తులగు వకుళ మాధవులను చెలికత్తియ లిద్దరు ప్రవేశించుచున్నారు.)

వకు. అక్కటా! మనరోహిణి యెట్టిదుర్భ్రమల పాలయ్యెనే! మనతో బహూల్లాసముగా విహరించెడు కీరవాణి యెంతమిథ్యామనోభ్రాంతిచే పరితపించుచుండెనే! ఆవెచ్చెలి దురవస్థంజూచి నేనెంతయుఁ జింతిల్లుచున్నదానను.

చ. కలఁగని నట్టినాథుఁగన • గాసిలి నాయకరత్న శూన్యమై
యలరెడుహారవల్లరికిఁ ద్రియుఁ • హరిణాంకుఁడు లేని రాత్రియున్
బలె, రవినీక్షికై నవయు • పద్మినిచాడ్పున, వంతగుందివ
త్రిఁబలుమన రోహిణీరమణి • దీనతతాంతలతాంత మాయెనన్.

మఱియు.

చ. కనులరమోడ్చియుండి కర • కంజముఁ జెక్కుటఁ జేర్చియూరకే
వనటలవెచ్చనూర్చుచు న • పారవిచారకృశాంగియైన యా
వనజదళాయతాక్షి దుర • వస్థఁ దలంచిన నేమిచెప్పనే
మ్మనమున సర్వమున్మఱచె • మానవనాథసుతేతరంబిలన్

మాధ. సఖీ! మనరోహిణికి నిజముగానే మతిచలించినదని యూహించెదవా యేమి ?. ఆయాలాపములన్నియు నేకసంబద్ధప్రలాపములని తోచుచున్నవి కాఁబోలు కాని యావిలాపములకుఁదగిన కారణము లేకయుండదు. ఆమించుబోడియొక రాకామరునిపై మరులుగొని విరహార్తిచేఁ గృశియించుచుండె. ఏమన, నీవా కాంత కలలోఁగని భ్రమించినదను రాకామారుండు మిథ్యాపురుషుండుగాక నిజమైనమానవుఁడై యైయుండవచ్చును. మనరోహిణీకాంత యాభూకాంత తనూజుని నిజముగానే చూచి మోహించి యుండవచ్చును. కానిపో,

ఉ. కేలనువీణఁ బూనిమణి • కింకిణినూపురతారహారముల్
జాలగఘల్లుఘల్లుమనఁ • జక్కఁగమీటుచుఁ బాడునట్టియా
బాలశశాంకఫాల పరి • పాటిఁదొలంగిమనోజరాగలీ
లాలసచిత్తయై నృపల • లామునిఁగూర్చితపించుచుండునే.

కావుననేకదా,

చ. తనవిలుఁ బూనుచుఁ జుఱ్కారుచుల • దద్దయుఁగల్గఁ జేసి నారిచా
లనమున భ్రాంతులం గొలిసి • లాలితపుష్పచయాంబకంబులన్
మనమునునొవ్వఁ జేయుచును • మన్మథుఁ డాత్మవిలాసలీలలన్
వనజదళాక్షి వింతవల • వంతలఁ జింతిలఁ జేయునో చెలీ.

సుకు. అక్కా! నీకట్టినమ్మిక మెట్లుగలిగెనో తెలియరాకున్నది. పరులకుఁ జూడ శక్యముకానియాకాంత యేకాంతసౌధాంతరంబున కన్యాపురుషుఁడు రాఁజాలునే? చాలు, చాలు. నీకుఁగూడ మతిపోవుచున్నదాయేమి? ఇదివఱలో నెంత మంది మోహనాకారులను తీసికొనివచ్చి కనఁబఱచినను చలింపని యాసరోజాక్షి చిత్తమును నేడెవ్వరు భ్రమింపఁ జేయునో పో? ఇదియునుఁగాక.

ఉ. ఎక్కడిరాకొమారుఁడరిత • డెక్కడినుండిటవచ్చె? వచ్చియా
ప్రక్కను నెట్లుబండె? చెలి • పండిననెట్టుల నూరకుండె? న
మ్మక్కరొ! యేటిమాటలహ • హాపరికింపఁగ నిట్టిచోద్యమిం
కెక్కడనైనఁగంటిమొ? మ • హీస్థలివింటిమొ? మున్ను మాధవీ

మాధ. (చిరునవ్వుతోఁ) చెలీ! వినుము. ఆయిందువదన తనడెందంబునంగల వలపును గుప్తము చేసికొని నేటికి నిజానురాగనిదానుండగు నొకమానవేంద్రతనూజునిఁ బొడఁగాంచి మోహపరితాపంబు నొందుచున్నయది ఇదియునుఁగాక ఖేచరుల మాయావిహారవైచిత్ర్యంబుల నీవెఱుంగవే? మనరోహిణీ కన్య యతిసౌందర్య సంభురాలుకదా. ఆమెయాలాపములనుఁ బట్టిచూడ నామె మనోహరుఁడంత కంటెను మిగుల సౌందర్యశాలియని నేనూహించెద. చెలీ! ఏమినిట్లుతల పంకించెదవు.

వసు. మరేమియు లేదు. కాని, అక్కా! ఖేచరులమాయావిహారవైచిత్ర్యంబులకు వీరల సౌందర్యవిశేషంబులకు సంబంధమేమున్నదే! సుందరులగు మందయానలందరు నిట్టిదురవస్థం జెందుచుండిరే; ఇంక నీయుక్తులు చాలింపుము.

మాధ. ఎంతముద్దరాలవే నెచ్చెలీ! సౌందర్యవంతులగు స్త్రీపురుషులనొకచోఁ గూర్చటయుఁ బిమ్మట నెడఁబాపుటయు ఖేచరులలీలలని మనము వినుచుండుట లేదటే? ఇట్టికారణ మేదైన లేనిచో నాచిలుకలకొలికి చిటికెనవ్రేలిపై పురుషుఁడు ధరించు నుంగరముండుటకుఁ గారణమేమైయుండునో నీవేయూహింపుము.

వసు. ఏమోనమ్మా. నాకేమియుఁ దెలియదు. ఇదియంతయు నొకమాయగానున్నది. అదిగో మనరోహిణియు మణిమంజరితో నిటులనే వచ్చుచున్నది. చూడుము

ఉ. తమ్ములుముత్యముల్ గను వి ♦ ధమ్మునఁ గన్నులనీరుజారఁగాఁ
దుమ్మెదలేపు రేగనని ♦ దోపగఁ గొప్పును వీడఁ గల్వలన్
గ్రమ్మెడుమంచుబిందువుల ♦ కైవడి లేజెమటల్జనింపఁగా
కొమ్మరో! కంటె! రోహిణియుఁ ♦ గోపముతో నిటువచ్చుచుండెనక్కా.

(అంతరోహిణియు మణిమంజరియుఁ బ్రవేశించుచున్నారు.-

రోహి- ఉ. హా సుమబాణ! హా చతుర! ♦ హా సుకుమారశరీర! హా నృపా!
హా సరసీరుహాక్ష! విర ♦ హానలకీలలఁ ద్రోచియిట్లునన్
మోసము జేసిపోఁ జనునె ♦ మోహనరూప! తపించుచుంటినీ
వేసట కోర్వఁజాలనిఁక ♦ వేగమె రాగదవే మనోహరా!

హా! క్రూరకర్ములారా! పాపాత్ములారా! మోహనమూర్తియు నామనోహరుండు నగు నరపాలతనూజుని నాయొద్ద కనిపినవారెవరు? పిమ్మట నాహిమధామసన్నిభుని నన్నెడఁబాయఁ జేసిన ద్రోహులెవరు; అయ్యయ్యో. నేమతిపోయి యేమిటియో పేలుచుంటినని వీరందరు భయపడి తొలంగిపోవుచున్నారు. అన్నా! నేనెంతమంద భాగ్యురాలనైతిని! హా! నామనోనాథా! నీవుకూడ నిట్లు దయవీడి కనుమఱుంగి నన్నలయింపఁ జేయుట న్యాయమేనా? ఆహాహా! అట్టిదాక్షిణ్యభావుండవును సుందరాకారుండవునగు నీ కిట్టిక్రౌర్యగుణకళంకం బెట్లుగలిగెనో తెలియరాదు, హా! భగవానుఁడా! కామదేవా!

మణి. తల్లీ. నీవిట్లుస్వప్న పురుషునికై పలవించిన నేమిలాభమే?
రోహి. ఓహో! జననీ!

మోహనవృత్తము.

హా జననీ నా ♦ ప్రాణధనంబున్ ♦ హరియించినసా ♦ హసుఁడెవ్వఁడె ?
మణి. ఔరా, రాజముఖీ యా ♦ రాటముదేలే ? ♦ రమణీమణిదు ♦ ర్భ్రమవీడగదే.
రోహి. నైజశరీరున్ ♦ నాధునిస్వ ♦ ప్నభవుండనుచున్ ♦ బలుకందగదు
మణి. అం, భోజదళాక్షి ♦ పుష్పశరాభున్ ♦ బురుషున్వరియిం ♦ పుము వేఱొకనిన్.
వసు. సఖీ. ఏలనీవిట్లు దురంతవేదనలఁ గృశియించెదవు ?
రోహి. అయ్యో. ఏమనిచెప్పుదును ? (అనినిట్టూర్పు విడుచుచున్నది.)
మాధ. సఖులారా. ఈమన నెచ్చెలి విరహజ్వరంబుచేఁ బీడింపఁబడుచున్నది ఈమెకు శైత్యోపచారములను చేయవలసియున్నది. కావున, కలువరేకులను తామర తూండ్లనుగొనిరండు. సఖీ, రోహిణీ, ఊరడిల్లుము. ఊరడిల్లుము.

రోహి- మ. అనుఁగున్నెచ్చెలులార! నిర్దయతన ♦ త్యంతంబు నాప్రాణనా
ధుని రాజాత్మజుఁడాచి, యేలనిటు వా ♦ దుల్సేయ? మాపుంసుమీ
రనుమానింపక లేనిచో మదనబా ♦ ణాగ్నిన్ మెయిన్వీడి వేఁ
జనిజన్మాంతరమందునైన నతనిన్ ♦ సత్యంబుగాఁ గూడెదన్

వసు. సఖీ! ఏలనీవిట్లు మాపై నిరాపనిందమోపెదవు ?

క. కలనాదకంఠి చూపం
గలమా కలలోనఁగనిన ♦ కాంతునిభువిలోఁ
గలనారులెల్ల నీవలెఁ
గలనామోడించి వెతలఁ ♦ గలఁగుదురే చెలీ!

రోహి. ఛీ. ఛీ. దురాత్ములారా. మీమొగముఁ జూడరాదు. నాయొద్దనుండి తొలఁగి పొండు. (అనిత్రోసివేయుచున్నది.)
మణి. తల్లీ. లేనిపోని భ్రాంతులందగులక సంతసంబునఁదోడివారలవలె మెలంగరాదటే.

చ. కలయఁగనెండమావులను ♦ గానగఁదోచెడునీరుసత్యమే ?
యలరెడునద్దపుందళుకు ♦ నందలిబింబమునిక్కువంబె ! ఓ

న్నెలవగలాడి! నీదయిన ♦ నీడనుజూచి భ్రమించెదేలనే ?
కలఁగనినట్టిరాసుతుని ♦ కైతమిఁజెందికృశించుటొప్పునే ?

రోహి. హా! ప్రాణేశ్వరా!

మ. అవురా! మామకపూర్వజన్మకృత ♦ పుణ్యంబుల్దలంపంగనె
ట్టివియో! నాథ, మదీయబంధువులుపా ♦ టింపంగదుస్స్వప్నసం
[illegible]రూపుండవటంచుఁబల్కెదరుదు ♦ ర్భ్రాంతిన్నినున్నామనం
బవనిన్గుమ్మరసారెపైనిడినయ ♦ ట్లారాటముంజెందెడున్.

మణి. తల్లీ. ఊరడిల్లుము.

రోహి. అహ్హా. స్త్రీజన్మమెత్తినందు కట్టినసమ్మోహనాంగునిఁ జేపట్టి వానిమహనీయ మంజులమధురాలాపంబులఁ దనివితీర గర్ణంబులం గ్రోలుచు నాలని పొందునందియే జన్మసాఫల్యమును జెందఁవలయును కదా. ఆహాహా!

ఉ. ఆనగుమోముతామరస ♦ మానునునిద్దపుఁదళ్కుఁ జెక్కులా
మేనిమెఱుంగునామిసిమి ♦ మీసమునొప్పుగరాజవత్సమా
తేనియఁజిమ్ము వాతెఱయుఁ ♦ జేటగునానిడువాలుకన్నులే
మానినిపొందఁగల్గి గరి ♦ మంబునసౌఖ్యపయోధిఁదేలునో!

(అంత వైద్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.

మణి. తల్లీ వైద్యుఁడు వచ్చియున్నాఁడు చూడుము.

రోహి. (ఆమాటలువినకయేతనలో) అన్నా. నేనామోహనాకారుని పరాధీనునిగా నిచ్చెదనే ? అయ్యో. ఈవిరహవేదననెట్లు సహించెదను ? అకటా!

శా. ఆజాబిల్లివెలుంగుఱేఁడుతనమా ♦ యన్జేసినాచిత్తమిా
వ్యాజంబొక్కటిఁబన్నెనో పరిణయ ♦ భ్రాంతిన్దగుల్పంగఁగా
కీజాలిన్ననుబిట్టువేచమనసై ♦ యీరీతినన్బాసెనో
ఈజాముల్కడఁదేర్పగానెటులొకో ♦ ఈబాధనెట్లోర్తునో.

బ్రా. (అనినిటలతటఘటిత కరకమలపుటియై బొటనవ్రేల నేలవ్రాయుచునిట్టూర్పు విడుచుచున్నది.)

దమ. (రాజకుమారుని సమీపించి) తల్లీ. శాంతింపుఁడు. శాంతింపుఁడు. ఎవనినిగుఱించి మీరిట్లుఁ బ్రలాపించుచున్నారు?

శోహి. (కోపముతో) ఓరీ. మూర్ఖా! ఎవఁడవురానీవు? మీరందరుకలిసి నాటిరాత్రి నాహస్తతలంబున కనిపించినమోహనాకారునెచ్చోట దాచిరో చెప్పుము.

దమ. తల్లీ. తొందరపడిన లాభములేదు. శాంతిల్లినచో మీకు నేనొక పరమరహస్యమును జెప్పెద.

శోహి. మంచిది. ఆరహస్యమేమి?

దమ. తల్లీ. మీస్థితిఁజూడ నాకొకసందేహము పొడముచున్నది. ఆసందేహమును ముందుగనివారించితిరేని నారహస్యమును జెప్పెద.

శోహి. సరే—నీసందేహమేమి?

దమ. తల్లీ. ఆరాజకుమారుఁడు స్వప్నపురుషుండు కాక నిజమైనమానవుఁడైయైనచో మీ సేవకులలోఁగాని మిత్రులలోఁగాని బంధువులలోఁగాని యొక్కఁడైనను వానివరసి తీసికొని రాలేకపోయెనా?

శోహి. అయ్యో. ఏమనిచెప్పుదును! పురుషవతంసమా! నా సేవకులకు మిత్రులకు బంధుగులకు నాకునిజముగ మతిపోయియున్నదనియే యభిప్రాయము. ఇప్పుడిటనున్న వారిలో నొకరైనను నాయందునిజమైన యభిమానము కలవారులేరు.

ఉత్సాహ. చిన్ననాటనుండినాదు • చెలిమిచేఁ జెలంగుచూ
యున్నచిత్రసేనుఁడేగ • యాత్రసేయ నింకవాఁ
డెన్నఁడైన వచ్చునే ? యి • కేమనందు నిప్పుడాఁ
డున్న నాయవస్థఁజూచి • యోర్చునే? దయామతిన్.

దమ. అన్నా. పాపము. ఎంతకష్టము. ఎంతకష్టము. (అని చేతులడ్డుపెట్టుకొని కన్నీరు తుడుచుకొనుచున్నాఁడు.)

శోహి. మానవోత్తమా! నీవెవ్వఁడవు? ఏదేశమునుండివచ్చితివి. ఇచ్చోటుకు రాఁగతమేమి? నీచర్యలనుఁజూడఁగా నాకొకసందియంబు పొడముచున్నది.

దమ. తల్లీ. నేనొకపరదేశవాసుఁడను వైద్యవేషముచేఁ గాలముఁ గడపుచున్నవాఁడ మీకుకొండొకకారణంబుచే మనఃక్లేశంబుకలిగెనని విని దానినివారింపఁ జూచి వచ్చియుంటిని.

రోహి. అన్నా. నీవొక కాలచోదితుండవగు వైద్యవేషుండవే నా?

దమ- తల్లీ. అవును. నేనుచిత కాలచోదితుండనే. వైద్యుండనే కాని వైద్యవేషుండను కాను.

రోహి. నీవు చెప్పఁదలచియున్న పరమరహస్యమెట్టిదియో తెల్పుము.

దమ. మంచిది. (అనిసమీపించి చెవులో నెద్దియో జెప్పుచున్నాఁడు.)

రోహి. (ప్రసన్నముఖియై.) ఓహో. నేనింక ధన్యురాలనయ్యెన. (అనియానందపారవశ్యంబు చేనిశ్చేష్టితురాలగుచున్నది.)

(అంతనెచ్చెలులు సంభ్రమంబుగఁబరతెంచి)

వసు- ఓహో! చెలి! ఏమియీవింత! నీమిథ్యాపురుషుని జాడలేమైనఁ దెలియవచ్చెనా యేమి?

మాధ- అవును. అటులనే తోఁచుచున్నది- సఖీ ఏలనీవిప్పుడింతగ వికసితవదనారవింద వైయొప్పుచుంటివి ?

రోహి- సఖులారా! ఈవైద్యతిలకుని ప్రభావంబుచే నామనోవ్యాధి శీఘ్రకాలములో నివారణయగుటకు సందియంబులేదు-

సుశీ- సత్యము. సత్యము. తల్లీ కలకాల మొక్కతీరుగనుండ నేర్చునే?

శా. కోపావేశతఁబోయె పుత్రుఁడనుచున్ ♦ క్షోభించు నక్రబ్రోవ నే
ప్రాపున్ లేకఁడపించునిన్నుఁగృపచేఁ ♦ బాలింపఁగా వేడ్కనా
యాపద్బాంధవుఁడిందిరారమణుఁడు ♦ త్యాశ్చర్యమౌనట్లుగా
నీపుణ్యత్వమునిబంపెఁగావలయువిం ♦ ఱే రాజబింబాననా.

దమ- (తనలో) ఓపరమేశ్వరా! నాప్రయత్నము నెట్లుఫలింపజేసెదవో నీదేభారము.

రోహి- (సహర్షముగా వైద్యుని సమీపించి) ఓహో ! వైద్యక్రియాకౌశలా ! ఇంక నాప్రాణములు నిలుచుటకు నీబుద్ధివిశేషమే యాధారము. నామనోవ్యాధిని నివారింపసమర్థంబగు విషయంబున సంఘటింపవలయునుజుమీ? నీవునాకర్ణపుటములయందుఁ బ్రయోగించిన మంత్రప్రభావంబులచే నామనోవ్యాధి సగము నివారణమైనది. తక్కినసగము శీఘ్రకాలములోనే నివారణఁజేసెదవని నమ్ముచున్నదాన.

సుశీ- భిషగ్వరా ! మా ప్రియసఖిని నుల్లసింపఁజేసినచో నీవుగొప్ప పారితోషికంబునుఁ బొందఁగలిఁగెదవు.

తోహి- నెచ్చెలులారా ! నాకిప్పుడత్యంతానందముగనున్నదిసుఁడీ! (అంత చెలికత్తియలందరు శోకముఖులై పేరెలుంగున) ఓహో! యేమి నాభాగ్యము! (అనికోలాహలముగ సంతసింపుచుండ దక్షమహారాజుగారు ప్రవేశించుచున్నారు.)

దక్షు- ఓహోహో! ఏమి! నాభాగ్యరాశియగు చిలుకలకొలికి యారోగ్యున బహుప్రసన్నముఖియైయున్నయది- ఏమినాపుణ్యము! (అనికుమార్తెను సమీపించి)

శా. రావేముద్దులపట్టి రాగుణఖనీ • రావేసుధాంశూజ్జ్వలా
రావే కోమలపద్మపత్రనయనా • రావేలతాంతాధరా
రావేనోములపంటమూలధనమా • రావేకళాశాలి
రావే సంతసమందఁ జేయఁగదవే • రా భాగ్యరాశీ సుతా.

ఆ. వె. నాదుముద్దుమూట • నాభాగ్యరత్నమా
నాదుజీవనంబ • నానిధాన
నాదుప్రాపునీవ • నమ్మియుంటిని చాల
నాదు వెతలఁబాప • నాతిరా నె.

తల్లీ. నీమనోధనాపేక్షితుండగు రాజశేఖరుండు వచ్చియున్నాఁడు. నీవుసుముఖివై వానిని వరించి సుఖముపడయుము.

తోహి. దుఃఖమువడయుమనుఁడు. ఇంతయేల? తండ్రీ మీమాయోపాయము సంపూర్ణముగా ఫలించినది. మీకునాయెడల నిజమైనపుత్రికాభిమానముకలదేని నాజీవితేశ్వరుని జూపుఁడు. లేనిచో నేరజ్జువిషాగ్ని జలంబులఁ బ్రాణపరిత్యాగంబుఁజేయుట నిశ్చయము.

దక్షు. అన్నా! నాప్రియకుమారీరత్నంబున కింకనుమతిపోయియేయున్నది. కలలోఁగని భ్రమించిన రాకొమరుని నేనెట్లుదోడ్కొని రాఁగలిఁగెదను ? దోడ్కొనిరాని చో నాముద్దులగున్న తనప్రాణంబులను విడుచునఁట. నేనేమి సేయుందును అయ్యో. తల్లీ! నిరపరాధివైననిన్ను వెతలపాలు చేయుటకు మేముశత్రులమే ?

మత్తకోకిల. మున్ను నే బహునోములన్ వ్రతముల్ ఘనమ్ముగఁ జేసియో
సన్నుతాంగి రొసన్నుగని వంశంబునన్ దౌహిత్రిలా
భోన్నతిన్ ఘటియింతు వంచుఁ మహోన్నతస్థితిఁ బెంచితిన్
గన్నతల్లి ముకాలమృత్యువు కైవసంబటు జేయుదువే

(అనిసవిషాదంబుతోంగల వైద్యునిఁజూచి) ఆఁ! వేషధారీ! నీమోసము తెలిసి
నది. కానియందులకుఁ దగినఫలమునిప్పుడే యనుభవింపవు.

వైద్యు. దేవా. నామనవి యొకటి చిత్తగింపుఁడు. దేవరవారికుమారీరత్నంబునకు కొకపై
త్యవ్యాధియంకురించి యీకొంత ప్రకారము బోధించుచున్నది. అద్దానిమహా
ర్ణవమాత్రములోఁ గుదుర్వసమర్థంబగు వనమూలిక యొకటికలదు, అయ్యదిప్ర
స్తుతము నాయొద్దలేకపోయినను ద్వీపాంతరములయందెందైన నాయోషధిని వెద
కితెచ్చి మీపట్టికీవ్యాధిని వారణఁజేసెద,

చక్రు, మాయవైద్యుఁడా, ఇఁకను మేము నిను నమ్మఁజాలము, కుదిర్చెదమనివచ్చి కుదర్చ
లేనివారు పొందెడు శిక్షనుఁబొందుటకు సిద్ధముగ నుండుము,

రోహి, తండ్రీ! నాకీవైద్యతిలకునియందు దృఢమైన నమ్మకముకలదు, కావున వీనిపై
నలుగక నీతండు చెప్పిన చొప్పునఁ జరిగించుటయె నాకోరిక.

చక్రు- అటులైన, తల్లీ, ముఖ్యముగ నీకోరిక ప్రకారమే జరిగించెను. వైద్యుఁడా
నీ వెంతకాలములో నాయోషధిని దీసికొనిరాఁ గలిగెదవు ?

వైద్యు, దేవా, ఒకమాసము గడువిచ్చినం జాలును.

చక్రు, మంచిది, ఇపుడే రేవునందు యానపాత్రము సిద్ధముగనున్నయది: శీఘ్రము పోయి
రమ్ము: (అనియందరు నిష్క్రమించుచున్నారు:)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష వీక్షణాసారసమాసాదిత రసబంధుర
కవిత్వవైఖరీ ప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్రహోతృవంశ
కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న సుపుత్ర వెంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రోహిణీ
సుధాకరవిజయంబను నాటంబున
తృతీయాంకము



శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## చతుర్థాంకము.



(సముద్రములో నోడపై వైద్యుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వైద్య. ఉ. రంగదభంగనిర్మలత • రంగము లాకసమంటునట్లు ను
ప్పొంగ నభోంతరాళమునఁ • బొల్చువిహంగమరాజితోఁడను
త్తుంగవిసారనక్రముల • తోఁగమఠంబులతో వియద్ధునీ
సంగతి నేత్రపర్వమయి • సాగర మొప్పెడు నద్భుతంబుగన్.

ఆహా! ఈసముద్రయాన మెంతమనోరంజకముగా నున్నది. స్వచ్ఛమైననీలవర్ణముతో నొప్పుచుండెడు గగనలక్ష్మికి కంఠాభరణంబుల ననుకరింపుచు వింతవన్నెలుగల పులుఁగుతెల్లయెడల పెల్లుగ నెగురుచున్నవి. చరమగిరిగతుండగు భానుసమాగమనంబునకలరి పరిశుద్ధికై ఛాయాదేవి యారవేసిన రక్తపీతాంబరంబన నపరదిక్కున కెంజాయ లొప్పుచుండె. ఏప్రక్కఁ జూచినను శ్రవణోత్సవంబుగ జలిబిలినినదంబుల తరంగములు లేచుచున్నవి. వృద్ధభానుకిరణ ప్రసారంబునఁ బ్రభిన్నతరంగ జలబిందువు లమూల్యరత్నమౌక్తికంబులోయన శోభిల్లుచు రత్నాకరనామ సార్థక్యకత్వమును సిద్ధింపఁ జేయుచున్నవి అహహా. ఉల్లాసముతో నీటిపైఁ దేలియాడెడు చిఱుచేపలయొక్క తరళకాంతు లెంతమనోహరముగనున్నవి, నీటిపక్షు లాచిఱుచేపలను బట్టుటకై నీటినారయుచు నెంతయుత్సాహముగా కలకలస్వనంబులతో నెగురుచున్నవి. పల్లెవాండ్రు చేపలను బట్టుటకై వేటనావలసంచరింపుచు నతిసంభ్రమంబుగ వలలొగ్గువారును, తిన్ననివలలనులాగి ఘూర్ణించువారును, యావలమిట్టుపడుచుండు చేపలనత్యాతురతచేఁ గట్టిగఁబట్టి తమబుట్టలలోనికిఁ ద్రోయువారునుగాఁ బలువిధముల నెంతయు ను

త్సాహముతో సంచరింపుచున్నారు. ఆహా! దక్షిణదిక్కునుండి పయ్యెరదెంతో హాయినిగలిగించునటులవీచుచున్నది. ఇప్పుడీసముద్రమల్ల కల్లోలముఁగాక యెంతయు నెమ్మదిగానున్నయది. గాలియు వాటముగానుండె. ఈయోడయు నత్యుల్లాసముగా నడుచుచున్నది. ఇవన్నియుఁజూడ నాప్రస్తుతోద్యోగంబున కనుకూలశకునంబులవలెఁ గాన్పించుచున్నవి. ఆఁ! యేమిచెప్పుమా! బెస్తలందరు తత్తరపాటుతోఁ బరస్పరాహ్వానములు చేసికొనుచున్నారు- శ్రద్ధగావినవలయును- (అనియాలకించుచున్నాఁడు-)

పల్లెనాయకుఁడు- (తోడివారలనుద్దేశించి) ఓరబ్బోసి- ఈపాటికిసేపలయేట సాలించండోసి- అబ్బోసిబాబు తుపానొచ్చేదుకంబోసునోసి. తూర్పుగాలిబెగులు పుట్టించునటులీసుసుండెనోసి అదుగోనీటిపచ్చులెక్లెగురుచుండెనో శూడండోసి ఇంకనుమనరేవుకాడకు పోదారిరండోహోయి ఆడబ్బాసిగ్గోసిన సేపల్లెండోసి- మగికొకతూరొద్దారిరండోసి. ఝుళ్లండే హే-

వైద్యు- ఆహా! గడియకిందటనెంతో రమణీయముగానుండిన భూనభోంతరాళమంతేయు నిపుడెంతభయంకర స్వరూపమును ధరించెను. జాలరులు తమవేటఁజాలించి చెల్లాచెదరగా నలుదిక్కులకు పాఱిపోవుచున్నారు. నావికులు పడవతెరచాపలను దింపివేయుచున్నారు. పల్లెపసిబాలకులెంత నిర్భయముగా నోడకొయ్యలపైకెక్కి త్రాళ్ళను సవరించుచున్నారు. ఆహా! అంతకంతకు గాలి బహుభయంకరముగా రేగుచున్నది. అదిగో తూర్పున గాటమగు మబ్బులలో మెరుపులు మెరయుచున్నవి. ఛటచ్ఛటానినదంబుల గుండియలవియునటుల నుఱుములుఱుముచున్నవి. ఎక్కడఁజూచినను పిట్టలు చెలరేగి యాడుచున్నవి. ఇవియన్నియు నొకభయంకరమైన తుపానాసన్నమైయుండుట సూచించెడు. అయ్యయో! అట్లయిన నీనడిసముద్రములో నేనేమిచేయుదును- ఇందలిజీవులగతియెట్లయ్యెడునోగదా. హా! దైవమా, నీలీలాసంకల్పం బెట్లులున్నదో తెలియరాదు. అత్యార్త్తులమగు మమ్ములనీయాపదనుండి తొలఁగించి రక్షింపుము. ఈయపారపారావారంబున నీవుదక్క మాకు వేఱొండు శరణ్యంబులేదు. ఆహాహా! తుపానురేగినది. ఇంకనెట్లోగదా.

లయగ్రాహి.

ముక్కుటపుమారుతము ♦ లొక్కతతిరేఁగ నిరు
పక్కల తరంగములు ♦ నెక్కొనియెడున్ బ్రా
గ్దిక్కునను మించులుత ♦ ళుక్కుమన మేఘములు
మిక్కిలిగ గర్జిలెడు ♦ నక్కజముగాఁగన్
గ్రక్కదలెనోడ యొక ♦ చక్కినిఁ జరింపక యు
నెక్కడనొ పోలఁగతి ♦ నిక్కముగనూఁగున్
గ్రిక్కిరియఁగాఁ దిమిర ♦ ముక్కడరఁ గ్రమ్ముటను
వెక్కసముతో చెనిది ♦ యొక్కడితుపానో !

ఔరా! ఎంతటిలో నెంతప్రళయము తటస్థించెను! లంగరు వేసియున్నను నీయోడ నిలబడక స్వేచ్ఛగఁ దిరుగుచుండె. చూపకమున వ్రేలాడు త్రాళ్లన్నియుఁ దెగిపోవు చున్నవి. అదిగో నావికుఁ డెద్దియో కేక వేయుచున్నాఁడు- శ్రద్ధగా వినవలయును (అని యాలకించుచున్నాఁడు).

ఓడనా. శా. హాహా యోడమునింగి పోవుజనులా ♦ రాహా! నివాటిల్లుమీ
హాహారావము లేమిలాభమిటనా ♦ యాలాపముల్మాని యే
సాహాయ్యంబును నైనఁ బొందుటకునై ♦ సర్వేశుఁ బ్రార్థించినా
యూహన్ జూపక మానిధైర్యమును మీ ♦ గూనన్ శుభంబయ్యెడిన్

వైద్యు- ఆహా. ఈతుపానెంతటిలో నధికమాయెను ! (అంతనాయోడ యొకకొండకుఁ దగులుకొనుచున్నది.) ఆఁ! ఏమి చెపుమా. ఇప్పుడొక పెద్దచప్పుడు వినిపించినది ఈయోడ యేదైననొక కొండకుఁ దగులుకొనెనా యేమి? అట్టియుపద్రవమే సంభవించెనుగాఁబోలు. అన్నన్నా! ఓడలోనిజనులందరు హాహారావములతో నెట్లు పైకి వచ్చుచున్నారు! కటకటా!

సీ. ఒకయోరనోడనా ♦ వికులార్తరవములఁ
బటుసంభ్రమంబునఁ బఱచుచుండి

యొక చెంతఁబితరుల • నొత్తిచీఱెడు బాల
కులరోదనధ్వాన • ములు చెలంగ
నొకవంక నెదురొంపు • లకుఁగందువులదార్చి
యడలుటోటుల యేడ్పు • లతిశయిల్ల
నొక్కకేవసతిభీత • చకితవృద్ధజనాళి
హాహారవంబుల • నడలఁజొచ్చె

సీ. ప్రబలఝంఝానిలంబుపై • వంగఁదొడఁగె
భీకరంబుగఁదరఁగలు • పిక్కటిల్లె
చిటపటధ్వానములనోడ • చెక్కలెల్ల
పీనునో దేవ! మమ్ముగా • పాడవయ్య.

హా! దైవమా! నాప్రియమైనతల్లిని యెడఁబాసి చిరకాలమన్యదేశ సంచారముఁ జేసిచేసి యిప్పుడీలాగు సముద్రములో మునిఁగి యామెనుగూడ దుఃఖార్ణవంబులో ముంచెదఁగాఁబోలు. అతిప్రేమ చేఁగన్నతల్లి నన్నెడఁబాయఁజాలక కడుదుః ఖించుచుండఁ గఠినహృదయుఁడనై విడఁద్రోచి పోయిన పాపాత్మునకిట్టి దిక్కుమాలిన మరణము తటస్థింపనున్న. అయ్యయో! చిన్ననాటనుండియు నేను సోదరీభావముతోఁ జూచుచున్న యారాచకూతుని కిదియొక క్రొత్త యాసనుఁగల్పించి లేనిపోనిది మఱింత దుఃఖపెట్టెదనుకాఁబోలు. అన్నా; నే నేమిచేయుదును. ఇప్పుడు నేను విచారించుచుండిన లాభములేదు. ఓడచెక్కలు విడిపోవుచున్నవి. లోనికి నీరునిరర్గళముగ వచ్చుచున్నది. ఎద్దియేని నొకదృఢమైనదుక్కను సంగ్రహించి దానిచే నాప్రాణములం గాపాడుకొనఁ బ్రయత్నించెద. ఆహాహా! కీడులో నొక మేలన్నట్లు నాకిదిగో నిక్కడనొక గట్టిచెక్కలభించినది. దీనిసహాయంబున నే సముద్రములో నీది దరిఁజేరఁబ్రయత్నించెద. (అనిసముద్రములో దుమికి యీఁదుచు) అయ్యయ్యో, నాసహచరులైనజనులెట్లు సముద్రములోఁబడి మునిఁగిపోవుచున్నారు? అన్నా అద్దరియిద్దరి గానరాని యీమహోదధిలో నే నెంత నేసీఁదవలయునో గదా? అదుగో జడమర నల్లనిచుక్కవలె న

ద్దియో గాన్పించుచున్నది యహో అదియొకభూభాగమే కావచ్చును, అట్లైన నేగవ్యూతిమాత్రంబేఁగినచో గట్టుచేరంగలిగెదను. హా రక్షకా నన్నేలాగునో దరిఁజేర్చ నీదేభారము. ఇదిగో గట్టుసమీపించితిని- (అని వైద్యుఁడు గట్టెక్కి) అమ్మయ్య. ఇక్కడికి నేకొంతమట్టుకుఁ గృతార్థుఁడనైతిని. ఈలాటి మహో పద్రవములోనుండి తొలఁగించి నన్ను రక్షించిన పరాత్పరుఁడే యీ నాయుద్య మంబునుగూడ నెరవేర్చెడునని నమ్మెద. (అని నలుప్రక్కలు తేరిపారఁజూచి) ఆఁ! ఏమి! నేను తిరుగ మగధదేశంబునకే వచ్చితినికాఁబోలు. అబ్బా! అగణిత గ్లానిచే నాకరచరణాద్యవయవంబు లేవియు స్వాధీనములు కాకయుండె. అన్నన్నా!

చ. నడవఁగ కాళ్లురావు నయ ♦ నంబులఁ జీఁకటి గ్రమ్ము శ్రాంతిచే
వడఁకుచునుంటి శీతమున ♦ వస్త్రములుం దడియార లేదు నేఁ
గడువడి క్షుత్పిపాసలను ♦ గాసిలుచుంటినిఁ గాన నింక నా
బడలిక వాయఁ గొంతవడిఁ ♦ బచ్చిక పట్టున విశ్రమించెదన్.

(అని యిటునటుఁ జూచి) అదిగో నికటికనతి దూరంబున నొకతటాకంబును దాని చెంగట నొక రసాలవృక్షంబును గాన్పించెడు. ఎంత శ్రమపడియైన నేనచటికేగి చూతఫలంబులఁ గడుపారభక్షించి నిర్మలోదక పానంబుచే సేదదేరి కొంతవడి యట విశ్రమించెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత విశారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశా- ఓహో! ఏమి యీయింద్రజాలము! సుధాకరయువరాజచంద్రుని మిథ్యాప నో భ్రాంతికి మూలమెట్టిదియో విచారింపవలసినదని సింహళద్వీప భూపాలుండగు రత్నాకర మహారాజుగారు నాకాజ్ఞాపించియున్నారు. నేనెంతదేశములు తిరిగిన నందును నిదర్శనంబైన విషయంబెద్దియుఁ గానరాదు. ఈమగధదేశంబునఁ గూడ నావదంతియే వ్యాపించియుండెను కాఁబోలు. ఓహో! ఏమియీచిత్రము అదిగో మగధదేశాధిపతియగు రాజశేఖరుఁ డమాత్యద్వితీయుండై యిటులనే వచ్చుచున్నాఁడు. అతండు పాంచాలనరేంద్రునితోఁగూడి మాయేలికపైనే యేమిటియోమంతనములు చేయుచుండెనని తెలియవచ్చినది. కావున వీరలిప్పుడేమేమి ముచ్చటించుకొని యెదరో నేనీ చెట్టుచాటున నుండి వినియెద. (అని యొక చెట్టుచాటున దాగుచున్నాఁడు.)

(అంతరాజశేఖరుండును మానవర్మయు ప్రవేశించుచున్నారు.)

రాజ- మిత్రమా. ఆకమలాకరంబెంత రమణీయముగా నున్నదో చూడుము.

చ. తమచెలిరాకచేనలరి ♦ తమ్ములసంతసమొందుచుండలో
భ్రమరములుత్సహించితమ ♦ వల్లభివల్లభులంగ్రమంబునన్
దమకముమీరఁగూడఁగను ♦ దగ్రతరేగవిహంగసంఘముల్
భ్రమఁగొనిపాడఁగంబె కను ♦ పండువగొల్పుసరోవరంబిటన్.

(అనియిటునటుఁజూచి) మంత్రిపుంగవా. ఆకనఁబడెడు కుజచ్ఛాయనెవరో మానవుండు కడుగాఢ నిద్రాముద్రితుఁడై పరుండియున్నాఁడు. అతండీమగధదేశంబునకురాఁగతం బెట్టిదియో తెలిసికొని రావలయును. (అనినిద్రాసక్తుండైయున్న దమనునిచేరంజని వానిజేబులోని యుత్తరంబునుఁ బసిడియుంగరంబును బైకిదీఁసిచూచి నివ్వెఱగంది) మిత్రమా! చూచితివా, యీయంగుళీయమును. ఇదియెవరిదియై యుండవచ్చునో కనిపెట్టుము (అనియుంగరమును మంత్రి చేతికిచ్చుచున్నాఁడు.)

మాన- (ఉంగరమునుజూచి) ఇదిరత్నాకరుని పుత్రుండగు సుధాకరుని యుంగరము వలెఁగాన్పించెడు. మున్నొకనాడు సింహళద్వీపమందలి పద్మాకరతటంబున నవగాహనం బాచరించుచుండ సుధాకరుని వ్రేలినుండిజారి సలిలంబులోఁ బడ నిద్దానినే వెదకితిరుగ నాతనికిచ్చియుంటి.

రాజ- మంచిది. (అనిసామర్షంబుగఁదిరుగా యుంగరమునందుకొని) మిత్రమా! నాకు నట్లనే తోచుచున్నది. అయినసీయుత్తర మేమిటియో జూడనిమ్ము. పిమ్మట యోచింపవచ్చును. (అనియుత్తరము జూచుకొని తనలో) అన్నా! ఎంతమోసమువచ్చెను! కానిమ్ము. ఇప్పుడైనను మిగిలిపోలేదు. (ప్రకాశముగా) మిత్రమా. ఇటురమ్ము. (అని చెవులో నెద్దియో చెప్పుచున్నాఁడు.)

మాన- చిత్తము, చిత్తము. ముఖ్యముగ నేనటులనే జరిగించెద.

రాజ- ఇదిమనకెంతయు నవశ్యకర్తవ్యంబుసుమీ. నీవేమఱియుండకుము. నేనిప్పుడే పాంచాలదేశమునకుఁ బోయివచ్చెద. (అనిరాజశేఖరుఁడు పాంచాలదేశమును గూర్చి నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత దమనుఁడు నిద్రమేల్కనిలేచి)

దమ- అన్నా! నేనెంతగాఢనిద్రించి దవిలియుంటిని! (అనిజేబుతడవుకొని) అఁ

ఏమిది ! నాజేబులో పసిండి యుంగరంబు నుత్తరంబుఁ గానరావు ; పేమైపో యెనోకదా ! అయ్యో ! నేశ్రమపడి పూనివచ్చిన కార్యమెంతయు విఫలమై పోయినది. ఇంకనెట్లోగదా. హా ! దైవమా!

సీ. ఇంకనెవ్విధమున ♦ బంకజముఖి మనో
హరుని నేనెందైన ♦ నరయువాఁడ
నాథుఁ దెచ్చెదనంచు ♦ నమ్మించివచ్చితి
తెరవమో మెటుఁనేను ♦ తిరిగిజూతుఁ
గాంచిననీపని ♦ కాయయూపండాయె
నాయననేయుక్తిఁ ♦ జేయనేర్తు?
యుక్తిఁజేయకయున్న ♦ నువిదవీడదె తన
ప్రాణంబులనుదుఃఖ ♦ భరముచేత

తే. గీ. కటకటా యేలనాకల ♦ కంతకంతి
వ్యర్థమగునాశలనుముంచి ♦ వనటఁబెంచి
పాపమొడిఁగట్టుకొంటిని ♦ పాత్రలుమాలి
ఏలరావలెనిటకునే ♦ జాలిఁదూలి.

కట్టా ! ఎంతపనిజరిగెను. (అనిమానవర్మనుజూచి) ఓహో ! మానవోత్తమా ! మీరెవ్వరు ? ఏలమీరిచ్చోటవేంచేసి యుంటిరి ?

మాన- పురుషశ్రేష్ఠమా ! నేనుమగధదేశాధిపతియగు రాజశేఖరుని మంత్రిని, వేఁటవినోదార్థమైవచ్చి పసిఁడియుంగరమును ముక్కునఁగఱచిపట్టిపాఱుచున్నపిట్టనొకదానినెగిచి వచ్చుచు నీయాశ్రిందవ మునువినినేనిటవచ్చితి.

దమ- ఓహో ! పసిఁడి యుంగరముతో నెగిరిపోవు పిట్టయేదిక్కునకరిగెనో మీరెఱుంగుదురా ?

మాన- ఎఱుంగుదు. ఇటురమ్ము. (అనిదమమునితో మానవర్మ నిష్క్రమించుచున్నాఁడు)

(అంతవిశారదుఁడు వెలికివచ్చి)

విశా- (స్వగతము) వీరలెద్దియో దుర్మంత్రమును జేయుచున్నారు. ఇంతపాటాత్తుగా రాజశేఖరుండు పాంచాలదేశంబున కేగుటకేమి హేతువో తెలియరాదు. బా

టసారియుంగరమును రాజశేఖరుండే హరించియుండవచ్చును. అయినను మాన వర్మ పలుకులు సంశయమును గలిగించుచున్నవి. పాటసారి మాటలను బట్టిచూడఁగా నాతండొక రాజకన్యాసందేశంబున పనిఁబూని వచ్చెనని తోఁచుచున్నది ఎట్లయిన నీయుదంతమును మారాజుగారికి శ్రుతపఱచవలయును.

[అని విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు]

[సింహళద్వీపంబున కారాగృహములో సుధాకరుని మోహపరితాపము]

సుధా. హా! భగవానుఁడా! ఆడిని నే నేల వెఱ్ఱివైరాగ్యమును బూనితి. నన్నతి ప్రేమ చేఁజూచుచుండెడు నాజననీజనకుల మాట నే నేల విననైతిని. ఓజీవితేశ్వరీ!

ఉ. నాయనుకూలభాగ్య సద ♦ నా మదనాగ్ని నిద్రోచియిట్లునన్
బాయఁగనీకు నేనుపగ ♦ వాఁడనె కోమలి లేతమావిగు
న్నా! యిఁక నాదునయ ♦ నంబులకుత్సవమబ్బునట్లుగా
వేయివిధంబులం బరిత ♦ పించుచునుంటిని రావె సుందరీ.

క. కలికీ ముద్దులచిలుకల
కొలికీ నా మెదదహించు ♦ క్రూరమయినపూ
ములికీ నాసైనీకే
యలుకేలే వేగరావె ♦ యలికులవేణీ.

హా. ఏణాక్షీ! నీ వెంతమాయలాడివే!

ఉ. ఎంతటిజాణవే సమయ ♦ మెంచి సుషుప్తినిఁ జెందియుండ నా
వంతయుశంక లేక పరి ♦ హాసముఁ జేయఁగ నాదు ప్రక్కకే
కాంతమవచ్చి నేర్పుఁగను ♦ కాంతరొ నీకనకాంగుళీయముల్
సంతసమందఁ బెట్టితివి ♦ సారసలోచన నాదు వ్రేలికిన్.

కవిరాజవిరాజితము.

ఇదివరకిమ్మహి ♦ నిందునిభాస్యల ♦ నేణసునేత్రల ♦ నెందఱినో
ముదముగ చూచిన ♦ మోహముకల్గదు ♦ మోహిని నీపయి ♦ ముందుగ నా
హృదయము చిక్కెన ♦ హీనవిలాసిని ♦ యేమొదఁ డాగితి ♦ వేయకటా
యదనిదె మారశ ♦ రాగ్నికినింధన ♦ మైతిని కావవె ♦ యబ్జముఖీ.

[అంతరత్నాకర మహారాజు ప్రవేశించి]

రత్నా- అన్నా! నాప్రియతనూజుండు కలలోఁగన్నకన్యకామణింగూర్చి రేయుంబవలు నెట్లు మనోభ్రాంతులకు లోనై నవయుచున్నాఁడు! వీని నెట్లు శాంతింపఁ జేయనగునో కదా.

సుధా- (తనవ్రేలినున్న యుంగరముఁజూచి) హా. నాముద్దుటుంగరమా! నీవుకూడమావలెనే కాంతివిహీనవై గాసిల్లుచుంటివాయేమి? అటులనే కావచ్చును.

ఉ. ఆనలినాక్షిఁబాసివిర ♦ హార్తినిఁగుంది కృశించుచున్న యీ
హీనునివ్రేలినున్నఫల ♦ మేమియటంచునో కాక రాజబిం
బానన బాసి యుండుటనో ♦ హా! పరికింపగఁగాంతిఁద్రోచినీ
మానితదివ్య తేజమును ♦ మాపితి వెంతయు నంగుళీయమా.

ఉంగరమా. నీవుకాంతిమారియున్నను నాకుప్రియమైనదానవే. అయ్యయో వెఱ్ఱిడెందమా! మోహనాంగియైన యాకలువకంటి నెడబాసి యుంగరము నాసించిన నేమిలాభమే?

ఉ. మించులమించు నజ్జముల ♦ మేలిమిశోభ హసించుఁ జంద్రికన్
గొంచెముసేయుఁ జక్కవల ♦ నున్నొలిబుచ్చును పాముఁగెల్చురా
యంచలఠీవి గేరు మది ♦ రాక్షి శరీరవికాశ నేత్ర హా
సాంచితమైనచక్కవయు ♦ నాకనుయానముఁ జూడనెంతయున్.

అయ్యో. నావంటి మందభాగ్యున కట్టిసుందరి లభించునే?

రత్నా. కుమారా! ఏల నీవిట్లు వ్యర్థమైన భ్రాంతులందగిలి పరిదేవనంబుఁ జేసెదవు?

మంగళమహాశ్రీవృత్తము.

పూనికలలోఁ గనిన ♦ పూర్ణశశిబింబముఖిఁ ♦ బొందుటకుఁ గోరిసువిచారా
హీనయసుశీలవిర ♦ హానలములోన నస ♦ హాయుడవునైపడి కుమారా
మానిత శరీరమునకు ♦ మారతమ తేజమును ♦ మాపఁగదపించుటిది మేరా
నానిధివటంచుమది ♦ నమ్మితినినిన్నుకరు ♦ ణామయవిశేషగుణధీరా.

తనయా. నీకుమనః ప్రీతినిఁ గలుగఁ జేయఁజాలు సుందరీమణులెందఱో యుండఁగా స్వప్నమునందోచు నాయిందువదనకై కుందెదవేల రాతండ్రీ.

భుజంగప్రయాతము.

మదిన్ రోఁచి నీ స్వప్న • మందోచుమిథ్యా
సతిన్ జూడ నీకిట్టి • సంతాపమేలా?
రతీదేవినిరంబోలు • రామాలలామల్
క్షితిన్ నీకొరుల్లేరె • చెందంగఁ బుత్రా.

సుధా-తండ్రీ! మీమాతోపాయము సంపూర్ణముగా ఫలించినది. నన్నేల మీరిప్పుడో దాక్ష నభినయించెదరు?

రత్నా-కుమారా! ఒంటరివై నీవీ కారాగృహమునందుండుటచేత కాంబోలు దుస్స్వప్నములచే నీమతి చలించినది. ఇంక నీవీచెరవిడి యంతిపురంబునకురమ్ము.

సుధా-తండ్రీ! ఇప్పుడైన నాయన్నలమిన్నను నాకన్నుల కగుపఱచిరేని నేనీ చెరసాల వీడివచ్చెద. లేకున్న నింకమీకు నాకుఋణముచెల్లెనని గట్టిగ నమ్మియుండుడు

(అనిసుధాకరుఁడు లోలఁగిపోవుచున్నాఁడు.)

రత్నా-(కడుదుఃఖితుండై తనలో) కట్టా! యెంతపనివచ్చెను ! హా ! దైవమా! లేకలేక బుట్టిన కులసాగరచంద్రుండగు నాప్రియకుమార తిలకునకు మిథ్యావిషయభ్రాంతి చేనగు చిత్తవైకల్యంబను నొకకళంకంబుఁ గలిఁగించి నాహృదయమును ఖేద తావలం బగునటు లొనరించితివి కదా ! అయ్యయ్యో ! నాకుఁగూడ మతి పోవుచున్నదాయేమి? సర్వసముండగు పరమేశ్వరుని నిందింప నేల. నావార్థక్యావస్థయిట్టి యికట్టుల పాలుకావలసియున్నది కాఁబోలు. పురాకృతకర్మఫలము ననుభవింపక నేరికైనఁదీరునే.

ఉ. గోత్రము నిల్పఁగా మదినిఁ • గోరిక మిక్కిలి నగ్గలింపఁగా
రాత్రిపవళ్లునాకను ని • రంతరముం దపియించి నేటికీ
పుత్రునిఁగంటి నంచుఁగడు • పొంగితి వానిమతిభ్రమించెహా !
పుత్రులఁగాంచ నేరని నృ • పుల్ ధర నెంతయదృష్టమంతులో.

సీ. శ్రీహరిసత్కృపా • సింధూద్భవుండోట
కళలఁబాయుసటంచుఁ • గాంచనైతి

సకలవిద్యాసార • సంగ్రహమూర్తియై
కలలనమ్మునటంచుఁ • దలచనైతి
లలితసద్గుణగణా • లంకారమయుఁడౌట
నయమువీడునటంచు • నమ్మనైతి
ముద్దులుగులికెడు • మోహనాంగుండౌట
బడలియుండునటంచు • భ్రమయనైతి

తే. గీ. నాదుకులసాగరంబును • బ్రోదిసేయఁ
బుట్టిన సుధాకరుండౌట • వట్టిభ్రాంతి
నందిసవయునటంచుఁగా • నంతయైనఁ
భావమునసమ్మనైతినో • దేవదేవ.

(అంతప్రధాన మంత్రియగు శ్రుతకీర్తి ప్రవేశించుచున్నాఁడు.)

శ్రుత-(తనలో) ఆహా! సింహళద్వీప మండలాఖండలుండగు నీమహారాజున కెంతవంత వాటిల్లె. విపరీతమనోభ్రాంతిచే మిక్కిలి కృశియించుచున్న సుధాకర యువరాజచంద్రునిఁజూడ నాకే మిక్కుటమైనవిచారము కలుగుచుండ నపూర్వముగాఁగనుంగొనిన నిజపుత్రుని దురవస్థనుఁగాంచు తండ్రిమనస్సు నిలుచునెట్లు అయిన వాయోపినంతవట్టు శాంతవచనంబుల నీధరాధవునకునయించి 'దుఃఖోపశమనంబుఁజేయఁ బ్రయత్నించెద. (అని ముందుకునడచి ప్రకాశముగా) మహారాజా! శాంతింపుఁడు- శాంతింపుఁడు వ్యర్థమైనవగలపాలై కుందుటేమి ప్రయోజనము?

రత్నా-ఓహో! సచివవర్యా వచ్చితివా? మనఃక్లేశంబుచే మైమఱచినిన్నుంగననేరనైతి. నీరాక బహుసమయోచితంబు. ప్రచండాతపక్షుతుఁడైనవానికి మేఘోదయంబువలె పుత్రుని దురవస్థఁజూచి తపించుచున్ననాకు నీదర్శనంబయ్యె. నేనింక ధన్యుఁడనయ్యెద. మిత్రమా! ఆపత్కాలసారంబులందోఁగాదు హృత్పద్మంబుల వికసింపఁజేయ మిత్రసమాగమనంబేకదా ముఖ్యసాధనంబు.

శ్రుత-దేవా! ఏలయిూరీతిగా జాలిం దూలెదరు? ఈసంతాపమువలన సార్థకమేమి?

రత్నా-మిత్రమా! ఏమనిచెప్పుదును.

చ. కొడుకుదయించెనన్నపలు ♦ కున్నని నాదుతపఃఫలంబునేఁ
బడసితినాకొ అంతలోఁ గఁ ♦ బాసెఁగృతార్థుఁడనైతి నాకునే
యొడనిఁక లోటులేదనుచు ♦ నెంతయుసంతసమందియిప్పుడా
బుడుతయవస్థఁ జూచిమది ♦ పొక్కుచునుంటిని మంత్రిపుంగవా.

మంత్రి-మహారాజా! ధైర్యభూధరులగు తమవంటివారు సర్వజ్ఞులయ్యు నిట్లుఁగుందు చుండిన నేనేమి మనవిఁజేయఁజాలుదును.

శా. దేవా! యెంతవిపత్తువచ్చినను మీ ♦ తేజంబదొక్కింతయుఁ
బోవంజాలదొకప్పుడైన నిలనా ♦ ప్రోదేఁదమీఁ యిప్పుడే
దోవిస్తారముచింతఁ జెందియకటా ♦ దుఃఖింపఁ గాఁ బాడియే?
భావింపన్వలెదీని కారణముఁ భూ ♦ పా! యెద్దియైయుండునో.

(అంతవిశారదుఁడు ప్రవేశించుచున్నాడు)

విశా—(రాజును సమీపించి) దేవా! దేవరవారి యాజ్ఞానుసారంబుగ సమస్తదేశములం గుప్తరుచు మగధదేశంబున నే నొక విశేషంబుఁ గంటి మనవిఁజేసెదఁ జిత్తగింపుఁడు.

రత్నా-ఓహో విశారదా! విశేషమును దెచ్చితివా! అదెట్టిదియోఁ దెల్పుము. నేను సావధానుండనై యుంటి.

విశా-దేవా! మగధదేశపరిసర ప్రాంతారణ్యంబునం గల యొకతటాకంబు చెంత నెవరో యార్ద్రవస్త్రపరిధానుండగు నొకబాటసారి మిక్కుటమైన బడలిక చే విశ్రమించి యుండఁగా నచ్చోటికి మగధదేశాధిపతియగు రాజశేఖరుండును నాతని సచివాగ్రగణ్యుండగు మానవర్మయువచ్చి యటఁ గొంతతడవు మంతనంబుఁ జేసి మానవర్మతో నెద్దియో రహస్యముగఁ జెప్పి రాజశేఖరుండు పాంచాలదేశంబున కరిగె.

రత్నా-విశారదా ఆమానవుండెవరై యుండునో నీవు కనిపెట్టఁగలిగితివా?

విశా-దేవా! లేదు, కాని యాతండొక రాజకన్యాసందేశంబున నే దేశసంచారముఁ జేయుచుండెనని తోఁచెడు.

రత్నా-ఎందువలన ?

విశా- దేవా! పిమ్మట నాబాటసారి మేల్కాంచి జేబులోనియుత్తరంబును యుంగరంబును గానక వగచుచు:—

చ. సారెదిలతాంగి నేఁడిరిగి ♦ చూచుటయెట్లొకొ! చూచినన్
కనులిర్వురియఁగఁ జేసి కార్యము ఫ ♦ లించెనె? తెల్పుమటన్న నేమియు
త్తరమియ నేర్తు? నుత్తరముఁ ♦ దప్పక నీయక యున్న మేనుదు
ర్భరమని వీడుఁగాని మరు ♦ బారి సహించు నెయింక నక్కటా!

ఆని విలపింపఁదొడంగెను.

సుధా- ఆఁ! విశారదా! ఆయుత్తరము నాజీవితేశ్వరియే నాకేర వ్రాసినది. ఆయుంగరము నామనోహారి ధరియించిన నాముద్దుటుంగరమే. నన్నారయుటకై యానవాలుగ నామానవోత్తముండు దానిం గొనివచ్చుచుండె. అన్నా ఎంతపని జరిగెను నామనోహారి పాంచాలదేశమున నేయుండెను కాఁబోలు. ఆపురుషుపతంసు నిమోసపుచ్చి వానిని దురాత్ముండగు రాజశేఖరుండే హరించియుండనోపు. ఓరీ గిరాజాధమా! (అనిదుర్వారంబగు తీక్ష్ణబుగాఘోరుణనేత్రుండై భూమిఁదన్నుచు) ఆనరాధముని నేనిప్పుడే పోయి శిక్షించి వచ్చెద. (అని సుధాకరుఁడు పరుఁగిడఁబోవుచున్నాఁడు.)

రత్నా-(పుత్రుని యుద్రేకమును వారింపఁజేసి) పుత్రా. త్వరపడకుము. వ్యర్థసంభ్రమంబు వలని లాభమేమి? విశారదా. పిమ్మట నామానవోత్తముండెటకేగెనో దెల్పుము.

విశా-దేవా! మానవర్మ యుంగరము నొకపక్షి ముక్కునఁగఱచిపట్టుకొని పోవుచుండె నని చెప్పి యాపురుషునిఁ దనవెంటఁ గొనిపోయె.

సుధా- ఆఁ! రాజశేఖరుని దౌష్ట్యమంతయుఁ దెలిసినది. ఓరీ ద్రోహీ, నీతో దుర్మార్గకృత్యభాగధేయుండును మంత్రికులపాంసుండునగు మానవర్మతో సమిదారుణ కర్మంబును బోధించిపోయితివిరా తులువా. తండ్రీ! నన్నుపోనిండు.

రత్నా-కుమారా. నీవిపు డెటకేగెదవు?

సుధా-పాంచాలదేశంబున కేగెదను.

రత్నా- అర్భకా. శత్రుజనస్థానంబున కేగఁజనునే? దుర్మదాంధుండును, షాండ్రపాలకులకళంకుండునగు దత్తరాజాధముండు తన దేశంబున నిన్నుఁగనినచో మారకుండునే ఇది యుండఁగాక.

ఉ. ఎంతబాలాధ్యుఁడైనను మ ♦ హాపరపుత్రుఁడు సాహసంబునన్
జింతయొనర్పలేక ఫణి ♦ చెంతకుఁ జేరిన యట్లు విద్వేష

భ్రాంతముఁ జేరుచెంతయున ♦ పాయముకల్గఁ జేయుఁగానని
శ్చింతను నీవునిల్వుమిటఁ ♦ జేసెదనీహృదయేప్సితంబులున్ -

విశారదా! మన సుధాకరుని నీవెంటఁగొనిపోయి యుద్యానవనవిహారమునుఁ జేయించి తీసికొనిరమ్ము.

విశా- చిత్తము. (అని సుధాకరునితో విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

రత్నా- శ్రుతకీర్తి! నీవుపోయి యామానవోత్తము నరయుటకై మగధదేశంబునకును పాంచాలదేశంబునకును మన చారులనంపుము.

శ్రుత. చిత్తము. చిత్తము. (అని శ్రుతకీర్తి నిష్క్రమించుచున్నాఁడు.)

రత్నా- సుధాకరుఁడు వనవిహారంబుచే చిత్తవిశ్రాంతినొంది సముల్లాసితుండయ్యెడు.

(అని రత్నాకరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

విశా- (ఉద్యానవనములో విహరింపుచు) సఖా! సుధాకరా! ఈయారామమెంత మనోహరముగా నున్నదో చూడుము. ఎటుఁజూచినను సకలపరిమళమిళిత మంజులకుసుమపుంజరంజితంబై యొప్పుచుండెడు బహువిధంబులగు పుష్పవాటీరంబులును, అత్యున్నత తాలహింతాల రసాల సాలంబులును, మధురఫలరసాస్వాదనాయత్త నానావిధపికనికరకలకల స్వనంబులును, కుసుమగర్భాంతర నిష్యంద మకరందపానమత్తమధుకర ఝుంకారరవంబులును, విశాలీకృత కలాపంబులతో నున్నత సైకతస్థలంబుల విహరించెడు కేకినీకాంతల మనోహరకూజితంబులును, సురుచిర కహ్లార కాసార కేళికాలోల మృణాళనాళకబళ గ్రాసాసక్త కమనీయ కలహంస నికురుంబంబులును, గలిగి యీవనంబు నందనవనంబుననుకరింపుచు విలసిల్లుచున్నయది. ఇంకనీకిచ్చవచ్చినట్లు విహరింపుము.

సుధా- మిత్రమా! నాచిలుకలకొలికి యీచెట్లమాటున నెందైనఁ డాగియుండెనేమో చూచెద (అని యంతటనుఁ బరికించి చూచి) అన్నా! నామనోరమ యెచ్చోటనుఁ గానరాదయ్యె. ఏమిచెప్పుమా?

సీ. కీరవాణియటంచుఁ ♦ గీరపంక్తులు కిన్కఁ
దరళాక్షినెటనైన ♦ దాఁచెనేమొ!
అంచయానయటంచు ♦ హంసలు తింత్రించి
యెనసి మానినిఁగొని ♦ యేగెనేమొ!

అళినీలకుంతలి ♦ యాటరోషమునఁ దు
మ్మెదలు కాంతనుఁ గాని ♦ చెదరెనేమొ!
ఘనకచయగుటచేఁ ♦ గాంచి మయూరముల్
గొబ్బునఁ గనకాంగిఁ ♦ గొనియెనేమొ!

తే. గీ. కాకవాల్గంటి కలకంఠ ♦ కంఠియగుట
మత్సరంబునఁ గోయిల ♦ ల్మూఁగుపఱచె
నేమొ! నేనెంత వెదకిన ♦ నిందువదన
కానరాదయ్యె నాదు దు ♦ ర్గతియ దేమొ!

కానిమ్ము వీరందరినిఁ దెలిసికొనియెద.

సీ. ఏలాలవంగర ♦ సాలసాలములను
కలరవంబులనొప్పు ♦ చిలుకలార!
అంబుజాకరవీచి ♦ కాళిడోలాకేళి
డంబుమీఱెడు మరా ♦ ళంబులార!
అరవిరిపూదేనె ♦ లానిఝుంఝుమ్మని
చెలరేగు ప్రమదాళి ♦ కులములార!
ఘనఘనాఘనములఁ ♦ గాంచి క్రీడించుర
వంబులచే మయూ ♦ రంబులార!

తే. గీ. ఏలమీరింత నామీఁద ♦ జాలిలేక
నెంచినా ప్రాణపదమైన ♦ మించుబోఁడి
నెచటడాచిరో చెప్పరదేమి? నన్ను
బాధపెట్టిన మీకేమి ♦ భాగ్యమకట.

అన్నా! ఇవన్నియు నాయెడలఁ గఠినత్వమూని మిన్నకుండె.

ఆహా! ఈగండు తుమ్మెదలు, రాజహంసలు నెంత చెలరేగియాడుచున్నవి! ఈ మలయానిలుఁడు మన్మథుఁడు నెంతనిర్భయముగ విజృంభించుచున్నారు. వీర లెవ్వరికి నాసామర్థ్యము తెలియదుకాఁబోలు.

సీ. నాజీవితేశ్వరి ♦ నాసికఁ జూపెద
నడరి రేగిన యోమ ♦ దాళులార!
నానాతిధమ్మిల్ల ♦ మేనుచూపెదమీకు
హద్దుమీరినరాజ ♦ హంసలార!
నారమాతిలకనూ ♦ గారుఁజూపెదనీకు
మలసిజంకెలువైవ ♦ మలయపవన!
నాసఖిశ్రీకంఠ ♦ భాసంబుఁజూపెదఁ
గిన్కసేసినమీన ♦ కేతనుండ!.

తే. గీ. తమ్ములనుఁజేరి కాసార ♦ తతులఁజిక్క
మూలనేడాగి చచ్చియుఁ ♦ బుట్టి మీరు
మిన్నకుండుటలగ్గు మీ ♦ మీపటుత్వ
ములనుఁజూపినహానివా ♦ టిలెడునుండి.

ఔరా! ఎన్నివిధములచేతఁ జూచిననిదినన్ను వేధించుటమానవయ్యె. నేనీవిరహవేదనల నెట్లుసహింతునోకదా.

సీ. నోపాకరుఁడునన్ను ♦ ద్రోహబుద్ధిని పంపు
వెన్నెలల్పచరించి ♦ వేపుచుండఁ
దుంటవిల్కాఁడు ము ♦ క్కంటిమంటలఁగ్రాగి
యనుశోకములనెదఁ ♦ జొనుపుచుండఁ
గలయంగకలకంఠ ♦ కలకలస్వనములు
ములుకులవలెకర్ణ ♦ ములనునొంప
గండుతుమ్మెదలెంతో ♦ కండకావరమున
ఝుంకారరవముల ♦ నలుపుచుండ

తే. గీ. మెండుగనురేగి మలయాని ♦ లుండుచలము
చేతనాప్రాణవాయువు ♦ ల్చెదరఁగొట్టఁ
బొలతిఁగానక నేనిట్లు ♦ పొరలుచుంటి
మొండితనమున విరహాగ్ని ♦ కుండమందు.

విశా. మిత్రమా! బుద్ధిమంతుడవయ్యు మాయామోహితుండవై యేల పరితపించెదవు? వినుము

తే. గీ. గాఢవిరహజ్వరంబుచేఁ ♦ గలతఁజెంది
వంతనొందుచు నీవిప్డు ♦ భ్రాంతిజనిత
వనితపైరాగసరసిలో ♦ మునిగియున్నఁ
దజ్జ్వరము హెచ్చదే? యప ♦ థ్యంబుచేత.

ఇదియునుఁగాక, నీవాదినిపూనియున్న వైరాగ్యసంపదంతయు నిపుడనురాగసం
పదగామారెనాయేమి ?

ఉ. నీదగుయోగమార్గరతి ♦ నీదగుతత్త్వవివేకయుక్తియున్
నీదగుసాధువాదమును ♦ నీదగుశాస్త్రవివేచనంబు శా
తోదరిఁజూచినంతనె వి ♦ యోగముఁజెందెనె? నీవు రేబవల్
వేదురి కుందుచుండుట వి ♦ వేకమె మోహముచే సుధాకరా.

సుధా. మిత్రమా! విశారదా! ఏమనిచెప్పుదును? ఆమాయలాడి మోహనాస్త్రప్రభావమెట్టిదో యోగానినాచిత్తమిపుడెంతయుఁ జిత్తజాధీనంబైయున్నయది.

విశా. సఖా! అట్లుగాక వేఱొండేలజరుగు? వినుము.

తే. గీ. కలికిమోముదుష్టలెయమృతంపు ♦ కళలటంచు
పణతివిభ్రమమే బింబ ♦ ఫలకమనుచు
నిండుచందురుఁజేర్చుటే ♦ నెలతఁజేర్చు
టాయెఁగాబోలు వైరాగ్య ♦ మాయచేత.

అదిని నేనొత్తి చెప్పలేదా?

క. ఆవైరాగ్యములన్నియు
జీవసజదళాక్షితోర ♦ సిలునందాకే
భావింపనిలుచుఁ బిమ్మట
భావజశాస్త్రార్థచర్చఁ ♦ బాల్పడుననుచున్.

సుధా. మిత్రమా! నన్నిపుడేలయుటంకించెదవు? వినుము.

మ. వరమాణిక్యసమానమై వెలయునా ♦ భావంబు శాతేక్షణో
త్కరముల్ జిమ్మకురంగలోచన విశు ♦ ద్ధక్షీరముం జేసి రా
గరసం బించుకఁ దోడుగానిడి చనన్ ♦ గామవ్రజుం డుద్ధతిన్
శరమంథానమునన మ్మథించి కలచున్ ♦ సైరించు టెట్లక్కటా.

విశా. మిత్రమా! నీవొక మిథ్యాకాంతను జూచినట్లు భ్రమించియే యిట్టి దురంతమోహపంతాపంబు నొందుచుంటివి. ఇంక నిజమైన మోహనాంగియే దృగ్గోచరంబైనచో నీ వెంత మోహపరవశుండ వయ్యెదవో కదా.

సుధా. సఖా! విశారదా! నేనిపుడు పాంచాలదేశమున కేగ నభిలషించుచున్నాఁడను - చిన్నప్పటినుండియు నాకు ప్రియమిత్రుండవగు నీవైన నాకు సహాయముఁ జేయరాదా.

విశా - మిత్రమా! శత్రుజనస్థానంబైన పాంచాలదేశంబున కెట్లరిగెదవు? తొందరపడకుము

సుధా - సఖా!

క్రౌంచపదవృత్తము

భామిని, మిత్రా! నీమముతోడన్ ♦ బరిణయమగుటకుఁ ♦ బరిమితిమీరన్
గామశరంబుల్ వేమదినొంచున్ ♦ గనికరమునవల ♦ కలికిని గాంచం
గామహిమాఢ్యాధామము నిష్టే ♦ కదలఁగవలయును ♦ కడువడి లెమ్మా
మామకచిత్తం బేమరకుండన్ ♦ మదవతిగవయఁగ ♦ మరిమరిఁగోరున్.

కావున నీవిషయములో నాకు తప్పక సహకారివి కావలయును. (అని విశారదుని బ్రతిమాలుకొనుచున్నాఁడు.)

విశా. అన్నా నేనిప్పుడేమి చేయవలయును! మిత్రమా! మంచిది శీఘ్రంబ పోయి వత్తుము రమ్ము.

(అని సుధాకరవిశారదులు పాంచాలదేశమునుగూర్చి నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష వీక్షణాసారసమాసాదిత రసబంధుర
కవిత్వవైఖరీ ప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్రహోతృకుల
కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న సుపుత్ర వెంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రోహిణీ
సుధాకరవిజయంబను నాటంబున
చతుర్థాంకము.



శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## పంచమాంకము.



(రాజశేఖరమహారాజు గారు ప్రవేశించుచున్నారు.)

రాజ- (స్వగతము.) ఏమి! పాంచాలదేశాధిపతియగు దక్షమహీపాలుండు నాయెడల నెంత మోసముఁ దలంచుచున్నాఁడు. ఆఁ! వీని నిజస్వభావమంతయు నిప్పుడు వెల్లడియైనది. తియ్యని మాటలను జెప్పి పైకి నన్నల్లునిగఁ జేకొన నిచ్ఛఁగలిగి యున్నట్లభినయించుచు రహస్యంబున నిజపుత్రిక యొక్క దుష్ప్రయత్నంబుల కనుకూలింపుచున్నాఁడు. లేనిచో మొదటి స్వయంవరప్రయత్నము నామూలమున నిలుపుఁజేసియు నిప్పుడీ కన్యాసందేశంబునకేల నిచ్ఛగింపును? కానిమ్ము వీని కపటోపాయంబునకుం దగిన ప్రత్యుపాయంబునుఁ బన్ని వానిని వంచింప బ్రయత్నించెదను. రాయబారిగాఁ బోవుచుండిన పురుషుని చెరసాలను బంధింప నియోగించి వచ్చితినికదా. సూనవర్మ యీసరికే కృతకృత్యుఁడై యుండవచ్చును. కావున వానిజాడ దక్షనరేంద్రునకుఁగాని కాంక్షతో వేచియుండెదను. రోహిణీ కన్యకకుఁగాని సుధాకరునకుఁగాని యెన్నండును తెలియనేరదు. దక్షరాజునకీయుంగరమునుఁ గనఁబఱచి యియ్యది సుధాకరునిదోటఁ దెలిపితినేని శత్రువు ధరించెడు పసిండియుంగరమును నిజకుమారీమణి గ్రహించి నందుకెంతయుఁగినిసి యేతత్ప్రయత్నములన్నియు భంగపఱచుట నిశ్చయము. (అనియిటునటుఁజూచి) ఆఁ! పాంచాలరాజు పట్టణములోఁ బ్రవేశించితినికదా. ఇంక నన్నెయుఁ జక్కంబడెదు. (తెరలో)

సుధా. ఛీ! ఛీ! దురాత్మ! నిలు, నిలు, క్షత్రియకులపాంసనా! రాజద్రోహీ!

రాజ. (తెరవంకఁ జూచి) ఓరీ! తులువా! ఎవఁడవురా, నీవు? నాయెదుటకు రమ్ము నీ క్రొవ్వడంగించెద. (అంతసుధాకరుఁడు ప్రవేశించి.)

సుధా- పంచచామరము.

అరే! దురాత్మ! నిల్వుమచ్చ ♦ టాజినిన్నుఁద్రుంచినా
వరాలముద్దుటుంగరంబు ♦ వారిజాక్షి లేఖయున్
బిరానఁగొందురారనీదు ♦ బింకమేమొహూ చెదర్
సరాసరిన్ బెనంగిపోరు ♦ నప్పగోరిపాలిశా.

రాజ. (మహాకోపముతో) ఓరీ ! మూర్ఖా ! ఏమనిర్వాకేలుచుంటివి ? రమ్ము నిన్నుఁ ద్రుంచి నేను నిష్కంటక ప్రయత్నుండఁడయ్యెద. (అవివరలోనికత్తిని పైకిఁదీసి ఝుళిపించుచున్నాఁడు.)

సుధా- ఓరీ ! నీచాధమ ! ఇది స్త్రీలు విహరించెడుద్యానవనము. చూడుము. కొందఱు వారిజాక్షులిటులనే వచ్చుచున్నవారు. మనమిట మారణకర్మంబునకు మొనసిన వబలలు జెగ్గిడిలెదరు, కావున నీవు శౌర్యముకలదేని వేఱొక బహిఃప్రదేశంబునకుంబోయి యాహవ మొనరింతమురమ్ము.

రాజ- మంచిది. అటులనే కానిమ్ము. (అని యిద్దరు నిష్క్రమించుచున్నారు.)

[అంత రోహిణియు వకుళమాధవి మణిమంజరులును ప్రవేశించుచున్నారు.]

రోహి-సఖులారా! నాటివైద్యుని జాడవిూకేమైనం దెలియలేదుకదా? అయ్యో !

ఉ. మాసమునిండె వైద్యుఁడును ♦ మామకజీవధనంబుఁ దెచ్చినా
వేసటఁదీర్పఁడాయె తను ♦ వెంటనె యేగుట మానెనో వృథా
యాసముగాఁగ నేగియును ♦ నానరపాలునిఁ గాంచకుండెనో
మోసముఁ జేసెనో యెటుల ♦ మోహమునిల్పుదు నేను దైవమా

మణి- తల్లీ. ఆవైద్యుఁడు నీదేహమును స్వస్థతపఱచుటకొఱకు వనమూలికను గొనివచ్చుట కేగెనే కాని నిన్ను మోసముచేయుతలంపుతోఁగాదు.

ఉ. కాంతరొ లేనిపోనిది య ♦ కారణముంగలలోనఁ గన్నభూ
కాంతతనూజుఁగూర్చి మదిఁ ♦ గాసిలెదేలనె ముద్దుగుమ్మరా
సింతయు నమ్మఁగాఁదగునె? యెక్కడిరా కొమరుండు? వాఁడునీ
చెంతకుఁ జేరుటెక్కడ ? వి ♦ చిత్రముకాదఁటె ? మానినీమణీ

రోహి-(నిట్టూర్పు విడుచుచున్నది.)

వకు—సఖీ. ఊరడిల్లుము.

క. లలనా పూవిల్తుఁడుకో
లల నాటఁగ నేయ మదిఁగ ♦ లంగెదునీలీ
లల నారయఁ జిత్రము బే
ల లనారతమిట్లువెతమ ♦ లంగుదురు చెలీ.

రోహి-అయ్యో. ఏమిటీమూర్ఖత్వము !

మ. అలుకన్నిర్దయులై మదీయసఖులున్ • హానాథ! నిన్ గూర్చి నే
విలపింపన్మతిపోయెనంచనెదరీ • విభ్రాంతికేమందు నా
కలలోఁగన్నులఁగట్టినట్లగపడున్ • గంజాతు నీరూపమే
వలనన్ సైపఁగనేర్తు నీవిరహమున్ • బాలింపఁగా రాగదే

హా! భగవానుఁడా! కామదేవా! దీనురాలనగు నామొరాలకించి నాప్రాణనాథుని శీఘ్రంబుగ నిటకు రప్పించి వీరలదుర్భ్రాంతులంబోనాడి నాజీవంబుల నిలుపుము. నీకు నమస్కరించెద.

సీ. గిరిసుతా నామనో • హరునివేఁజూపుమీ
పసపుకుంకుమనీకు • బత్తినిడుదు
పద్మాలయా నాదు • ప్రాణేశుఁజూపుమీ
విరిపువ్వుచయము న • ర్పింతునీకు
భారతీ నాచిత్త • చోరునిఁజూపుమీ
తులసీదళంబులఁ • గొలుతునిన్ను
నగభేదిరాణి నా • నాథునిఁజూపుమీ
ఫలిముత్తెముల నిన్న • లంకరింతు.

తే. గీ. వేల్పుటిల్లాండ్రలార! నా • వెతలమాన్ప
నెంచినాజీవితేశ్వరు • నిటకుఁదెచ్చి
నాకుఁగనులారఁజూపిసం • ధానగరిమ
తాపమార్పుఁడీ నసుఁగన్న • తల్లులార!

మాధ- సఖీ యదృశ్యరూపుండగు నాథుండెచ్చోటలభించునే. మాత్రయోగిన ప్రాధుర్భావ మహిమంబుచే నాయనంగునే నిజమోహనాంగునిగా భావించితివా యేమి? అయినను, సఖీ, నీమనోహరునిరూపరేఖా విలాసంబులెట్టివిదో తెలుపనొక చిత్రపటంబు వ్రాయుము.

మోహి- ప్రియసఖీ. ఏమిలాభము?

మాధ- లాభములేకేమి? ఆపటమును దిగ్దేశంబుల కనిపించి నట్టిపురుషుఁడెంతైన నుండె నేని కనిపెట్టుట సుకరంబుగదా.

రోహి- అయ్యో! నెచ్చెలీ! విరహవేదనాసంతప్త్యమాన మానసురాలనగు నేనామోహ నాంగుని పటము నెట్లు లిఖింపఁగలిగెదను ?

మణి- సఖులారా! వనవిహారంబుచేఁగాని మననెచ్చెలి సముల్లసితచిత్తురాలు కానే రదు. కావున మాధవీ, నెఱజాణవగు నీవేయిందుకుం దగినదానవు. ఎట్లైన నీ మచ్చకంటి నెమ్మనంబును నీయిచ్చకంబులచేఁ గఱఁగించి యుద్యానవనంబున కుఁ దోడ్కొనిపొమ్ము. (అని వకుళమణిమంజరులు నిష్క్రమించుచున్నారు.)

మాధ- మంచిది. (అని రోహిణిని సమీపించి) చెలీ!

చ. చిలుకలకెల్లఁబద్యములఁ ♦ జెప్పక హంసకదంబయానముల్
వెలయఁగదిద్దఁగామఱది ♦ వింతలవంతలనొందు మంజి వే
నలిఁగనియాడుకేకికల ♦ నాదములన్ గణియింపకీవు తీ
పులనిడుమోముతమ్ముఁగని ♦ మూఁగెడు తేంట్లనదల్పవేలనో
చిలుకలకొల్కి నీవిధము ♦ చిత్రముతోఁ జెడు చాలుచాలు నెం
గలిపయి తెచ్చిపెట్టుకొని ♦ కట్టలఁదూలుటమాని నీదు నె
చ్చెలులను నిన్నుఁజూచిమదిఁ ♦ జింతులుచుంటిమి నీకుమాపయిన్
గలయును రాగముల్ దెలుపఁ ♦ గాఁబరిపాఁటి జెలంగి నెయ్యపుం
బలుకులనాదరింపుచున ♦ పారముదంబును జెందఁజేయఁగాఁ
గలయఁగఁగీరశారికల ♦ కమ్మనిపాటలనాలకింపుచున్
లలితకలాపజాలము వి ♦ లాసతవిప్పిచరించు కేకినీ
కలమృదుగానముల్వినుచు ♦ కంజసుధారసమాను తేటిగుం
పులు నలిరేగుచుండ నల ♦ పువ్వులతోఁటవిహారవైఖరిన్
సలలితలీలఁ గ్రుమ్మరుచుఁ ♦ జక్కనిపువ్వులఁగోసికోసి రం
జిలునెలరాలగద్దియలఁ ♦ జెల్వమరంగవసించుచున్ సర
స్సుల జలకేళిసల్పుచును ♦ సొంపుగఁబూఁపొదరిండ్లఁదూఁరుచున్
వలపులనించు తెమ్మెరలనై ♦ భవమెంతయునావటించుచున్

గిలకిలనాదముల్చెలగఁ ♦ గెందలిరాకులమెక్కుచుండుకో
యిలల కలస్వనంబులఁబ్ర ♦ హృష్టతఁజెందుచు నుత్సుకంబుచేఁ
బలువిధహాసభావములఁ ♦ బాటలనాటలఁజొక్కి-చొక్కి- యి
చ్చలు విహరింపనీదుమది ♦ చక్కఁబడున్ వనజాక్షిరాగదే.

రోహి-సఖీ! నాకు వనవిహార మేల నే?

చ. ననుకనుఁబ్రామిపోయినయ ♦ నంగునిఁబోలెడునామనోహరున్
గనుఁగొనఁజాలకుండితిని♦ కాంతరొ వైభవమేల ? నాదుజీ
వనమిఁక నేల? బుష్పచయ ♦ వాటికలన్మెలగంగఁజాలఁ గా
వునఁగరుణింపు డీరుజని ♦ పువ్వులఁగోయుఁడు కాంక్షతీరగన్.

మాధ- చెలీ. వనవిహారంబుచే మనమున కెంతయు నుత్సాహము కలుగునని యెఱుం
గవాయేమి ?

ప్రియకాంతావృత్తము,

అనుగుసఖియీాపర ♦ హామదేలే కీనుకన్ గ్రొ
న్ననవిలు కాఁడో నలి ♦ ననిభాక్షీ శరకేళిన్
మనమునునొంపన్ ఘన ♦ మగుతాపంబునగుృంగన్
దనువెటులోర్వన్ గల ♦ తవిమున్ రా వెలతాంగీ.

రోహి-సఖీ ఏల నీవిట్లునన్ను నిర్బంధించెదవు ? వనవిహారమునాకు బాధకరమేకాని
సుఖకరము కాదు. వినుము.

త్రిభంగివృత్తము.

కలయగఁబికముల ♦ కలకలములుమదిఁ ♦ గలచెడునెచ్చెలివిన్నన్
సురహొన్నన్ ముద్దులగున్నన్
సలలితపరభృత ♦ ములుచిగురులదిని♦యలమటఁబొందెదఁగూయన్
దముడాయన్ మోదమువాయన్
లలితకసుమముల ♦ నళికృతనినదము ♦ నలివెడవిన్నఁ బ్రతిఁబాలా
వినవేలా సద్గుణమాలా

చలమున ననువిరి • ములుకులమనసిజుఁ • డలయక నెమ్మదినొంచుఁ
దమిఁ బెంచుఁ బాధలమునుంచున్.

మాధ-సఖీ. ఆవనంబున నెందైన నీమనోహరుండు దాఁగియుండెనేమో చూడవచ్చును కావఁటే. సందేహించెద వేమి ?

రోహి-మంచిది పోవుదము రమ్ము.

మాధ- సఖీ. ఆదిక్కున నెవరో యిరువురు మహాయోధులు పరస్పర జయకాంక్షల దారుణంబుగ నాహవంబొనరించుచున్నవారు. మనమాదిక్కున నేగఁజనదు. ఇటురమ్ము. ఇటు. ఇటు. (అని రోహిణీమాధవులు నిష్క్రమించుచున్నారు)

(అంత పరాజితుండగు రాజశేఖరునితో సుధాకరవిశారదులు ప్రవేశించుచున్నారు)

సుధా. దురాత్మా ; రాజశేఖరా! నీవు నీప్రాణంబుల కాసించితివేని యామానవోత్తము నేమిఁ జేసితివో తెల్పుము.

రాజ- జయోన్నతుండవగు సుధాకరా ! ఆపురుషుండు సజీవితుండయే యున్నవాఁడు

సుధా..ఎక్కడ?

రాజ- కారాగృహంబున.

సుధా-వానిని వెంటనే చెరవిముక్తునిఁ జేయవలయును. నీవందులకై నీమంత్రి పేరనొక యాజ్ఞాపత్రికను వ్రాయుము. ఆపురుషుండు చెఱవీడివచ్చువరకు నీవిచ్చోట నేయుండ వలయును.

రాజ- మంచిది (అని యాజ్ఞాపత్రికను వ్రాసి సుధాకరుని చేతికిచ్చుచున్నాఁడు.)

సుధా-విశారదా ! నీవీపత్రికనుఁ గొనిపోయి మానవశ్రేష్ఠుఁ జూపి యామానవోత్తముని చెరవిముక్తునిఁ జేసి తోడ్కొనిరమ్ము.

విశా- మంచిది. (అని పత్రికనందుకొని విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రాజ- రాజోత్తమా! నీకు నేవంద్యుఁడనైతి. నేనింతటినుండియు మహాశూరుండవగు నీతో మైత్రిఁ జేయనభిలషించుచున్నాఁడను. కావున నాయెడల దయార్ద్రహృదయుఁడవై నన్నింక విడిచిపెట్టుము. నిన్న నేనెన్నటికి మఱువక ప్రవర్తించుచుండెద.

సుధా-మంచిది. ఇంతటినుండియు బుద్ధిగలిగి సంచరింపుము పొమ్ము.

రాజ- (సుకుమారంబుగ) చిత్తము. చిత్తము. (అని తనలో) యుచితకాలము తటస్థించు వరకు (అనిరాజశేఖరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సుధా-(స్వగతము) ద్రోహియగు రాజశేఖరుఁడు నాయెడల కపటోపాయములఁ దలంపఁడుగదా? అట్లు జేయ సాహసింపఁడు. ఇదివరలో ప్రకటించిన యవివేకంబునకే పశ్చాత్తాపముఁ జెందుచున్నాఁడు. (అంత నేపథ్యంబున నొకధ్వని) ఆఁ! ఏమిచెప్పుమా. ఇపుడీదిక్కున భయంకరార్భాటంబులుకొన్ని వినఁబడుచున్నవి. రక్షోవీరుల వీరాలాపంబులు కాఁబోలు. కాంతాజనవిహారాంచితంబగు నీయుద్యానవనములోఁ బ్రవేశించి నామనోరమనుగాంచఁ బ్రయత్నించెద.

(అని సుధాకరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

(అంతభయంకరాకారములతో రాక్షసులు ప్రవేశించుచున్నారు,]

రక్తముఖుఁడు-అరే దీర్ఘకర్ణ! అరే లంబకేశా! అరే శంబరా! వింటిరా పారుబోతుమానిసియగు సుధాకరుండు మనమిత్రుండగు రాజశేఖరునిఁ బరిభవించెనఁట. ఆనరాధముండిప్పుడీ ప్రాంతంబునకే వచ్చియుండెనని తెలియవచ్చినది. అరే యమాత్యులారా! మీరిప్పుడెపోయి యారాచకుఱ్ఱనుబట్టి బంధించి రాజశేఖరునకు నప్పగించవలయును.

దీర్ఘ- అ-ల-ల-ల-ల-ల-దేవా! ఆరాజాధముండు స్వర్గమర్త్య పాతాళముల యందెందు డాగియుండినను వానిని వాడియైన నాకరవాలంబుచేఁ దుత్తునియలుగఁజేసి తద్రుధిరపానంబున నాదప్పికఁ దీర్చికొనియెద.

లంబ- అ-ల-ల-ల-ల-ల-దేవా! నేనిప్పుడేపోయి వానిగుండెలు వ్రచ్చితృప్తితీర రుధిరపానంబుచేసి తద్వసాశల్య విభూషితుండనై వచ్చెద.

శంబ- అ-ల-ల-ల-ల-దేవా! ఆపారుఁబోతునెందున్న నేనుపట్టి ఖండించివచ్చెద.

రక్త- అరేమంత్రులారా! మీరారాజపుత్రుని సంహరింపక బంధించిమాత్రము తోడుకొనిపోయి రాజశేఖరునకు నప్పగించునది.

దీర్ఘ-అ-ల-ల-ల-ల-ల. దేవా! మేమిప్పుడేపోయి దేవరవారియాజ్ఞను నెరవేర్చివచ్చెదము

(అని రాక్షసులు నిష్క్రమించుచున్నారు.)

(అంత నెచ్చెలియగు మాధవితో రోహిణిప్రవేశించుచున్నది.)

మాధ- సఖీ. ఈవనమెంత రమణీయముగానున్నదో చూడుము.

మదనదర్పణవృత్తము.

చా దురుతపులన్ బికాళిసా ♦ జగానలోలతన్
మీఱఁగొందమ తేంట్లువారిజా ♦ మృతంబుగ్రోలిఝుం
కారములనుఁ జేయుచుండఁగా ♦ కలీస్వనంబులన్
జేరిపరభృతంబులెట్లువా ♦ సిఁగూయుఁగంటివే.

(అని పరిభ్రమించుచు) ప్రియసఖీ!

హాయగతిరగడ.

కాంతరోతిల ♦ కంబువలపుల ♦ గ్రమ్మునించుక వేడ్కఁజూడుము
పంతమేలనె ♦ పాటఁబాడుము ♦ పల్లవించెదునిద్రప్రయాళము
రామనీదుయు ♦ రంబుమోపఁగ ♦ రంబురంజిలుకురువకేద్యము
భామినీమణి ♦ పల్కుమదిసుమ ♦ భారమెందెదుకర్ణికారము
చేడెనీముఖ ♦ సీధువునవిక ♦ సించెదున్ గనువకుళరమ్యము
పోడిమిన్ సుర ♦ పొన్నయిదివిరి ♦ బోడినవ్వినవలరుఁగాంచుము
అంబుజాక్షిను ♦ ఖానురాగము ♦ నందిచంపక మొప్పువేగము
కంబుగళినీ ♦ కాలదన్నిన ♦ గ్రాలునెంతయునదియశోకము
కుసుమగాత్రిని ♦ కుంజమిదికనుఁ ♦ గొంటెయలపద్మాకరంబునఁ
గిసలయాధరి ♦ క్రీడమైజల ♦ కేళిసల్పుదమేముదమ్మున
వారిజంబుల ♦ వరలుమధుకర ♦ వారములమృదుగానముల్వీను
సారసాక్షిరో ♦ సైకతస్థల ♦ సంపదల్వీలసిల్లునటఁగను
రమ్మురమ్మిక ♦ రమ్మునిపగు ♦ రత్నకంధరగహ్వరంబుల
నిమ్ముగాఁగను ♦ మెప్డునచటను ♦ దేభముల్విహరించునిచ్చల
బాలలోకను ♦ పట్టెడల్లవె ♦ భాసురంబగుమల్లియల్ గను
లీలగాఁగద ♦ లీకుజంబుచ ♦ లింప నేటికిచాలుచాలును
ఇంపుమైవిహ ♦ రింపవేలనె ♦ యేణలోచన తగవెనీకిది.

రోహి—ఇచ్చోట నానాథుండెందైనఁ డాగియుండెనేమో చూచివచ్చెద. నెచ్చెలీ. నీవుకూడరమ్ము.

మాధ- మంచిది. (అని యంతటను పరిభ్రమించుచు)

రోహి-అన్నా నేనెంత వెతకినను నామనోహరుండు దృగ్గోచరుఁడు కాఁడు. వీరెవ్వరైనఁ జూచియుండిరేమో తెలిసికొనియెద.

ఉ. అంగజుఁబోలునాథునెట ♦ నైనఁ గనుఁగొంటిరె కీరశారికా
భృంగములార! చూతకురు ♦ విందతమాలకుజంబులార! మా
తంగములార! కోకిలిక ♦ దంబములార! మయూరలేలిహా
నాంగనలార! పర్వతజ ♦ లాశయతీరములార! మీరిటన్.

మాధ- సఖీ! అల్లిబిల్లిగనల్లుకొనిన యీమల్లెపువ్వుటీరఁబులం గూడఁ దెలిసికొనుము

రోహి-మంచిది

ఉ. చల్లనిలేతవెన్నెలెదఁ ♦ జల్లెడు లేనగుమోము వాని ను
త్ఫుల్లసరోజముల్దెగడు ♦ తోరపుఁగన్గవమించువాని రం
జిల్లువిశాలవక్షుఁడగు ♦ చెన్నుసలారెడునీటుఁగాని నో
మల్లియలార! మీపొదల ♦ మాటునఁ డాచిరె నామనోహరున్.

మాధ-సఖీ! వికసితారవిందసుందరంబగు నలపద్మాకరకూలంకష సైకతంబుల శీవరించి వత్తమురమ్ము. అచ్చోటిచల్లని పిల్లగాడ్పులవలన నీవిరహతాపంబు కొంత యుపశమించెడు.

రోహి-అయ్యోనెచ్చెలీ! ఈవిటపిపటలంబులును నాయవస్థంజూచి కటకటంబడకున్నయ్యె పాపాత్ముండగు మారుండును నాపాలిటికి మాఱుండయ్యె. ఓయిదయావిహీనుండవగు విషమాస్త్రా!

ఉ. పాయకమున్ను శంకరుని ♦ ఫాలవిలోచనకీలలందు నీ
కాయము కాలలేదె విడు ♦ గర్వము పిచ్చుకపైనఁ బూనిచం
ద్రాయుధమేసినట్లబల ♦ నేనను దుష్టవిచేష్టితుండవై
మాయలచేత నొంచెదవు ♦ మానుషమేయది నీకనంగుఁడా.

మాధ- చెలీ! అలతాంతాయుధుఁడు పారఁబడెను కాఁబోలు. ఓదర్పకా!

ఉ. ఓజలజాస్త్ర! వేచకుమ ♦ హోద్ధతిమా చెలినిప్డు, పాంథయో
షాజనవేఁటకాఁడ! విల ♦ సన్మ్రయఫాలములే నెలంచుమి

ప్రాజితమాలికాహారమును ♦ రమ్యఫణీంద్రుఁడటంచుఁ బొందిమం
చే జటిభూతియంచుఁ బ్రభమి ♦ యించినశంకరమృడుఁడంచు నెంచితో.

రోహి- చెలి నామనోహరునొకసారి విగ్గరగాఁ బిలిచెద.

కల్యాణవృత్తము.

ఓరసస్ఫురా! మద ♦ యోధసంహరా!
యుదీర్ణబాహువిక్రమభా ♦ గోద్యదయాకరా,
మారసుందరా! సుకు ♦ మారశేఖరా!
మదీయచిత్తచోర! మహీ ♦ మండలీవరా,
కోరియుంటిరా! యిటు ♦ కోపమేలరా!
గుణాకరా! సుధీవర! చే ♦ కోరభాసురా,
చేరవేమిరా! మది ♦ చింతఁబాపరా
శిరీషపుష్పకోమలయీ ♦ శిక్షచాలురా.

(అంత వేఱొకచెంత సుధాకరుఁడు ప్రవేశించి)

సుధా- ఆచెట్టుచాటునఁ దళుక్కుమని మెఱయునది యేమిటియో కదా! ఓహో!

తే. గీ. వివిధపాదపజాలసం ♦ వృతమునగుచు
భానుకరదుర్గమంబైన ♦ వనములోన
ఘనఘనాంతరవిద్యుత్ప్రకాశలీల
మెఱయుతేజంబదేమొకో ♦ యెఱుఁగవలయు

నామనోహారిదౌ నెచ్చెలులతో నివ్వనంబునఁ బరిభ్రమించుచుండెను కాఁబోలు. నేనీ
చెట్టుచాటునడాగి తిలకించియుండెద.

(అనియొక చెట్టుపొంతను డాగుచున్నాఁడు.)

సుధ- నెచ్చెలీ! చూడుము.

కోకిలవృత్తము.

సారసాక్షిరో పొన్నగున్నలు ♦ చంపకంబులుచూతఖ
ర్జూరముల్కదళీకుజంబులు ♦ చూడుమెట్టులవాడెవి

స్ఫారితంబగు నీదుదోహద • వైభవంబెడయంగనా
కీరశారికహంసలెట్టుల • ఖిన్నతం దురపిల్లునో
కోరినీదుదయార్ద్రపోషణ • కూర్మినెచ్చెలికంటివే.

సుధా- ఓహో వనితాశిరోమణీ !

ఉ. నాహృదయాలవాలమున • నాటినరాగలతాంకురంబునీ
దోహదలేశముంగనమి • తొయ్యలి! దీనతవాడియుండెనా
హా! హరిణాక్షి! తావక క • టాక్షరసంబునుఁజిల్కి పెంచెదో
సాహసబుద్ధిదానివిర • సంబుగఁద్రుంచెదొ తెల్పుమి త్తఱిన్.

రోహి.ఓహో ప్రియసఖీ! ఏమి! ఆశ్చర్యము! ఈవనంబునఁ బురుషసింహుని మాటలు వినిపించినవి. వింటివే?

తే. గీ. చెలియరో వింటివేయీవి • చిత్రమేమొ
తనదుహృదయాలవాలంబు • నను వెలుంగు
మోహలతఁ బెంపుమనుపల్కు • పురుషవాక్య
సరణివినవచ్చెఁగర్ణర • సాయనముగ.

నేటికి నాభాగ్యము పండుటచే నామనోహరుండే వచ్చియుండెను కాఁబోలు.

సుధ- సఖీ ! నీవేల లేనిపోని భ్రాంతులందగిలి వగలపాలయ్యెదవు. వినుము.

భుజంగప్రయాతము. సరోజాక్షి నీస్వప్న • సంభూతుఁడో యా
వరుండెట్లు నిన్గోరి • వచ్చున్? నిజంబీ
విరాళిన్విడంద్రోచి • వేడ్కన్ మెలంగన్
స్మరోద్ధత్యమున్బాయు • సౌఖ్యాప్తికల్గున్.

సుధా- ఆఁ ! ఈచేటి నాజీవితేశ్వరికిబెట్టుసరి కలుపుచుండెను. నేనింక నిట జాలము చేయరాదు. (అని రోహిణికి ప్రత్యక్షమై)

మనోహరీ!

ఉ. నాహృదయాలవాలమున • నాటినరాగలతాంకురంబు

(అనుపద్యమునే మరలఁ జదువుచున్నాఁడు.)

రోహి- ఓ హా హా. (అని యానందపారవశ్యంబుచే నిశ్చేష్టితురాలగుచున్నది.)
సుధా- ఓజీవితేశ్వరీ !

సీ. సకియ నీముఖచంద్ర ♦ చంద్రికారుచులకై
కాంక్షఁజెందు చకోర ♦ కంబుమాడ్కి.
వెలఁది నీయధరోష్ఠ ♦ బింబామృతముఁగ్రోల
దిలకించుచుండురా ♦ చిలుక ప్రాలె
చేడ నీధన మెల్ల ♦ జీమూతముఁనుఁగన
నెమ్మిఁగోరెడు పేద ♦ నెమలిసరణి
తన్విసెకరబిస ♦ తంతువులనుఁబట్టఁ
జూచెడుతొలుకరి ♦ సూఁడుపగిది

గీ. వనజలోచననీదు చ ♦ ల్లనికటాక్ష
ములనునుదిఁగోరి నీదుస ♦ మ్ముఖమునకును
విషమశరబాణకీలల ♦ వేఁడిమికిని
తాళఁజాలకవచ్చితి ♦ హాళిఁగూర్పు.

మాధ- పురుషవతంసమా ! మీరలెవ్వరు ? ఎచ్చోటనుండి వచ్చుచుంటిరి ? ఇటువరాఁ గతంబేమి ?

గీ. తగవె మీవంటి వారికి ♦ తరుణులొంటి
పాటునను కేళిమైపువ్వు ♦ వాటికలను
గ్రుమ్మరుచు నుండఁగని వచ్చి ♦ కుతుకమడర
సరససల్లాపములఁ జేయ♦ చతురశీల.

సుధా-(రోహిణితో) జీవితేశ్వరీ ! మఱచితివాయేమి ?

చ. పటుతరసుప్తిలోమునిఁగి ♦ బందిగమందునఁ బండ రేయి చెం
గటికినివచ్చి మార్చితివి ♦ కాంచనరత్నమయాంగుళీయమున్
దిటముగఁదెచ్చియుంటిని యి ♦ దే కొనునీదుపసిండియుంగరం
బిటువలెఁబల్కఁబాడియగు ♦ నే? దయతప్పెనె నీకునాపయిన్.

(అని తన వేలినున్న యుంగరమును చేతికిచ్చుచున్నాఁడు.)

రోహి- (ఉంగరమునందుకొని జూచి సమాశ్చర్యము) హా! ప్రాణనాయకా! వచ్చితివా (అని మూర్ఛిల్లుచున్నది.)

సుధా-(ఉత్తరీయాంచలంబుచే నేదఁదేర్చుచున్నాఁడు.)

మాధ-(ససంభ్రమంబుగఁ జనుదెంచి) ఆఁ! ఏమిట! సఖీ! రోహిణీ!

రోహి-(కొంతవడికి మూర్ఛ తెలిసి చూచి దిగ్గనలేచి) ఆహా! నామనోహరా! పరమదాక్షిణ్యమూర్తివగు నీవు నేటికిఁగదా జ్ఞాపకమునకు వచ్చితి. (అని తొలఁగి పోవుచున్నది.)

సుధా-సుందరీ! వినియెదవు.

సీ. నల్లచీమలబారు ♦ నాతి నీనూగారు
ముద్దుగుల్కెడునీదు ♦ మోముతీరు
జుంటితేనియచవుల్ ♦ చుల్కసేయఁగమీరు
సకియనీవాతెఱ ♦ చవులతీరు
చిన్నివెన్నెలకందు ♦ చెల్మిసేయఁగఁగోరు
సుదతినీనిద్దంపు ♦ నుదుటితీరు
రిక్కగములఁ గేరుఁ ♦ జక్కనౌగోరులు
మెలతనీకురులుతు ♦ మ్మెదలఁదూలు

తే. నెఱఁతనీనును చెక్కిళ్లు ♦ నిగ్గుదేరు
నద్దంపుదళ్కులను గేరు ♦ ననటికంబ
ములను వెలిదూలు నీయూరు ♦ లలరునట్టి
గరితనీదైన సౌరు జ ♦ గానఁగాన.

కావున నే

సీ. కలికిరో నీకటా ♦ క్షముగల్గకిన్నాళ్లు
గొదవ తేటులఁ రొదఁ ♦ గుందుచుంటి
జలజాక్షి నీదుద ♦ ర్శనములేకిన్నాళ్లు
వెన్నెలకాఁకల ♦ వెతలఁబడితి

లలన నీముద్దుప ♦ ల్కులవినకిన్నాళ్లు
చిలుకలకెల్లనేఁ ♦ జులకనైతి
రమణి నీయవలంబ ♦ నము లేకయున్నాళ్లు
చిగురాకుసెజ్జలఁ ♦ జేరియుంటి.

గీ. వనితరో నీదుపదియారు ♦ వన్నెపసిఁడి,
చాయఁగలమేనుఁ గదియంగఁ ♦ జాలకిన్ని
నాళ్ళు మరుబారికినిజిక్కి ♦ నవయుచుంటి,
నేఁడుననుధన్యుఁ జేయవే ♦ నీరజాక్షి.

(అని కదియఁబోవుచున్నాఁడు.)

రోహి-(తప్పించుకొని చిఱునవ్వులయవీక్షణంబుల వారింపుచున్నది.)

మాధ- (తనలో) ఓహో! ఈపురుషుండే యీమెచిత్తచోరుండు కాఁబోలు.

సుధా-(సోత్కంఠముతో) ఈకాంతాలలామ తన చెలికత్తెయవద్దనుండెనని నన్ను డాయఁదలంకుచుండెను. కాని, యీలేమ-

ఉ. ఎలనొవ్వెప్పఁగవాలుకన్గవలఁ దాఁ ♦ నింపొందవారింప డా
పల కేల్జాపి మలంగిపైటసవరిం ♦ పన్వేడ్క వేత్రోక్కకే
లలరనొత్తిచ్చి సుమాస్త్రిచందమునఁ బ్ర ♦ త్యాలీఢపాదంబులన్
జలజాతేక్షణచారుదృష్టివిశిఖా ♦ సారంబుఁ బైఁజిమ్మెడున్

మాధ- (తనలో) పరస్పరావలోకనానందపారవశ్యులయియున్న యీనాయకీనాయకుల మధ్య పానకములోని పుడుకవలె నేనుఁ నిలువరాదు. వేత్రోకరయెడకేగద-

(అని మాధవి నిష్క్రమించుచున్నది.)

సుధా- సుందరీ:—

చ. వనరుహపాణితావక య ♦ పాంగవిలోకనజాలసంహతుల్
మనసిజసాయకోత్కరస ♦ మానములై దురపిల్లఁజేయునే
ననయముసర్వమునత్రుఅచి ♦ యార్తిఁగృశించితినిన్నినాళ్లహా
నినుఁగనినట్లఁ దోచెరమ ♦ ణీమణినాకఖిలప్రపంచమున్

నీవిప్పుడు తొలఁగఁజేయుట న్యాయముకాదు. ఇదియునుఁగాక.

చ. మఱుఁడను వేఁటకాఁడడరి ♦ మామకహృత్పికశాబకంబు దా
గుఱివిరితూపులందరుమ ♦ గొబ్బున నీశరణంబుఁ జొచ్చినన్
గరుణను వీడి వెంచియును ♦ కాముని బారికిఁ ద్రోయ నీకుసం
బరమఁటె దానినీహృదయ ♦ పంజరమందున డాచరాదొకో.

(అని చెయిఁబట్టుకొనఁబోవుచున్నాఁడు.)

శోహి- (తప్పించుకొని తనలో) డెందమా! త్వరపడకుము. త్వరపడకుము.

సుధా- కోమలీ !

ఉ. చూడవిదేమె నీనిడుద ♦ సోగ తెలింగనుదోయి మీల మా
ట్లాడవిదేమె తేనియల ♦ నంతనుజిప్పిలఁ జేయుపల్కులన్
వీడదవేమె యెంతనిను ♦ వేడిననన్ని పుడాదరింప నీ
వాఁడను కానఁటే సుఖము ♦ వాల్చి తొలంగెదవేమి పాపమే

చ. విరివిగ నంతటన్నెఱయు ♦ వెన్నెలవాకలఁ దోగి భ్రాంతులన్
దరగలు పిక్కటిల్లుచు ను ♦ దగ్రత రేగఁగ నూఁగులాడుచున్
దరుణిరొ రాగరజ్జువులఁ ♦ దారసమైతిని యెట్టకేలకున్
శరణముకమ్ము నన్నికను ♦ చయ్యనఁ గౌఁగిటఁ బ్రోదిసేయఁగన్.

(అని కదియఁబోవుచున్నాఁడు.)

శోహి.(మందస్మితసుందరవదనారవిందయై క్రేఁగంటిచూపులతోఁ దొలంగిపోవుచున్నది

సుధా- హృదయేశ్వరీ!

ఆ. వె. మదనుఁడదయుఁడగుచు ♦ మరిమరిశరములఁ (అని తత్తరపడుచున్నాఁడు)
గుదియవడఁగ సలుపు ♦ కుతుకమడర (అని సమీపించుచున్నాఁడు)
సదయవగుచునన్ను ♦ సరి సేలరాదఁటే [అని చెయిపట్టుకొనుచున్నాఁడు]
జాలమేల బాల ♦ తాళఁజాల [అని కౌఁగిటఁ గదియింపఁబోవుచున్నాఁడు]

(అంత భయంకరార్భాటంబులతో రాక్షసులు ప్రవేశించుచున్నారు.)

దీర్ఘ- అరే. నరాధమా, నాకరవాలంబుచే నాలింగితుండవుగాఁ నిటురమ్ము.

శంబ- అరే. దుష్టబుద్ధీ, రాజశేఖరపరాభవానలంబునకు నిన్ను శలభముగాఁ జేసెద నిటురారా. (అని కత్తిసాము చేయుచు సమీపించుచున్నాఁడు).

శోహి- హా! హా! ప్రాణేశ్వరా! రక్షింపుము రక్షింపుము. (అని మూర్ఛిల్లుచున్నది.)

సుధా- ఓరోరితుచ్ఛరాక్షసాధములారా! తొలంగియుండుఁడు. మీరలంత్యకాల ప్రాప్తిద్బలంబున నేగావలయు ద్రోహియగు రాజశేఖరుని ప్రోత్సాహంబున నన్నుఁ బట్టవచ్చితిరి. రండు మీమదముసదమదము చేసి యారాజాధముని పరాభవము పరిపూర్తిఁ గావించెద. అని ఒరలోకత్తిపైకిఁదీసిఝుళిపించుచున్నాఁడు)

లంబ- అరే. దురాత్మా. మాయెదుటఁగూడ కారులరచుచుంటివిరా. రాజశేఖరునిఁ బరిభవించినందు కిదిగో ప్రతిఫలమును గలిగించెదము చూడుము. (అని గదత్రిప్పుచు దగ్గఱదీర్ఘకర్ణుండును శంబరుండును సుధాకరుని బలాత్కారముగఁ బట్టి చేతిలోని ఖడ్గమును పెఱికి బద్ధునిఁ జేసి తోడ్కొనిపోవుచున్నారు.)

రోహి-(మూర్ఛతెలిసిలేచి భయోద్రిక్తచిత్తురాలై నలుదిక్కులువీక్షించి.)హా! ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!

ఉ. హాపిశితాశులార! యిటు ♦ లక్కటనిర్దయవృత్తిసాధునా
ప్రాపునుబాపఁ గానిరప ♦ రాధినిమోహనదివ్యమూర్తినే
పాపమెఱుంగనట్టిజన ♦ పాలతనూజునిఁబట్టనేలన
య్యో! పతివీడిదోషినిమ ♦ హోద్ధతినన్ దెగటార్పుఁడీదయన్.

ఓయాపన్నశరణ్యులగు సజ్జనులారా! నాప్రాణేశ్వరుని రక్షింపుఁడు.

సీ॥ ఘనులార! దివిజప్ర ♦ కరులార! వేగమే చేరి నానాథుర ♦ క్షింపరయ్య
తరులార! ఘనమహీ ♦ ధరులార! వేగమే చేరి నానాథుర ♦ క్షింపరయ్య
అళులార! శుకపికా ♦ వళులార! వేగమే చేరి నానాథుర ♦ క్షింపరయ్య
కరులార! హరులార! ♦ విరులార! వేగమే చేరి నానాథుర ♦ క్షింపరయ్య

తే. గీ. క్రూరులగురాక్షసులువాని ♦ ఘోరభంగిఁ
దోడికొనిపోవునయ్యయో! ♦ వేడుకొంటి
నార్తురాలను నామొర ♦ నాలకించి
చేరి నానాథువేగర ♦ క్షింపరయ్య.

హా! ప్రాణేశ్వరా! మందభాగ్యురాలనగు నన్నాసించుట వలననేకదా నీకిట్టియాపదము తటస్థించినది. ఈయాపద తొలఁగించి నన్ను రక్షింపసమర్థులెవరు కలిగెదరు. నిన్నెడబాసి నేనెట్లు ప్రాణముల నిలుపనేర్తు?

ఉ. ఎట్టితపంబుఁ జేసితినొ ♦ యెట్టివ్రతంబులుసల్పియుంటినో
పుట్టితిఁబెద్దనైతిని వి ♦ భూతినెసంగితిఁగాని నేటికే
నెట్టుఁగరానిబాధలను ♦ నింగెదనంచెదనమ్మనైతి హా.
కట్టిడిమాయదైవమిటు ♦ గాసిలఁజేసెనునన్నుఁ గ్రూరుఁడై

కట్టా యెంతపనివచ్చెను! హా! జీవితేశ్వరా; నేనెంతమందభాగ్యురాలనైతిని.

చ, విరివిగ రేబవల్ప్రియత ♦ పెంచితి నీకొఱకిన్ని నాళ్లు నా
సరసకు నెప్డు వత్తువని ♦ సముద్రమందుఁగ రా నిశాచరుల్
తిరముగఁ బట్టి రైనను ప ♦ తివ్రత నేని నిజంబు ద్రౌపదీ
వరదుఁడు నిన్ను రక్కసుల ♦ బారిఁ దొలంగఁగఁ జేసి ప్రోవఁడే

నేనిప్పుడే ధైర్యమును చిక్కఁబట్టవలయును. ఊరక సంతాపించుటవలన సార్థకము లేదు. ద్రోహియగు రాజశేఖరుని కపటతాంత్రికమువలననే యారక్కసు లిట్టిఘోరకృత్యము నొనర్చియుండిరి. ఇప్పుడు నేనెట్లైన రహస్యోచితంబుగఁ బురుషాకారమును ధరించి మగధదేశంబున కేగి యారాజాధముని బ్రార్థించి నా పురుషుని రక్షింపఁ బ్రయత్నించెద. (అనిరోహిణినిష్క్రమించుచున్నది.)

(అంతమాధవి ప్రవేశించి.)

మాధ- (ససంభ్రమంబుగఁ బరిభ్రమించుచు) సఖీ! సఖీ! రోహిణీ! అయ్యో! నీవెందుల కేగితివే ప్రియసఖీ. ఏమిచెప్పుదు! నెచ్చెలి యెచ్చోటను గానరాకున్నది. ఆపురుషుఁడు బలాత్కారముగ నామెను గొనిపోయెనేమో అట్లయిన నేనేమి చేయుదును. (అనిపరిక్రమించుచు) ఇదిగో నిక్కడ నెద్దియో తళుక్కుమని మెఱయుచున్నది. (అని దానిని యెత్తి చూచి) వహ్వా. ఇది నా నెచ్చెలిధరించెడు ముద్దుటుంగరము. దీనినే యాపురుషుఁడు ధరించియుండెను కాఁబోలు. అట్లయినచో నా నెచ్చెలిధరించిన పసిండియుంగర మాపురుషునిదైయుండ వచ్చును. కానిమ్ము. ఇదియునొక మేలే. అదిగో వకుళ మణిమంజరులుగూడనిటుల నేవచ్చుచున్నారు. ఈయుంగరముసంగతి వారికెవరికినిఁ దెలియకుండునటుల దీనిని గుప్తము చేయవలయును. (అని యుంగరమును గుప్తముచేయుచున్నది.)

(అంతవకుళమణిమంజరులు ప్రవేశించుచున్నారు,)

మణి. సఖీ! మాధవీ! మననెచ్చెలియగురోహిణిని విడనాడియొంటరిగాసంచరించుచుంటివేమి? మనప్రభువగు దక్షమహారాజుగారు నిజకుమారీసందర్శనకుతూహలులై యిపుడంతిపురంబున నామెకై వేచియున్నారు ఆకోమలాంగి యిపుడెచ్చోట సంచరించుచుండెనో తెల్పుము. మనమాకువలయాక్షినివెంటనే యంతిపురంబునకుఁదోడుకొని పోవలయును. ఏమినీవంత చింతాకులస్వాంతురాలవైయున్నట్లు గాన్పించుచున్న దానవు. మనరోహిణి క్షేమముగ విహారముఁజేయుచుండెనా.

మాధ. సఖులారా! రోహిణీకన్యకొఱకే నేనునుయిప్పుడు వెతకుచున్నదానను. మేమి ద్దఱము వనవిహారముం జేయుచుండ నామెచిత్తచోరుండగు నృపకుమారుండొ వచ్చి యామగువతో సరససల్లాపములనుం జేయుచుండ నేనచ్చోటువాసి వేఱొ కయెడకేగి కొంతవడికి తిరుగ నేనచటికివచ్చిచూడ వారిద్దఱునదృశ్యులైరి. నేని ప్పుడు తదన్వేషణార్థమే యిటులం గ్రుమ్మరుచున్నదానను.

వకు. ఆ! సఖీ! మాధవీ! ఎంతపనిజరిగెను. ఆపురుషుండు మనచెచ్చెలిని బలా త్కారముగాం గొనిపోయెనాయేమి? అయ్యో! సఖులారా! మనమిపుడేమి చేయవలయును.

మాధ. సఖీ! వకుళా! చేయవలసినది చెప్పెదనిటురమ్ము.

మణి. (వకుళమాధవులు సంభాషించుకొనుచుండఁ బరోక్షంబునందనలో) వహ్వా! కా వలసినకార్యము గంధర్వుండే తీర్చెనన్నట్లయినదికాంబోలు. నాపుత్రుని ప్రయ త్నము సమగ్రముగా నెరవేరియుండెనని తలంచెద. అతండు నింతలో నేసఫలిత మనోరథుండై తిరుగనింటికి విచ్చేసి యుండెడు. అయినను మాయావియగు రాజశేఖరుండెట్టి కపటోపాయంబులను దలంచుచుండెనో తెలియరాదు. నేను శీఘ్రంబుగనింటికిం జని కర్తవ్య మాచరింపవలయును. (ప్రకాశముగా) సఖు లారా! మీరుజగుజలైనవా! రాజుగారు రంతిపురంబున వేచియున్నారను సం గతి మఱచితిరాయేమి? ఈవైపరీత్యమును మనరాజుగారికి శ్రుతపఱుపవల యును. శీఘ్రమునఁ బోవుదముఁరండు.

వకు. } ఇదిగోవచ్చుచుంటిమి రమ్ము. (అనివకుళమాధవి మణిమంజరులు నిష్క్ర
మాధ. } మించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్ష వీక్షణాసారసమాసాదిత రసబంధుర
కవిత్వవైఖరీ ప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్రహోత్రపుల
కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న సుపుత్ర వెంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రోహిణీ
సుధాకరవిజయంబను నాటకంబున
పంచమాంకము





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## షష్ఠాంకము.

(రాజశేఖరుఁడును మానవర్మయుఁ గొందఱు యోధులతోఁ బ్రవేశించుచున్నారు)

రాజ- యోధవరులారా! మదాంధుండగు సుధాకరుని కదనంబున నిధనంబు నొందించువరకు నాకు నిద్దురపట్టదు. దీనికై సముచితోపాయంబు నూహింపుఁడు ఆనారక్షోమిత్రుల ప్రయత్న మెంతవరకు నెరవేరెనో తెలియరాదు.

(అంతనొక కంచుకి ప్రవేశించి.)

కంచు- దేవా! దేవరవారి హజారమునొద్ద నెవరో ముగ్గురు దానవవీరులు రాచఖయిదీని యొకని వెంటఁ బెట్టుకొని వచ్చియున్నారు. దేవా! ఆజ్ఞ యెట్టిదియో సెలవిండు.

రాజ- ఓహో. యోధవరులారా! మనప్రయత్నం బశ్రమంబుగా నెరవేరినది. ఇంక నేమికొఱత? మిత్రమా! సచివవర్యా! నీవుపోయి వెనుకటివారినుంచిన కారాగృహంబుననే వెనుకతట్టున నీఖయిదీనిఁగూడ నుంచుమని భటుల జాగ్రతపెట్టిరమ్ము.

మాన- దేవా. అట్లయినచో నాఖయిదీ విశారదునితోఁగలసి యేమేని మంతనములు చేయునేమో. శత్రుశేషమును దీర్పరాదా.

రాజ- మంత్రిపుంగవా! సుధాకరుని సంహరించితిమేని రత్నాకరుఁడు మనకుసాధ్యుం డగుట దుష్కరము. కావున వారుభయులు కలియకుండ కావలివారలప్రమత్తులై జాగ్రతగాఁ జూచుచుండునటులఁ గట్టడిఁజేసిరమ్ము.

మాన- చిత్తము. (అనిమానవర్మ నిష్క్రమించుచున్నాఁడు.)

రాజ- యోధవరులారా! సుధాకర విశారదులు మనకుచిక్కియుండుటవలన వృద్ధుండగు రత్నాకరుండు కోరలుపెఱికిన పాముక్రియను ఱెక్కలుపోయిన పక్షిచందంబునను మనకు వశ్యుండగుట సులభమేకదా.

యోధు-దేవా! నిరంతరజయభుజబలోదగ్రమూర్తులగు తమవంటి నరేంద్రుని వ్యర్థసర్పం బులేమి చేయఁగలవు?

రాజ-[సోత్కంఠ విస్మృతితో] మీవంటి మహాశూరులను గలిగియున్న నన్నెట్టివార లును జెనకఁజాలరనుట నిశ్చయమే. రత్నాకరుని మనముజయించితిమేని తద్విరో ధియగు దక్షమహారాజు సంతసించును. దక్షభూపాలుని సంతసింపఁ జేసినచో నాకోరిక నెరవేరుట సులభము. కావున మనమిప్పుడు లంకాపట్టణంబుపై యుద్ధమునకుఁ బయలువెడలవలయును. మీరందఱు సిద్ధముగ నుండునది.

యోధు-చిత్తము. మహారాజా. మేమందఱము సిద్ధముగా నేయున్నారము.

[అంత మానవర్మ భాస్వంతునితోఁ దనకఁ బ్రవేశించుచున్నాఁడు.]

మాన-దేవా! దేవరవారి యాజ్ఞను నెరవేర్చివచ్చితిని. [అని భాస్వంతునిఁ జూపి] దేవా. ఈతండు దేవరవారియొద్ద కొలువుఁగోరి వచ్చియున్నాఁడు. ఆజ్ఞయెట్టి దియో తెలుపుఁడు.

రాజ-(తనలో) ఓహో! నాయొద్దకొలువు నభిలషించు నీయపూర్వ తేజశ్శాలి యెవ రోకదా.. ముందువీనిసంగతి యెట్టిదియో తెలిసికొనవలయును. (ప్రకాశముగా) పురుషావతంసమా! నీనామ మెద్దియో. నీకులగోత్రము లెట్టివియో సమగ్రముగ వక్కాణింపుము.

భాస్వ-దేవా! కొండొక కార్యార్థమై నిజగోత్ర నామంబులను గుప్తపఱచి కొంతకాల మువరకు పుణ్యజనపూజ్యులగు తమవంటి నరేంద్రునియొద్ద కొలువుండ నభిలషిం చుచున్నాఁడను. తమకంగీకారము లేనిచో వేఱొకయెడకేగెద. వర్తమానంబున భాస్వంతుండను నామంబుచే ప్రవర్తిల్లుచుంటి.

రాజ-పురుషశ్రేష్ఠమా! అది నీకన్వర్థ నామధేయంబగుటకు సందియంబులేదు. సుకు మార శరీరుండవగు నీ వొకరియొద్ద నెట్లు సేవకావృత్తినుండఁ గలిగెదవు? నీవినయ సౌందర్యంబులు నాకు నీయెడలఁ బ్రేమను గలిగించుచున్నవి. కావున నీవు నీస్వేచ్ఛానుసారముగ నాయొద్ద కొలువుండి నీపూనిక నెరవేర్చుకొనుము నీవు మిగుల విశ్వసనీయునివలె గాన్పించుచున్నాఁడవు. నిన్నుకారాగృహ ముఖ్యరక్షకునిగ నియోగించెద. అదినీకు సమ్మతమేనా?

భాస్వ-దేవా! అంతఃపుర సేవదక్క వేఱొండు మీరెట్టిపనికి నియోగించినను నాకది సమ్మతమే.

రాజ. అటులైన, నరోత్తమా! నేనిప్పుడు దండయాత్రకు బయలు వెడలుచుంటి కావున నీవప్రమత్తుండవై కారాగృహము నొద్దనుండి యచటి భటులందఱికి నధ్యక్షుండవై యంవలిఖయిదీలను సురుంగ నీకుండ మేము జయప్రదులమై తిరుగవచ్చువరకు భద్రముగాఁ గాపాడుచుండవలయును. (అనియోధవీరులతో) యోధవరులారా! మీరందరు సమరసన్నద్ధులరగుఁడు. మంత్రిపుంగవా! నా రథంబు నాయితంబుఁ గావింపుము. నేనుకవచ ధారణంబుఁ జేసి:—

ఉ. దాడినెసంగినేవెడలి • దారుణశస్త్రమహాస్త్రపంక్తినా
వాడిమిఁజూపి దుష్టరిపు • వర్గమునెల్లను కేళిఁజీల్చి చెం
డాడెద సామజంబుకమ • లాకరమందుమృణాళనాళముల్
వేడుకఁబెల్లగించుగతి • భీమమహాహవమందుమిత్రమా.

మాన. చిత్తము, దేవా. ఇప్పుడే సిద్ధముఁజేసితెచ్చెద. (అనిమానవర్మ నిష్క్రమించుచున్నాఁడు.)

రాజ- భాస్వంతా! నీవు కారాగృహము నొద్దకుఁబోయి యచట బహుజాగ్రతఁ గలిగి ప్రవర్తింపుచుండుము. నీయాజ్ఞలను దిరస్కరించిన భటులను నీయిష్టాను సారము శిక్షింపుచుండుము;

భాస్వ-చిత్తము, దేవా. (అనిభాస్వంతుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత మానవర్మ తిరుగఁ బ్రవేశించుచున్నాఁడు.)

మాన. దేవా!

గీ. దనరహేమంబట్టుగాలిమే • తరిసిడంబు
జవముఁగలవాజులనుబూన్చి • సరగనిదిగో
కింకిణీమంజురవములఁ • బొంకమెడర
రథముఁదెచ్చితినీమనో • రథముఁదీర్ప.

రాజ. వహ్వా! ఈరథము బహుచక్కగ నలంకరింపఁబడినది. ఇది నాకు తప్పక జయము గలిగించును. మంత్రిపుంగవా! రథముపై శస్త్రముల నిక్షేపింపఁజేసి యుంటివా?

మాన- చిత్తము దేవా. ఆయుధములన్నియు రథముపైనే యుంచియున్నాఁడ. నాయ వసిష్ట మెంతమాత్రమును లేదు.

రాజ- మంత్రివతంసమా! నిన్నుమనచతురంగ బలంబున కంతకును సేనాధిపతిగ నియోగించితి, కావున నీవు ససైన్యుండవై ముందునడుచుచుండుము. నేను నిన్ను వెన్నదన్ని నిలిచెద.

మాన. చిత్తము, దేవా. (అనియోధవరులతో రాజశేఖరుఁడును మానవర్మయు నిష్క్రమించుచున్నారు.)

(అంత భాస్వంతుండు ప్రవేశించి.)

భాస్వ. (స్వగతము) హా! భగవంతుఁడా! ఇంతవరకు నాప్రయత్నమునుఁ గొనసాగఁజేసితివికదా. ఇంకనన్ను సంపూర్ణకృతార్థురాలినిగఁ జేయనీదేభారము. అదిగో నక్కడ కారాగృహము కాన్పించుచున్నది. అబ్బా! అదియెంత మహోగ్రంబుగనున్నది!

మ. చతురోగ్రోపల భిత్తిసంవృతమునై ♦ సాంద్రాంధకారచ్ఛటా
న్వితమై ఘోరకృపాణపాణిభటని ♦ ర్భిద్రపరిచారంబునై
సతతాందోళకృశానుభూతదురదృ ♦ ష్టప్రాణసంతాపసం
గతులంబోల్చుభయంకరంబుగఁగనన్ ♦ గారాగృహంబచ్చటన్.

నాప్రాణేశుండు సజీవితుండై యుండెనేని వానిని నేతప్పక నచ్చోటఁ గాంచఁగలిగెదను. నేనీదారుణ కారాగృహస్థాపితులగు దీనజనులనెట్లుఁ జూచి సహింపఁగలిగెదనోకదా. నేనిప్పుడు ధైర్యమును విడనాడిన నాముందు ప్రయత్నంబునకు భంగము కలుగును. అదిగో నచ్చట నెవరో ప్రలాపించుచున్నారు. ఆధ్వని వైద్యకైరియాకైతవుండగు నాసోదరునిదివలె వినఁబడుచున్నది. ముందుగనే నచ్చోటికరిగెద. (అనిసమీపించుచున్నాఁడు.

చిత్ర. రుగ్మవతీవృత్తము. హారమలోలా! ♦ యాశ్రితపాలా!
వారిధినన్ గా ♦ పాడగలేదా
ఘోరతరాత్రిన్ ♦ గుందుచునుంటిన్
జేరిననున్ర ♦ క్షింపఁగరావా.

ఓరీ! దురాత్మ! మంత్రికులపాంసనా! రాజశేఖరదుర్మార్గభాగజేయ! ఎంతపనిఁ జేసితివిరామద్రోహీ! అన్నా! నీవింత కపటోపాయమును దలంచి నన్ను

దోడ్కొని వచ్చితివని నే నాదిని గుర్తెఱుంగఁ జాలనైతినిరా తులువా! అకటా! నేనీ చెరవీడి యెన్నటికైన నా కన్నతల్లిని సోదరినిఁ గన్నులారఁ జూడఁగలిగెదనే. అయ్యో! చెరవీడిన నేమిలాభము? నిరర్థక ప్రయత్నుండనై పోయి నా సోదరిముఖము నే నెట్లు తిరుగజూడఁ గలిగెదను? కట్టా!

ఉ. పొందుగ వారిధిన్ మునిఁగి ♦ పోవక సోదరిఁ జేరివచ్చి యీ
చందము చిక్కియుంటిఁ జెర ♦ సాలను దీనిని విన్న దుఃఖముం
జెందదె తల్లి మున్నె మృతి ♦ జెందితినంచుఁ దలంచు నామొకుఁ
ముందుగ నేఁగ నంబడక ♦ పోయిన నొక్కటె యేదు పోగదా.

భాస్వ-(స్వగతము) అన్నా! ఈతండు నా సోదరుండగు చిత్రసేనుఁడే కదా. అయ్యో! చిత్రసేనా! నీవు నాకతంబున నెన్ని యిడుమలం గుడుచుచుంటివిరా తండ్రీ. మందభాగ్యురాలనగు నాకంట నీవేలఁబడితివి? పుత్రవియోగంబును సంఘటించి తల్లులను దుఃఖపెట్టు నావంటి పాతకురాండ్రెందైనం గలుగుదురె? హా! సోదరా! చిత్రసేనా! (అని దుఃఖావేశపరవశురాలై యొల్లబోయి తెప్పిరిలుచున్నది.)

చిత్ర-చ. కటకట మందభాగ్యుఁడవు ♦ కావె తలంపఁగఁ జిత్రసేన, యు
త్కటవిపదబ్ధి సోదరిని ♦ దల్లిని ముంచి విదేశమందహో
చటులతరార్తి మున్గి చెర ♦ సాలను తోపదె మేను నిల్పెదు
ర్ఘటమని, యింక నీవలనఁ ♦ గాఁగల కార్యము దేమొ చెప్పుమా.

భాస్వ-(చెఱసాలను సమీపించి) ఓహో! క్రూరులగు నీ రాజభటులందరు సురాపానంబుచే మత్తిల్లి నిద్రం జొక్కియున్నారు. ఇదియును నాకు మేలే (అని చిత్రసేనునితో) పురుషావతంసమా! నిన్నుఁ జెరవిముక్తునిఁ జేసిన నాకేమి పారితోషికం బొసంగెదవు?

చిత్ర- ఓహో! మహానుభావా! దాక్షిణ్యమూర్తీ! దీనుండనగు నే నేమియొసంగఁ గలను. నా తల్లిని సోదరినియొకసారె జూడనిండు. మీకు నమస్కరించెద.

భాస్వ- మానవోత్తమా! నీయొద్ద పోగులు గాని ఉంగరములు గాని యేమియు లేవా?

చిత్ర- అయ్యో! ఏమని చెప్పుదును.

చ. పరమదయాలవాల కల ♦ భాషిణి దక్షుని కూఁతు పంపునన్
వరునరయంగ సంద్రమున ♦ వచ్చితి నానసఁ జిక్కి వేగనే

దెసలఁ జరించియీమగధ ♦ దేశమునన్ నివసింపఁబైడియుం
గరముహరించినన్నుఁజెరఁ ♦ గట్టె దురాత్ముఁడుమానవర్మసూ.

భాస్వ- (తనలో) అన్నా! ఎంతకష్ట మెంతకష్టము! ఎంతపని జేసితివిరా ద్రోహీ! (ప్రకాశముగా) పురుషశ్రేష్ఠమా! నీవేమియు నివ్వనక్కఱలేదు. నన్ను చెర విముక్తునిఁ జేసితివి. సద్గుణైకధామ్ము. (అని తాళముఁదీయుచున్నాఁడు.)

చిత్ర. వహ్వా! ఏమినాభాగ్యము. (అని చిత్రసేనుఁడు పరుగిడి పోవుచున్నాఁడు.)

భాస్వ-అదిగో నవటమణియెవ్వరో విలపించుచున్నారు. పోయి చూచెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

విశా. అన్నా! దురాత్ముండగు మానవర్మ నన్నెంత నమ్మించి మోసముజేసెను. అతండు కపటోపాయంబుల నిరంతర దుష్క్రియాలోలుండగు రాజశేఖరునిమంత్రి యేకదా. "యథా రాజా తథా ప్రజా" అనువాక్యము వ్యర్థమగునే. ఇంతయేల, రాజాజ్ఞనుల్లంఘించి సుధాకరుని పలాయనంబునకుఁ దోడ్పడి నేనేల వానివెంట వచ్చితి? వచ్చిననా బాటసారిని చెరవిడిపింపుమని సుధాకరుండు నన్నేల శత్రుస్థానంబున కంపవలయు? పంపిననేనేలవచ్చితి? అయ్యో. ఇప్పుడునేను విలపించిన సార్థకమేమి? ఇదంతయు స్వయంకృతాపరాధమే.

చ. ధరణిపురాజ్ఞమీఱితి ♦ సుధాకరమిత్రుని బ్రీతి నొంటినై
చెఱఁబడిదుష్టమంత్రికుల ♦ శేఖరుచే వెతఁ జెందుచుంటి హా
సరగునబాటసారిఁ జెర ♦ సాలవిముక్తునిఁ జేయనింక నే
వెరపునుటిల్లునోర్కు పృథి ♦ వీవర పుత్రకుఁ డేమియయ్యెనో.

భాస్వ. (తనలో) ఈతఁడు నాప్రియుని నమ్మసఖుండు కాఁబోలు. వీనినిఁగూడఁ జెరవిముక్తునిఁ జేయవలయు. (అని సమీపించి) పురుషశ్రేష్ఠమా! నిన్ను చెఱవిముక్తునిఁ జేసిన నాకేమిబహుమానం బొసంగెదవు?

విశా- ఓహోహో! ఏమియీనిర్హేతుక జాయమానకటాక్షము!

స్రగ్విణి. ఓయి దాక్షిణ్యభా ♦ వ్యోదయా యీ దెఱఁ
గాయఁ జేయంగనా ♦ పాలిదైవంబవై
యీమెడన్ వచ్చితో ♦ యేమినీకిచ్చెదన్
ధీయుతా యీవెతన్ ♦ దీర్చి రక్షింపుమీ.

భాస్వ-మానవోత్తమా ! నీయొద్ద మురుగులుగాని పోగులుగాని ఉంగరములుగాని యేమియు లేవా ?

విశా- ఓదయాపరా ! బందిగంబునఁ గృశియించు నాయొద్ద నేమియుండును ? వినుఁడు. మును నేనును నామిత్రుండగు సుధాకరుండును కేళికోద్యానవనంబున విహరింపుచు

మ. వనసంచారము వీడి దక్షపురికిన్ ♦ బ్రచ్ఛన్నవేషంబులన్
జనుచో మిత్రుఁడు రాజశేఖరుని వే ♦ సంధించి ఘోరాజినా
తనినోడించి యనంతరంబ ననుస ♦ త్కారుణ్యకార్యంబుపై
బనుపన్ జిక్కితి నీచెఱన్ వెడలుత్రో ♦ వన్ గాన కేమిచ్చెదన్.

భాస్వ-పురుషశ్రేష్ఠమా ! నీవేమియు నివ్వనక్కఱలేదు. నిన్నుఁ జెరవిముక్తునిఁ జేసెద. సద్దుచెయ్యక పొమ్ము. (అని తాళము దీయుచున్నాఁడు.)

విశా- చిత్తము. చిత్తము. (అని విశారదుఁడు పరుగిడి పోవుచున్నాఁడు.)

భాస్వ-అదిగో నక్కడ మఱియెవ్వరో విలపించుచున్నారు. ఆయార్తధ్వనము నాప్రాణేశునిదివలె వినఁబడుచున్నది. నేనక్కడకుఁ బోయి చూచెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

సుధా. విద్యున్మాలావృత్తము॥ హా విశ్వేశా ♦ యంభోజాతా
భావాతీతా ♦ పాలింపన్ రా
జీవాక్షా కా ♦ క్షేయోద్భాసా
రావా దేవా ♦ రాతిధ్వంసా.

అన్నా ! ద్రోహీ ! రాజశేఖరా ! ద్వంద్వయుద్ధంబున నాచేఁ బరాజితుండవయ్యు సిగ్గులేక యెంతనీచవృత్తికి నొడంబడితివిరా పాలిశా ! ఈయంధకారబంధురంబగు కారాగృహంబున నాయార్తనాదంబు వినువారెవ్వరు? అకటా:-

శా. ఆవైరాగ్యము నేలవీడితిని వి ♦ ద్యాస్నేహసంవర్ధితం
బౌ విజ్ఞానవిశేషదీపమును సం ♦ హారంబుఁ గావించి మో
హావేశోన్నతి నంధకారమున న ♦ త్యంతంబు మగ్నుండనై
హా విశ్వేశ్వర! గాసిఁ జెందెదను రు ♦ య్యాలింపుమీ మొక్కెదన్.

ఉ. నేరుపునన్ మదీయజన • నీజనకుల్ ముదమొప్ప నొక్కక
న్యారమణీమణిన్ పరిణ • యంబొనరింతుమటంచుఁ దెల్పివే
సారిననొప్పనైతి నవి • చారతనాదగు కోర్కెలన్నియున్
బారమునొందకన్ జవిటి • పఱ్ఱులనాటినవిత్తులాయెఁగా.

ఉ. ఆసను దెల్పిన న్వినక • నాగ్రహమున్ గలిగించి తండ్రికిన్
గాసిలి యప్పుడా చెఱను • కాలవశంబున నీలతాంగిపై
యాసజనింప నిప్పుడిట • నక్కటచేసెద బందిగంపు సం
వాసము నెప్పుడా బ్రతుకు • బందిగమందు కృశింపనాయెఁగా.

అయ్యో. నాజీవితేశ్వరిని యుపవనంబున నొంటరిగ విడనాడివచ్చితిని. ఆకోమలి యిక యెట్లయ్యెనో తెలియరాదు. కట్టా! ఎంతపనివచ్చెను.

తోదకవృత్తము. హారమణీవన • మందున రక్షో
ధీరులచేతను • దీరనియార్తిన్
గారియనొందెదె • కష్టుఁడనన్నున్
గోరుటవంతన్ • గూలితివయ్యో.

చ. ముదముగ రాయబారిఁ జెలి • ముక్తునిఁ జేయఁగఁ బోయియా విశా
రదుఁ డెటులయ్యెనో తెలియ • రాదు సఖుండును బందిగంబునన్
బదిలము చేయగాఁబడెనో • పాపులదుష్క్రియచేత లేక దా
విదితముగాఁ గృతార్థుఁడయి • వేడుకనన్ గనఁ గోరుచుండెనో.

భాస్వ-(ప్రవేశించి తనలో) ఏహా. నాజీవితేశ్వరుండు సజీవితుండై యిచటనేయున్నవాఁడు. అయ్యో, ప్రాణేశ్వరా ! నాకతంబున నీకెన్నిపాట్లువచ్చెను. పాతకురాలనై నిష్కారణము నిన్నెంతవెతల పాలుచేయుచుంటిని.

సుధా-హా భగవాఁడా !

భూతికవృత్తము.

కోమలియేకతమావనంబున • గూలియుండఁగ నక్కటా
పాముగుండన్ రజనీచరుల్ ననుఁ • బట్టరా నవివేకినై
తామసవృత్తిని ధిక్కరించియు • దగ్గతన్ శిలఁ గూలితిన్
సామజరతుక కావవే జల • జప్రభాంచితలోచనన్

(అంత రాజభటులు కదులుచున్నారు.)

భాస్వ-(తనలో)అన్నా. ఈరాజభటులు కదులుచున్నారు. నిద్దుర మేల్కొనియెదరా యేమి! అట్లయిన మోసంబయ్యెడుంగదా. ఆఁ, భయములేదు. వీరలు తిరుగ నిర్జీవప్రతిమలవలె గాఢనిద్రాముద్రితులై పడియున్నారు. (అని సుధాకరుని సమీపించి) రాజపుత్రా! నిన్ను చెఱవిముక్తునిఁజేసిన నాకేమి బహుమానం బొసంగెదవు?

సుధా-ఓహో! కోమలీ! అయ్యో, మఱచితిని, చెఱపాలకా! క్షమింపుము. నన్ను చెఱవిముక్తునిఁజేసినచో నీవేమికోరిన నదియయొసంగెద.

భాస్వ-రాజకుమారా! నిన్ను నమ్ముటెట్లు? నీయొద్దనున్న మురుగులుగాని, పోగులుగాని యుంగరములుగాని వేనినైన నాకొసంగుము. పిమ్మట నీకోరిక నెరవేర్చెద.

సుధా-(తన వ్రేలిపైయుంగరము లేమిఁజూచి తనలో) అయ్యో! నాప్రాణసమానంబైన యుంగరమేమయ్యెనో కదా! ఆరాక్షసాధము లేహరించియుండిరి కాఁబోలు కట్టా

ఉ. హా తలిరాకుబోణి! కను ♦ లారఁగనిన్నుఁదనివారఁజూడని
సీ తగనంచు దైవము స ♦ హింపక నిన్నెడఁ జేసెనింకసం
ప్రీతిగ నంగుళీయము ధ ♦ రింపఁగ నర్హత నాకుఁగల్గునే
ఖ్యాతిగ భోగభాగ్యలకుఁ ♦ గాక మహీస్థలినట్టిసంపదల్.

భాగ్యహీనుండనగు! నే నారామామణికనకాంగుళీయకమును ధరించుట కాసింపలాభ మేమి? చెఱపాలకా! ఇప్పుడు నీకు నేనేమియు నొసంగఁజాల. వినుము.

కమలావృత్తము-

చెఱకాపరీ! దయాపరా! రా ♦ జీవదళేక్షణిదక్షసుతన్
వఱలన్వరించిబోనిశాటుల్ ♦ వచ్చినిరాయుధుఁ జేసిననున్
జెఱ రాజశేఖరాఖ్యుఁడౌదు ♦ శ్శీలునిపంపునఁగట్టిననా
గుఱుతున్ దొంగిలియా చెఱన్ నే ♦ గూలితపించుచునుంటిఁగటా.

భాస్వ-(చేతులెత్తిపెట్టుకొని కన్నీరుదుడిచికొని రాజకుమారా! నీవుసత్యము తప్పకుము. శీఘ్రకాలములోనే నాహృదయేప్సితంబును నెరవేర్చెదవని నమ్మి నినుఁ జెరవిముక్తునిఁజేయుచుంటి. నీకై పరితపించువారిని సంతోషపెట్టఁబొమ్ము (అని చెరసాలబీగము దీయుచున్నాఁడు.)

సుధా-(చెఱవీడివచ్చి) పురుషోత్తమా ! నీపేరేమి? నీచర్యలంబట్టి చూడ నాకు
యంబు పొడముచున్నది.

భాస్వ-(భయావేశచిత్తుఁడై తనలో) అన్నా ! ఈపురుషుండు నన్నుఁ దెలిసికొనియె నా
యేమి? అటులైన నాపైఁ గినియు నేమో కదా. ఏమిచేయుదును? కానిమ్ము
(అని ప్రకాశముగా) రాజకుమారా ! నీవింకనిట నిలువరాదు. భటులు లేచెదరు

కరిబృంహితవృత్తము.

కోడిపులుగులు కూయఁదొడఁగెను ♦ కోయనుచు నరోత్తమా
వాడెను డుగణ కాంతి తెలతెల ♦ వాఱె నెవరికైన నయా
జాడ తెలిసిన రాజభటులుగ ♦ జాబుసలి పదరేపునన్
గూడదిట నిలువంగఁ బురికిని ♦ గూఢముగ వెడలందగున్

(అని భాస్వంతుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సుధా-(చెఱవీడి బాహ్యప్రదేశంబునకు వచ్చి తనలో) ఆచెఱకాపరియొక కపటవేషధారి
యైన నొక సుబలారత్నఁబువలెఁ దోచెడు. ఆకంఠకలనాదంబును రూపరేఖా
విలాసంబులను జూడ నామనోహారియగు రోహిణీరమణిని స్ఫురింపఁ జేయుచు
న్నవి. ఆకోమలాంగియే నన్నుఁ జెఱవిముక్తునిఁ జేయు తలంపునఁ బురుషాకృతిని
బూని శత్రుస్థానంబునకు రా సాహసించెనాయేమి ? ఆఁ, అదిగో నాసఖుం
డగు విశారదుండిటులనే వచ్చుచున్నాఁడు.

(అంత విశారదుఁడు ప్రవేశించి)

విశా- ఓహో మిత్రమా ! చూచితివా, ద్రోహియగు మానవర్మ నన్ను చెఱబద్ధునిఁ
జేసి నాప్రయత్నమంతయును విఫలము చేసెను. కారాగృహపాలుని కటాక్షం
బున నేనెట్టకేలకు చెఱవీడి నిన్నుఁ గలసికొంటిని. కృతార్థుండనైతి.

సుధా-మిత్రమా ! నేనును నీవలెనే కారాగృహబద్ధుండనై యా పురుషునివల్లనే చెఱ
వీడఁగలిగితిని. (అని యిటునటు జూచి వెఱగు నభినయించుచు) సఖా ! విశారదా
దురాత్ముండగు రాజశేఖరుండెచటికో జైత్రయాత్రకు బయలువెడలెనని తోచు
చున్నది. చూడుము.

విశా- మిత్రమా! నేనుపోయి వాఁడే దేశముపైకి దండయాత్రకుఁ బయలు వెడలెనో తెలి
సికొనివచ్చెద. నీవిచ్చటనే యుండుము.

సుధా- మంచిది. శీఘ్రముగఁ బోయిరమ్ము.

విశా- మిత్రమా ! నేనుతిరుగవచ్చువరకు నీవిచ్చోటనే యుండవలయునుసుమీ.

(అనివిశారదుఁడు నిష్క్రమించి వెంటనేతిరుగ బ్రవేశించుచున్నాఁడు)

విశా- మిత్రమా ! సుధాకరా! తుచ్ఛుండగు రాజశేఖరుండు మన లంకాపట్టణంబుపైకే దండయాత్రకు బయలువెడలెనట. శీఘ్రముగఁ బోవుదమురమ్ము.

సుధా-ఆఁ, ఏమి యీసాహసము!

ఉ. క్రొవ్విమదాంధుఁడై యడరి ♦ క్రూరవిచేష్టత రాజశేఖరుం
డవ్విధినాడు శౌణహాతి ♦ నాజినిఁద్రెళ్ళియు సిగ్గులేకఁదా
నెవ్వగ వెంచిమా పురికి ♦ నిగ్రహవృత్తినిఁ బోవుచుండె నే
చివ్వగలంగఁ జేసెదను ♦ శీఘ్రమహోయి వధింతు వానినిన్

ఓరి దుర్మదాంధా ! మాగధదేశాధిష్టకారణా! రమ్ము. నీమదము సదమదముఁ జేసెదను

క, ఇదియేమిర రాజాధమ,
పదపదపురి నాడుచేవ ♦ వాచవిరుచులన్
ముదమునవిందిడినినుయమ,
సదనంబునకనిపెదనవి ♦ శంకటవృత్తిన్.

మిత్రమా ! రమ్ము. మాతండ్రిగారు నాకై యెంతపరితపించుచుందురో. (అని యిద్దరు సింహళద్వీపమునుగూర్చి నిష్క్రమించుచున్నారు.)

(అంత రత్నాకరమహారాజు శ్రుతకీర్తి ప్రవేశించుచునారు.)

రత్నా-సచివవర్యా ! నాపుత్రుని జాడనీకేమైనఁ దెలియవచ్చెనా ! అన్నా. కృతఘ్నుండును రాజద్రోహియునగు విశారదుండు నాయాజ్ఞ నుల్లంఘించి వాని పలాయనంబునకుఁ దోడ్పడియెఁగాఁబోలు.

(అంతకొందఱు చారులు ప్రవేశించి)

చారు- మహారాజా! మగధదేశాధిపతియగు రాజశేఖరుండు దండువెడలి మనలంకపై యుద్ధమునకు వచ్చుచున్నాఁడు, సంగతి విన్నవింప మేము ముందువచ్చితిమి.

దేవా:—

శా. జ్యానిర్ఘోషము దంతి బృంహితముల ♦ శ్వ(వాత హేషల్ చమూ
మానానూననినాదఘట్టనలుఖుం ♦ భత్కాంబు భోంకారముల్
నానానేమిరవంబు లంబరమునన్ ♦ రాణించిఘూర్ణిల్లుచున్
భూనాథాగ్రణి కర్ణయుగ్మబధిరీ ♦ భూతంబులై యొప్పెడున్.

రత్నా-ఆఁ! ఆఁ! ఏమి! వింటివా, శత్రుకీర్తి! మూర్ఖుండగు రాజశేఖరుండు మనపై యుద్ధమునకు రాసాహసించెనఁట. దక్షరాజాధముని ప్రోద్బలంబునఁ గాఁబోలు దీనికి ప్రతిక్రియ నాలోచింపవలయును.

శత్రు-మహారాజా! నిరతిశయభుజబలోదగ్ర మూర్తులును, శాత్రవకుమ్భ-కాంతార వీతిహోత్రులును, ప్రతాపప్రభాపటల పరంతపులునగు తమవంటివారికిది యొక కడిందికర్జంబా? మీరు సందేహింపనేల? మన చతురంగబలసమేతుండనై దేవర వారాజ్ఞనొసంగినచో నేనుపోయి వానిని శిక్షించివచ్చెద.

రత్నా-మంచిది. మనచతురంగబలముతో నీవు ముందునడువుము.

చారు-దేవా! శత్రుసైన్యంబీపాటికి పారావారంబుఁ దరియింపనోపు. కావున మన మిట నాలస్యముచేయరాదు.

శత్రు- ఇదిగోవచ్చుచుంటిని. (అని సబలుండై శత్రుకీర్తి నిష్క్రమించుచున్నాఁడు)

రత్నా-హా! భగవానుఁడా!

ఉ. నాకులభూషణుండుకరు ♦ ణామయమూర్తి సుధాకరుండునన్
దీనిని బాసియుండెనని ♦ నెవ్వగఁ దూలగఁ గోరుచుట్టుపై
రోఁకలిపోటనంగ నతి ♦ రుక్పరి పీడిత మానసుండనై
తేకువవీడియుంటిఁగద ♦ దేవర! యీవిపరీత మేమొకో.

(అంతదౌవారికుఁ డొకఁడు ప్రవేశించి.)

దౌవా-దేవా! మహారాజా!

ఉ. దండకమంచువు ల్వెలయఁ ♦ దాల్చి విభూతినలంది కుంకుమన్
బొందుగమెత్తి దేహమున ♦ మేలగుశాటి చెలంగనెత్తిపై
దంసిజటావళుల్గలుగ ♦ దండులు ద్రిప్పుచు పావకోల్లశం
ఖండనవచ్చి నిల్చెయతి • పూరుషుఁడొక్కఁడు భూపవాకిటన్.

రత్నా- ఫణిహారీ ! ఆమహానీయునిలోనికి రప్పింపుము.

దౌవా- చిత్తము. చిత్తము. (అని నిష్క్రమించి వెంటనే సన్న్యాసితోఁ దిరుగఁ ప్రవేశించుచున్నాఁడు.)

రత్నా- (దవ్వుల సన్న్యాసి రాకఁగని యెదురుగఁజని నమస్కరించుచున్నాఁడు)

సన్న్యా- నారాయణ, నారాయణ, (అని యొకయున్నతాసనం బధిష్ఠించుచున్నాఁడు.

రత్నా-స్వామీ. నేఁడుసుదినము. ధన్యుఁడనైతి. నాగృహము పరమపావనంబయ్యె. తమవంటి మహానుభావులు వ్యర్థముగ నొకచోటికివచ్చెదు వారుకారు. నాయదృష్టవశముచే నేటికినన్ను కృతకృత్యునిఁజేయ దేవరవారిచటికి దయచేసియుండిరి.

సన్న్యా. రాజా ! ఆహవోర్వీశల విజయోదయుండవగు నీవు నేఁడిద్దియేమనోవ్యాధిచేఁ బీడింపబడుచున్నట్లుఁ గాన్పించుచున్నావు. కారణంబేమి ?

రత్నా-స్వామీ ! తమరిపుడెచ్చోటనుండి వచ్చుచుంటిరి ?

సన్న్యా-రాజా ! కదనరంగంబునుండియే వచ్చితిని.

రత్నా-స్వామీ ! రణరంగంబునంగల విశేషము లెట్టివియో యానతిచ్చెదరా ?

సన్న్యా-మంచిది, నాకుఁ దెలిసినంతవరకుఁ జెప్పెద వినుము. రాజా ! పశ్చాత్కరతటంబున రాజశేఖరుని సైన్యంబును మీసైన్యంబును కర్ణపుటదారణ దారుణంబులగు శంఖారావములతో రథగజతురగపదాతివర్గ ఘట్టనంబుల భూనభోంతరాళంబులద్రువ పరాగపటలంబు లెగికర్పరంబునంధీభూతంబుగఁ జేయ సముద్రము లొండొంటింతాకు కరణిఁగవిసిన మహాహవంబయ్యె.

రత్నా-స్వామీ ! తర్వాత నేమిజరిగినది.

సన్న్యా- రాజా ! అట్టిమహోగ్రంబగు సేనాసంఘల సంగరాంతరంబున నిలువనిలువఁ గానక నేనిటువచ్చితి. రాజా ! నీవుతప్పక జయోన్నతుండవయ్యెదవు.

రత్నా-స్వామీ ! తమయాశీర్వచన ప్రభావము వ్యర్థమగునె ?

(అంతనొకచారుఁడు ప్రవేశించి)

చారు- దేవా ! మహారాజా ! దుర్గంబును సంరక్షింపవలయు. మనమూలబలంబును బురికొల్పుఁడు. రణరంగంబున జయలక్ష్మి వైరులనే వరించినది. శత్రుసైన్యంబు లతిశయంబుగ విజృంభించివచ్చుచున్నవి. జాగరూకులై యుండుఁడు.

రత్నా-ఆఁ! ఏమి ! రణరంగంబున మనకు పరాజయము కలిగెనా ? ఓసీ ! సేవకా నాకవచంబునిటు దెమ్ము.

సన్యా-రాజా సంభ్రమింపకుము.

(అంత వలాహకుండను మఱియొక కంచుకి ప్రవేశించి)

వలా- మహారాజా! సంగరరంగమంతయు నిహతశత్రుసేనాకళేబరంబులచే నలంకరిం పఁబడినది. దేవా! దేవరవారు పూర్ణవిజయులైరి.

రత్నా-ఆహాహా! ఏమియీవింత! ఇదంతయు మీయాశీర్వచన ప్రభావము. వలాహకా! పోరికలనన జరిగినవృత్తాంతమంతయును వక్కాణింపుము.

వలా-దేవా! నిరర్గళవిజృంభమాణోపార్జితకీర్తియగు శ్రుతకీర్తి శత్రుసైన్యంబును మార్కొని:-

క. ధారాధరంబుగతిశర
ధారలుగ్రుచ్చుచుఁ గురిసి ♦ ధైర్యముతోడన్
వీరాగ్రేసరుఁడై యని
వారణరథగజతురంగ ♦ భటులం గూల్చెన్.

రత్నా-మేలు, శ్రుతకీర్తీ! మేలు తరువాత, తరువాత.

వలా-తరువాతనో దేవా, మానవవర్మ కోపఘూర్ణమానతారకుండై నేత్రంబుల నగ్నికణం బులురుల శ్రుతకీర్తిం గవిసి నిశాత మార్గణాసారంబుల ముంచినవాని నెల్లం దెరల్చి శ్రుతకీర్తి రోషకషాయితాత్ముఁడై విధుంతుదవినిర్ముక్త విధుండునుం బోలె విరాజిల్లుచు నారాచపంచకంబుల నాతని విల్లుదునిమి షడ్విశిఖంబుల ఘోట కంబుల నొప్పించి నవాశుగంబులం గవచంబు జర్ఝరితంబుగాఁ జేసినంగినిసి మాన వర్మ నొచ్చియు నోహటింపక తీవ్రభల్లపరంపరల నసంఖ్యాతంబులుగాఁ బఱపిన వాని దెరల్పంజాలక శ్రుతకీర్తి కాందిశీకుండయ్యె.

రత్నా-ఓరిరణభీరువా. అన్నా హా! ఎంతపనిజరిగెను! తరువాతనేమిజరిగినది?

వలా-దేవా! పిమ్మట జయఘోషలు సెలఁగ శత్రుసైన్యంబులు విజృంభించి మనకోటపై కివచ్చుచుండ నెవరో యిద్దరుయోధులువారువంబులపై వచ్చి నిలునిలుమను మహో ర్భాటంబులఁ బరిపంథిసేనా సాగరంబునం జొచ్చి మందరనగంబుల పగిది నల్ల కల్లోలంబుగ వేఁటాడసాగిరి.

రత్నా- ఓహోహో! ఆశూరులెవరోకదా! తరువాత, తరువాత.

వలా- తరువాతనో దేవా, శత్రుసైన్యంబున్కుఁదక్కి వెక్కసపడి చూచుచుండ

నాయిరువురిలోను వీరాధివీరుండగునొక యోధవరుండు బహుముఖంబులనెక్కా
డ చూచినఁదానయై భానుకరనికరదుర్గమంబుగ హరిదంతంబుల వ్యాపించునటు
లనిశాతమార్గణంబులఁ బఱపి శత్రుసైన్యంబును నుగ్గొనర్పఁ బ్రారంభించెను.

రత్నా-ఓహో! ఆమహాశూరుండెవరో కదా! తరువాత, తరువాత.

వలా- తర్వాతనో దేవా, రెండవవీరుండా మహాయోధునకుఁ దోడు నీడయై నిలుచుట
యేకాక నిశితప్రదరంబు లపరంటనేసి మేటిరిపువీరులఁ జక్కాడఁజొచ్చెను.

రత్నా- తరువాత, తరువాత.

వలా- ఇట్లా శత్రుసైన్యంబంతయు నాయిరువురు వీరులచే నిహతంబైన రాజశేఖ
రుండు కాలసర్పంబు పగిది ప్రచండబూతారుణనేత్రుండై యామహాయోధుం
గవిసి క్రూర నారాచజాలంబులం బఱపి బొమిడికంబునుగూలఁ జేయ నవ్వీరాధి
వీరుండు కినిసి కాండతయంబు హృదయంబు నాటనేసిన నాతండొల్లఁబోయి
యెన్నడో చచ్చినట్లు రథంబుపైఁ ద్రెళ్లె.

రత్నా-ఏమ్. వలాహకా! ఆమహావీరుని నేను ముఖ్యముగాఁ జూడవలయును ఈవిజ
యమును మన పురినంతటను జాటింపఁబంపుము. ఆవీరుల నాదరించుటకై
నేను పోయివచ్చెద.

(అంతజయోత్సాహులగు సుధాకర విశారదులు బద్ధుండగు రాజశేఖరునితోఁ బ్ర
వేశించుచున్నారు.)

సుధా- తండ్రీ. మీయాజ్ఞనుల్లఘించి మహాపరాధనైతిని. నన్ను క్షమింపుఁడు.

(అని పాదములపై వ్రాలుచున్నాఁడు.)

రత్నా- పుత్రా! క్షమించితి లెమ్ము. (అనిపుత్రుని లేవనెత్తి యాలింగనం బొనర్చిన
న్యాసితో) స్వామీ! దేవరవారి యాగమనంబెన్ని శుభముల నొనగూర్చెనో
చూడుఁడు. పుత్రసందర్శనంబును రణవిజయంబును గంటి. కృతార్థుండనైతి.
(అనికుమారునితో) తనయా! భగవత్సదృశులగు యతిస్వాములు వచ్చియు
న్నారు. వీరికి నమస్కరింపుము.

సుధా- స్వామీ! నమస్కారము. (అనిసాష్టాంగ దండప్రణామం బాచరించు
చున్నాఁడు.)

సన్యా- నారాయణ, నారాయణ, కుమారా ! లెమ్ము. ఇది మత్సరంబునకు సమయంబు గాదు. దుర్మదాంధుండగు నీరాజశేఖరుండు ఖిన్నుండై యున్నవాఁడు, కావునఁ గృపణుండగు వీనిని విడిపింపుము.

సుధా- (తండ్రితో) జనకా ! ఈద్రోహి మున్నునాచేపరాజితుండై నాయనుగ్రహంబున సజీవితుండై యరిగియు మంతనంబున నన్నును నాసఖుండగు విశారదుని కారాగృహంబున బంధింపఁజేసినాఁడు. ఇట్టిఖలునిపుడేమి చేయవలయునో యానతిండు.

రత్నా- కుమారా ! పరమపూజ్యులగు యతిస్వాముల సెలవుప్రకారమే జరిగింపుము.

సుధా- (తనలో) స్వామీ ! మీకోరికను దీర్చుటకై వీనిని విడిచిపెట్టవలయునే గాని వీఁడట్టిగౌరవంబున కర్హుఁడు కాఁడు సుఁడీ.

సన్యా-(చిఱునగవుతో) వత్సా ! నీవంటి మహాశూరునకు వధ్యుండైన వానిం గటాక్షించుట యుక్తంబుగాదె.

సుధా- చిత్తము. (అనిరాజశేఖరుని బంధమోచనుంగావించి) రాజశేఖరా ! ఇంకనైన నీవు బుద్ధిఁగలిగి ప్రవర్తింపుము.

రాజ- మంచిది. (అనితనలో) యుచితసమయము లటస్థించునటుకు.

(అనిఖిన్నుండై నిష్క్రమించుచున్నాఁడు)

సన్యా- (స్వగతము) ఏమిచెపుమా ! నేఁగలపివచ్చిన గోపాలునలింకను రారైరి ?

రత్నా-విశారదా ! నీవొనర్చిన మహాపరాధంబును క్షమించితి. రమ్ము, ఇటఁగూర్చుండుము. శుభకీర్తీ ! భగవత్సదృశులగు నీయతిస్వాముల ప్రభావంబుచే నింకనా కష్టములన్నియు గట్టెక్కుడుఁ గాఁబోలు.

శ్రుత- దేవా ! మనుజులకు జన్మాంతర కర్మపరిపాకంబుచే నెట్టియాపదలు కలిగినను కర్మపరిపక్వంబైనచో పరాత్పరుం డెద్దియే నొక యుపాయంబును గల్పించి తన్నివారణ మొనర్చుచుండును.

సీ. సత్యవ్రతుఁడుహరి ♦ శ్చంద్రుండు మిక్కిలి
బాధలఁజెందియై ♦ భవమునొందె
సీతకై విలపించి ♦ శ్రీరామచంద్రుండు
బాధలఁజెందియై ♦ భవమునొందె

నయవిశేషుండయ్యు ♦ నలచక్రవర్తితా
బాధలఁజెందినవై ♦ భవమునొందె
పాండుయశోధనుల్ ♦ పాండవేయులపత్ని
బాధలఁజెందినవై ♦ భవమునొందె

తే. గీ. వారలేకారణంబున ♦ వరలికట్లు
దేవ మీబాధలన్నియుఁ ♦ దీర్చిపిదప
వైభవముఁజెందఁజేయంగ ♦ వచ్చెనీ య
తీంద్రుఁడిట కాదిదేవుసం ♦ దేశమునను.

సన్యా- రాజా ! కలకాల మొక్కతీరుగ నుండ నేర్చునే. ఇంతియేగాక సకలసద్గుణ సంపన్నుండవును భూతదయాళు చిత్తవృత్తుండవును ధర్మమార్గ ప్రచారుండవును న్యాయపరిపాలకుండవునగు నీవంటి మహారాజున కొకానొకచో కాల కర్మవశంబున మనఃక్లేశంబొకించుక కలిగినను నయ్యది చిరకాలము నిలువనేర్చునే. ఆపదలు కాపురముఁ జేయునే.

రత్నా-స్వామీ! తమవంటిమహానుభావుల సందర్శనముఁ గనినవారి భాగ్యమేభాగ్యము.

[అంతకొంతలో గోపాలకులు ప్రవేశించి]

గోపా- దేవా ! మహారాజా ! ఘోషంబునకు పెద్దపులులు వచ్చి పశువులను మమ్మును నిలువనియ్యకున్నవి. ఏలినవారితో మొఱఁబెట్టుకొనుటకై మేమిటు వచ్చితిమి. కుయ్యాలింపుఁడు.

రత్నా-ఆఁ ! నిరంతర సురక్షితంబగు మనఘోషంబునకు చాల మెకంబు లెట్లువచ్చినవో కదా. ఆభీరకుమారులారా ! మంచిది. మీరు వీడ్కొనుఁడు.

గోపా-చిత్తము. (అని నిష్క్రమించుచున్నారు.)

సుధా- తండ్రీ. మనవేఁట సైన్యమునుతీసికొని నేనుపోయి యామెకములనెల్ల సంహరించి వచ్చెద. ఆజ్ఞయొసంగుఁడు.

రత్నా-పుత్రా. నీవాలంబుచే శ్రాంతుండవై యున్నవాఁడవు. గావున కొంతవడివిశ్ర మింపుము. విశారదా ! నీవుపోయి వచ్చెదవా ? నిశాతబాణక్షురుండగు శ్రుతకీర్తిని వేఁటసలుపఁజాలఁడు.

సుధా. తండ్రీ. లీలావిహారార్థము వేటకుఁబోవ నాకు కాంక్షమిక్కుటముగాఁ గలిగి యున్నది. దయచేసి యాజ్ఞ యొసంగుఁడు.

రత్నా-కుమారా !

క. ఘనునీవెన్నఁడు నెఱుఁగవు
ఘనమృగసంకీర్ణమైన ♦ కాననమునఁ దెం
పునఁజేసి వేఁటలాడఁగఁ
దనయా నామాటవినుము ♦ తగదటుపోవన్.

సన్యా- రాజా ! మహాశూరుండగు నీపుత్రునిచేఁ గాని యీకార్యంబు చక్కఁబడ నేరదు. కావున సందేహింపక నాజ్ఞయొసంగుము.

రత్నా- స్వామీ !

క. పుత్రులకలిమియె తలపఁగ
ధాత్రీనమ్యులకు సతులి ♦ తంబగుసిరి స
త్పుత్రులు లేకను శశిపో
రాత్రివలెఁ దోఁచు నృపుల ♦ రాజ్యము లెన్నన్.

కావున కలఘూవణుండగు పుత్రుని నెడబాయఁజాలక నేనిట్లుదలంకుచుంటి.

సన్యా-రాజా ! పురుషుఁడెప్పుడు నేకవిషయవ్యాపారపరాయణుఁడై యుండఁజనదు. అందువలన జిత్తవైకల్యంబు సంభవించును. పిమ్మట కాలువతెగినంగాని గంగా నమ్మెన పట్టదనునట్లు చిత్తముచెడిపోవ నెట్టివికారములైనఁ గలుగకమానవు.

రత్నా చిత్తము. స్వామీ, చిత్తము.

సన్యా-రాజా. ఇంతియగాదు. సంశాంతాందోళములవలనఁ జిత్తముక్షోభించును. రాజ్యతంత్రములలోఁగాని తదితరవ్యాపారములలోఁగాని చిత్తమునత్యంతముఁ బీడించినచో నయ్యది బహువిధగ్లానులకు లోనైయుండుటవలన వ్యాధికి తావలంబగు;మఱియు చిత్తమును తదేకాగ్రతగా నెప్పుడునుఁ బ్రివర్తిల్లఁజేయఁగూడదు. భక్తివిషయంబుననే చిత్తమేకాగ్రతనుభరియించును గాని లౌకికవిషయంబుల భరింయింపనేరదని తెలిసికొనుము.

రత్నా-చిత్తము. స్వామీ. చిత్తము. మీరు చెప్పెడితన్నియు వేదవాక్యము లనుటకు సందియంబు లేదు.

సన్న్యా-రాజా ! దేహారోగ్యమునుగోరు పురుషుండెపుడును విశ్రాంతిలేని వ్యాపారము నందు ప్రవర్తిల్లఁగూడదు. అట్లని శరీరపరిశ్రమం బుజ్జగించి చిత్తము నతిలోలత్వమునందును బ్రవేశింపఁ జేయఁగూడదు. విశ్రాంతియనఁగాఁ జిత్తమున కుత్సాహముఁ గలిగించుట. కొన్నివేళలయందు శరీరసాధకములవలనఁగూడ చిత్తముత్సాహించుచుండును. కావుననే పెద్దలు మృగములవేఁటాడుటయు వనవిహారంబులును జైత్రయాత్రలును రాజులకర్తవ్య ధర్మములని వక్కాణించిరి.

రత్నా- చిత్తము, స్వామీ, చిత్తము.

సన్న్యా. రాజా ! నీకుమారునన్నింటికిని దూరునిగాఁజేసి చిరకాలమలయించితివి కదా, వానిచిత్తము చలించినదనుటకుఁ గారణము వెదుకవలయునే.

ఉ. కూరిమిఁ గన్నపుత్త్రుఁడని ♦ కోరికలన్నియుఁ దీర్చుచుంటకుఁ,
మారుగ రాచబిడ్డనుకు ♦ మారుని మారసమానసుందరా
కారుని నీకుమారకునిఁ ♦ గాసిలఁ జేయఁగఁ బందిగంబునన్
గ్రూరతనుంచగాఁదగునె ♦ కోపము పాపముకాదె భూవరా.

రత్నా-స్వామీ, సత్యము, సత్యము. అంత తటస్థించునని నేనాదినిగురైయుంగఁ జాలనైతి. దేవరవారి కటాక్షమువలన నాపుత్రుని చిత్తమిపుడెంతయుఁ జక్కంబడినది. నేనింక ధన్యుండనయ్యెద.

సన్న్యా. రాజా ! ఇప్పుడు నీకుమారరత్నంబునకు వేఁటకుఁ బోవనడ్డు చెప్పితివేని యాతండునిరుత్సాహియయ్యెడు.

రత్నా-స్వామీ ! మీరట్లు సెలవిచ్చుచుండిన. నేనేమి మనవి చేయుదును. మంచిది (అని కుమారునితో) పుత్రా !

మహాస్రగ్ధర.

బలశౌర్యోదగ్రమూర్తుల్ ♦ పలువురుభటులుఁ ♦బర్విఖడ్గాదిశస్త్రం
బులతో కానీవుఁ శౌణం ♦బునుదోడిగివడిఁ ♦ బోయియారణ్యసీమన్

గలయఁ వేఁటాడు మెంతోఁ ◆ గాంతు మెకములన్ ◆ ఖడ్గభల్లూకపాళిఁ
జల మొప్పఁ జంపి సంధ్యా ◆ సమయమునకు రాఁ ◆ జాలవే నీవు పుత్రా

తండ్రీ! వేఁటకై పుచే మైమఱచి సాయంసమయమున కింటికి రానోడిన నే సహింపఁజాలఁజుమీ.

సన్యా-రాజా! మేమింక మాయాశ్రమంబున కేఁగెదము. (అని లేచుచున్నాఁడు.)

సన్యా-నారాయణ నారాయణ (అని నిష్క్రమించుచున్నాఁడు)

రత్నా-(గద్దియనుండి లేచి) చిత్తము, స్వామీ, దేవరవారి సందర్శనంబు తఱచుగ లభించుఁగాక. (అని సాష్టాంగ దండప్రణామం బాచరించుచున్నాఁడు.)

విశా-విశారదా! మన వేఁటసైన్యమును కట్టాయితంబుఁ జేయించి బయలు వెడలియు ప్రమత్తులరై మెకముల వేఁటాడి మన ఘోషంబును నిష్కంటకంబుగఁ జేసి రండు

విశా- చిత్తము, చిత్తము.

(అని యందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకట రమణ కరుణాకటాక్ష వీక్షణాసాదసమాసాదిత రసబంధుర
కవిత్వవైఖరీ ప్రవీణాపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్రహోతృకుల
కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న సుపుత్ర వెంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రోహిణీ
సుధాకరవిజయంబను నాటకంబున
షష్ఠాంకము





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## సప్తమాంకము.

(కొందఱు వేటగాండ్రతో సుధాకరవిశారదులు ప్రవేశించుచున్నారు.)

విశా. మిత్రమా! చూడుము.

బంధురవృత్తము.

కనుఁగొను ముదమున ♦ గరినికరము చేఁ ♦ గల్పితబృంహితనాదములన్
దనివిసనక నెఱిఁ ♦ దవిలితిరుగుదో ♦ ర్దర్పసముద్భట సింహములన్
ఘనముగఁ బికకుల ♦ కలరుతములు ని ♦ క్కముగ నెల్లెడఁ జెల్లఁగని
వ్వనము భయదమయి ♦ వఱలెడు నిటు భూ ♦ పాలక సల్పుము వేట వెసన్,

ఈయరణ్య మెంతమృగసంకులంబై యొప్పుచున్నదో చూడుము.

ద్విరదగతిరగడ.

రాజవర కంటె సా ♦ రంగములు రంగముల
వాజులను ఖడ్గశర ♦ భంబులను దేభముల
పొంచి కనుఁగొంటె యెను ♦ బోతులను బోతులను
కొంచకఁ జరించు మసి ♦ కోతులను గోతులను
నాగరిక చూడుము ♦ న్నాగముల నాగముల
లోఁగనలి రేగు భ ♦ ల్లూకములు లూకముల
ఠీవిగను దాటు కం ♦ ఠీరముల యీరముల
కావరపు చారల మె ♦ కంబుల నినాదముల
ఘోరమృగసంకులవి ♦ ఘూర్ణమగునట్టి కాం
తారమిది చూడు నృప ♦ తనయ కడు వేడ్కన్.

సఖా! ఇచ్చోట నీవేఁట చతురత్వమును జూపవలయును.

సుధా- మిత్రమా! నీవు సంతోసించునటుల వేఁటాడెదఁజూడుము. (అని పూర్ణోత్సాహుఁడై భటులతో) భటులారా! మీరందరు నలుదిక్కులకేగి మీమీ యారాభటంబుల నివ్వనసత్వంబుల నెల్ల నీదిక్కునకుఁ బెదరింపుఁడు. నేనిటవానినెల్ల వేఁటాడెద.

భటు- దేవా! మేమందర మొక్కసారిగ నలుదిక్కులకేగిన మిమ్ము దరుగఁ గలిసికొనుట దుష్కరమానేమోయని సందేహించుచున్నారము.

విశా- భటులారా! మీకట్టి సందియంబువలదు. ఆకనఁబడెడు వటవృక్షముక్రింద మీకై వేచియుండెదము. సూర్యాస్తమయమైన తోడనే మీరలచ్చోటుకురండు.

భటు- చిత్తము (అని సుధాకరునితో) దేవా!

పంచచామరము. హళాహళిన్ గడంగిపోయి • యార్భటుల్ ప్రచండకా
హళధ్వనుల్ నభంబుభూము • హాద్రిగహ్వరాంతరం
బులంబ్రతిధ్వనుల్ చెలంగ • భూరిసత్వజాతులన్
భళాభళీయనంగభీతిఁ • బాఱఁదోలమే వెసన్.

(అని భటులందరు నలుదెసంగుల నిష్క్రమించుచున్నారు.)

విశా- రాజకుమారా! చూడుము.

భాస్కరవిలసితవృత్తము.

అల్లవెకనుఁగొను మీపులులున్ సిం • హంబులుశరభములునుహరిణంబుల్
ఫెల్లుగనవెచరియించెడుఁజూడా • భీకరమగుమదగజములుదుప్పుల్
క్రొల్లలుగనుజెలరేగెడుఁగానన్ • గొబ్బుననిటుఁజనిపనివడిభూపా
భల్లముకరమునఁబట్టుమువీఁకన్ • బాఱెడుమెకములఁబడఁబొడుచుంగన్.

ఇపుడే నీవిలువిద్యానిపుణత్వంబును బొలివోవనీకనియ్యెడ సంభ్రమంబుగఁ బఱతెంచు దుష్టమృగంబులనెల్ల ఖండింపవలయును.

సుధా- మిత్రమా! ఇదిగో నాభుజబలోత్సాహ విశేషములు జూపెద. చూడుము.

(అని గొనయంబు సారించి విల్లెక్కిడి)

మ. ఇదెనీవిచ్చటఁ జూచుచుండుమలమ • త్తేభేంద్రయూథంబులన్
దుదముట్టించెదవ్యాఘ్రసింహములద్రుం • తుఱ ఖడ్గశార్దూలదు

ర్త్రదభల్లూకముల స్వధింతుభయదా ♦ రణ్యంబు నేనిందుప
మ్ము న్నదమందర్ జరియింతు వేఁటతమి నే ♦ ర్చ్బ్ర జొపు వాటింపుచున్.

(అని నలుదిక్కులకు బాణంబులంబఱపి) సఖా ! చూడుము.

ఉ. అల్ల దెసింహ మొక్కనిశి ♦ తాంబకసంహతిఁగూలె. దుప్పులున్
భల్లుకముల్వడిన్ గలయఁ ♦ బారెను భీతిని; నాదుతీవ్రమా
భల్లములంటు దాక శర ♦ భంబులు వ్యాఘ్రములంత మొుందెదున్
డొల్లెడు నేదుపందులుప ♦ డున్ హరిణంబులు చూడుమెల్లెడన్.

[అంత సన్న్యాసి ప్రవేశించుచున్నాఁడు]

సన్న్యా-బళె ! రాజకుమారా ! నీవిలువిద్యా నిపుణత్వంబునకు మెచ్చితిని. క్షత్రియజాతుం డవైనందునకు నీక్షాత్రవంతమును నిండా ప్రకటించితివి వత్స!

చ. కడగివనంబునందిరుగు ♦ గంధగజంబులసింహపంక్తులన్
దడయకనీదు బాహుబల ♦ దర్పముఁజూపి శరాగ్నికీలలన్
గెడపితివీవు వేడ్కపులి ♦ కిన్ బులి పిల్లయెపుట్టుఁగాని బ
ల్విడిఁదలపంగ నెయ్యెడల ♦ లేడిజనించునె రాకొమారకా.

వత్స ! వేఁటతమకంబుచే మైమఱచి శరీరక్లేశంబులు గణింపకయు నిరర్గళభుజార్గళ విజృంభణోత్సాహంబతిశయిల్ల నుపవనవిహారంబులీల నీభయదకాంతారంబునం గ్రుమ్మరుమంటివి. నీవతిశ్రాంతుండవైతివి కాఁబోలు. ఇంచుకవడి నీపటవృక్ష మునాశ్రయించి విశ్రమించి పిమ్మట పునర్విజృంభణంబునకు మొనయుట లగ్గుకదా.

సుధా-స్వామీ ! దవ్వుల నొకజింక నాహృదయముఁదగ్గయు నాకర్షించుచున్నయది. దాని నాఘనసుస్నన కాఖురుకబళంబుగ నర్పించివచ్చెద.

సన్న్యా-మంచిది జింకవేఁటలోనేకదా వేఁటపటుత్వము పూర్ణముగాఁ బ్రకటీకృత మయ్యెడు.

విశా- మిత్రమా !

తే. గీ సంజకెంజాయలెంతయు ♦ జానుమీరె
పక్షులన్నియుఁ దమయిక్క ♦ పట్టఁజేరె
క్రూరవనసత్వములుతమ ♦ గుహలవిడిచె
తమకమడగింపకొమ్మిక ♦ తరలిపమ్మ.

ఇదియునుగాక,

చ. మఱచితె తండ్రి మోనలఁ గు • నూరకసాయము వేళకింటికిన్
మఱువకరమ్మటంచుఁ బలు • మారు ప్రియోక్తుల బుజ్జగించుచున్
గఱపిన మొత్తాదెపంపెనిను • గానన సీమను వేఁటలాడనా
తఱిఁగడవంగఁ జొచ్చెనిఁక • తాళుము పోదము రమ్ము వీటికిన్.

సుధా-సఖా ! విశారదా ! చూడుము.

చ. చెవులను నిక్కఁ బెట్టుచును • జేతికిఁ జిక్కినయట్లు తాయుచున్
వివిధగతుల్ జరించుచును • భీతిలి జూచుచు చెంగుచెంగునన్
దవుదవు దాటుచుండు హరి • ణంబున కెంతయు నాదు చేవ వా
చవిఁ దెలియంగఁ జేసెదను • శాతశరంబులఁ జూడుమిత్తఱిన్,

(అని యాహరిణంబు వెంటఁ బరుగిడుచున్నాఁడు)

విశా- సఖా ! సఖా ! సుధాకరా ! నిలువుము (అని కూడముట్టిపట్టుకొని.)

ఉ. వారక దుష్టసత్వములు • వావిరిఁ గ్రుమ్మరుచుండె కెంపుసొం
పారెను పశ్చిమంబునఁగు • జానలి పచ్చని కాంతితోడఁ బం
గారపునీరుఁ బోసిన చొ • కాటపు రీతి వెలుంగుచుండె వెం
పూరగఁ బోకుమస్తగిరి • నొందెను కంజహితుండు చూడుమీ.

సుధా-మిత్రమా ! వెంటనే మగలివచ్చెదను- అదిగో జింక తిరుగ సమీపమునకే వచ్చి యున్నది. (అని మగల పరుగిడుచున్నాఁడు.)

విశా- అన్నా ! రానికి వేఁటవమక మంకంతె కథకమగుచున్నయది. ఇంక నెట్లోగదా. నేను నా వెంబడినే పోయెద.

(అని విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సన్యా-అహో ! విశారదుఁడుగూడ లోఁబడకుండ పదభ్రష్టునిఁజేసి ముందు నిశ్చితికి దా. ఇంక నా ప్రయత్నమ్ము క్రమముగా నెఱవేరెను. అయిన నేనొక్క యుపాయమును బన్నెద. ఆఁడ ! అదిగో సుధాకరుండలసి యొక చెట్టుక్రిందఁ గూర్చుండి యున్నాఁడు. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సుధా- (స్వగతము) అన్నా ! నేనెంతగురిగా తరిమిన నాహరిణంబును మరణంబునొం దింపఁజాలనైతిని కదా. అహహా! ఏమిదానిపదలాఘవ ప్రభావము. పాంథులకుఁ

తిరుగుడుఁబడుచుండు రంధ్రాన్వితంబగు కుప్పెలోని దీపంబు కాన్పించిన యట్లు నాకు దృశ్యాదృశ్యంబుగఁ గాన్పించుచు గతాగతవిలాస విహారంబుల నడియాసఁ గల్పించి నన్నింతవరకు రప్పించి తుదకాహరిణంబు కన్మొఱంగె. నాసఖుండును పదభ్రష్టుండయ్యెను కాఁబోలు. ఒంటరినై నేనీనట్టడవిలోఁజిక్కితి ఇంకనెట్లోగదా. (అనియిటునటుఁజూచి) అన్నన్నా ఏమిచెప్పుమా. సన్యాసిక్రూరకర్మంబని తలంపక వారువంబునెట్లు విశసింపుచుండెను. ఈతని చర్యలఁబట్టి చూడనొకకపటవేషధారివలెఁ గాన్పించుచున్నాఁడు. వీని నిజస్థితి యెట్టిదియో తెలిసికొనఁగలయును. అదిగో. యీతండిటులనేవచ్చుచున్నాఁడు.

(అంత సన్యాసి ప్రవేశించి)

సన్యా-(సస్మితముఖుండై) వత్సా! హరిణంబదిక్కడనే?

సుధా-(మహాకోపముతో) అరేమూర్ఖా!

ఉత్సాహ. కపటవేషధారి క్రూర ♦ కర్మమేలఁ జేసితో
చెప్పుము తపస్వియైనవాఁడు ♦ జీవహింసఁ జేయునే
విపినమందు దిరుగువాజి ♦ విశసనంబొనర్పఁగా
నిపుడు కారణంబదేమొ ♦ యేర్పడన్వచింపుమా.

క. నీనటనలఁ జూడఁగ నను,
మానముతో చేసుమపేయు ♦ మానసమునఁ దిం
పూనివచింపుము నీనిజ,
మైనచరిత్రంబదేమొ ♦ యఖిలంబువడిన్.

చ. కలతెఱఁగంతయుం దెలుపఁ ♦ గావలె నీనిజనామమెట్టిదో
దలపఁగనీనివాసవసు ♦ ధావరమెద్దియొ దానినేలుచున్
విలసిలురాజెవండో యతి ♦ వేషముఁబాల్చితి నేక్రియార్థమో
పలుకుము నామ్రోల నిను ♦ బట్టివధించెదఁ జెప్పకుండినన్.

(అసివరలోని కత్తిని పైకిదీసి ఝళిపించుచున్నాఁడు)

సన్యా-రాజాత్మజా! శాంతింపుము. నాసంగతి సకృత్స్నముఁ దెల్పెదవినుము.

ద్విపద.

నృపకుమారవినుము ♦ నీమేలుకోరి
నెపములఁగల్పించి ♦ నిన్నుపాంచాల
దేశంబునకుఁదోడి ♦ తెచ్చెదననుచు
నాశలఁజెందియా ♦ హారనిద్రలను
బాసినిఁగోరెడు ♦ పద్మాయతాక్షి
భాసురదక్షభూ ♦ పాలవరేణ్యు
కూఁతురు రోహిణీ ♦ కోమలికేను
బ్రాతిగనెన్నియో ♦ బాసలనిచ్చి
సాగరంబునవచ్చి ♦ శ్రోతుండనగుచు
మగధదేశంబున ♦ మఱచినిద్రింప
ఖలుఁడైనరాజశే ♦ ఖరనృపాధముఁడు
చలమునన్జెర ♦ పాలబంధింప
వినిరోహిణీకన్య ♦ వేగంబవచ్చి
ఘనముగాఁ జెరముక్తిఁ ♦ గనఁజేసిపోవ
మునుకొనియతివేష ♦ మును బూనినిన్ను
గొనిపోవవచ్చితిఁ ♦ గోరికమీర.
చిత్రసేనుఁడనేను ♦ చిఱుతకాలమున
యాత్రలసేయంగ ♦ నరిగితిమున్న
చెన్నుమీరగనన్ను ♦ చేరిసోదరుని
కన్నమన్నించెడు ♦ కలికియవస్థఁ
జూచియోర్వఁగలేక ♦ చోద్యంబుగాను
లేచివచ్చితిగాన ♦ లెమ్మువేరమ్ము.

మిత్రమా ! ఈలేఖనుఁ జూచికొనుము (అని యొకలేఖను చేతికిచ్చుచున్నాఁడు.)

సుధా. (ఉత్తరమునుఁజూచుకొని) ఓహోహో! మిత్రమా! చిత్రసేనా! నామనోహారి ప్రియులైనవారందఱు నాకుప్రియులేయని నమ్మియుండుము ఇపుడు స్వయంవరమును జాటింపనేల ?

చిత్ర. మిత్రమా! దారుణశాత్రివపుత్రుండవగు నీవా కోమలాంగి చెంతకు స్వయంవరో పాయంబునందక్క వేఱొండువిధంబున నెట్లుఁ జేరఁగలిగెదవు? అరమణీమణి నీతోఁ జెప్పుమన్న విధముఁ దెల్పెదవినుము.

చ. వలపుసహింపఁజాల నన ♦ పాయసుఖంబు ఘటిల్లఁ జేయఁగా
విలసిలునీముఖాంబుజము ♦ వేడుకఁ జూపస్వయంవరంబు నే
గలయఁగఁ జాటితంచు కిను ♦ కన్మదినూనక నాదుచెంతకుఁ
సలలితలీలవచ్చినను ♦ చయ్యనఁ జేకొనుమీ మనోహరా.

సుధా. మిత్రమా! స్వయంవరంబున కందరువచ్చియుండిరా?

చిత్రి. సఖా! ఈపాటికందరును వచ్చియేయుందురు. మనముకూడ శీఘ్రముగఁ బోవలయునురమ్ము.

సుధా. మంచిదికాని సఖా! నీవాఘోటకంబునట్లు విశసించినకారణంబేమి?

చిత్రి- మిత్రిమా! మనలనరయ బయలువెడలురాజభటులను మనము క్రూరవనసత్వంబుల వాతఁబడితిమనే దుర్భ్రాంతిని గలుగఁజేయుటకట్లుఁ జేసితిని. ఇంక మనకు వెనుక వెరపేమియు లేదు.

సుధా- బళే, చిత్రసేనా ! నీబుద్ధివిశేషము నేమనికొనియాడుదును. పోవుదమురమ్ము,

చిత్రి-సఖా! ఇపుడే మనమిటనుండి బయలువెడలుట బహుదుర్ఘటము చూడుము,

ఉ. దిక్కులతెల్వివూసె మృగ ♦ తీవ్రనినాదములుం జెలంగెడుఁ
జిక్కగనంతటఁ గటికి ♦ చీఁకటికమ్మెను భీకరాటవిఁ
గ్రిక్కునఁ బోవగామనకుఁ ♦ గన్నులుకానఁగరావుగాననీ
చక్కని నిద్రఁ జెందుదము ♦ సమ్మతివేకువఁబోదమెమ్మయిఁ,

సుధా- మిత్రమా! మనముభయులము నొక్కసారె నిద్రింగూలిన క్రూరమృగంబులచే హానిసంభవించెడు. కావున నీవుముందుపరుండుము. నేను మేల్కొనియుండెద

చిత్ర- సఖా! నీవుశ్రాంతుండవై యుంటివి. ఇంచుకవడి నీవునిద్రింపుము. నేను మేల్కొనియుండెద.

సుధా-మిత్రమా! అట్లుగాదు వినుము

క. మునునీవు మేల్కొనంగా
నెనయఁగ నొంటరివి యారాదు ♦ నే మేల్కొన్నన్
మనసిజుఁడు పంచశరములఁ
గొనియుండెడు నాకు సుప్తిఁ ♦ గొను వీవు మనన్.

చిత్ర-అట్లైన రాజకుమారా! నీవు బహుజాగ్రతఁ గలిగి యప్రమత్తుండవై మేల్కొని యుండుము. నేనావటవృక్షమునకుఁ జేరి నిద్రించెద. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సుధా- ఓహోహో తూర్పున చంద్రోదయమగుచున్నది.

సీ. హరిదబ్జవదన ల ♦ నంతపథంబను
రంగంబునను తిమి ♦ రమను తెరను
మెల్ల మెల్లఁ గదింప ♦ నుల్లాసముగ నందు
రాత్రిశైలూషిక ♦ రాగఫాల
భాగంబుఁ బదపడి ♦ వదనంబు చూపట్టు
కరణి రేఖగ నాడెఁ ♦ గానుపించి
పిదప బింబము భాతి ♦ నొదవి ప్రాక్సతిగర్భ
శుక్తిముక్తాఫల ♦ స్ఫూర్తి యనఁగ,
తే.గీ. కలువనెచ్చెలులకు నోము ♦ కల్మి యనఁగ
తమ్మివిరిబోణులకు చక్రి ♦ దంపతులకు
గుండెజల్లన నుదయాద్రి ♦ కుహరమునను
విరహులను వేపచంద్రుండు ♦ వెడలె చదల.

అన్నా. నేనీ మోహాభరంబు నెట్లు సైతును. విరహిజనపీడన దోషాకరుండగుట నేకదా వీనికి దోషాకరుండను నామంబు సార్థకమయ్యె. మఱియు
తే.గీ. కలశవారాశిఁ దనతోడఁ ♦ గలిగినట్టి
బాడబంబును గొనివచ్చి ♦ పాంథహృదయ
మర్మముల నెల్లఁ దహియింప ♦ మత్సరమున
నేచి వెదఁజల్లుచుండె రే ♦ యెండమిషను.

ఉ. ఎప్పుడు తెల్లవాఱునో మ ♦ దీప్సితముల్ నెరవేరునట్లుగా
నెప్పుడు నాదుమిత్రుఁడును ♦ నేనునుగూడి ప్రయాణమైపురిన్
దప్పకఁ జేరఁగల్గెదమొ ♦ తద్దయుఁ గోరికలూర వేడ్కమై
నొప్పుచునారమామణిని ♦ హెచ్చుగఁ గూడిసుఖింతునో కదా.

చ. ఎలమిని రాజసౌధమున ♦ కేగిన నన్ గని సంతసించియా
కులుకుమిటారిమిట్టచను ♦ గుబ్బలఁ గౌఁగిటనాదరించునో
పలుకక నన్నలంతునిగ ♦ భావనఁ జేయునొ తన్ను బాసినే
మెలగితినంచుకోపమున ♦ మిక్కిలిదూఱునో నిష్ఠురోక్తులన్.

నాయదృష్ట మెట్లున్నదో తెలియరాదు.

(అంత చిత్రసేనుఁడు మేల్కాని లేచివచ్చి)

చిత్ర- అన్నా! మిత్రమా! నీవతిశ్రాంతుండవయ్యు నిందుకైన నిద్రఁ జెందకుండితివిక దా

ఉ. ఈయెడవేగుచుక్కయుద ♦ యించెఁ గుటీరము లెక్కి కొక్కురో
కోయని కోడిపుంజులును ♦ కూయఁగసాగె మరుత్కిశోరముల్
హాయిగవీచుచుండెను వి ♦ హంగకలస్వనముల్ చెలంగెనే
మాయిసఖుండ! చూడుమరు ♦ ణోదయమయ్యెఁ బూర్వదిక్కునన్

ఎంతపని చేసితివి. చూడుము.

ఉ. కైరవములు ముడింగె దమ ♦ కంబున దమ్ములు సంతసించెడున్
దారలదృశ్యమయ్యె దివిఁ ♦ దద్దయుఁ జీకటులూడెఁ బ్రాక్సతీ
సారసనేత్ర నెన్నుదుటఁ ♦ జక్కని కుంకుమబొట్టునాఁగ సొం
పూరెడు కెంపుచాయ లరు ♦ ణోదయకాలమునందు బ్రాక్దిశన్.

సుధా- మిత్రమా! మన ప్రయాణంబున కిదియ తఱియని తలంచెద చూడుము.

ఉ. భూసతి రేయియంతయును ♦ బొల్పుగ నాథునిఁ గాంచ కార్తయై
వేసటఁ జెందు లేమవలె ♦ విన్నతనంబున మంచుకొంగుచే
గాసిలు మోముఁ గప్పికొని ♦ కంజహితున్ గనలేక స్వేదా
భాసిలుస ప్రభాతమున ♦ భానుసమాగమనోత్సుకాత్మయై.

అన్నా ! నన్ను విడనాడి నాసఖుండగు విశారదుం డెట్లు కలఁగుఁబడుచుండునో కదా

చిత్ర- మిత్రమా ! నీవుచేసిన ప్రభాతవర్ణనయుక్తముగా నున్నది. ఈసమయంబునఁ జూడుము.

చ. నినునెడఁబాసినంతలము ♦ నింగినదక్షకుమారి రోహిణీ
యనుపమగాత్రినేత్రయుగ ♦ మందలియశ్రులమాడ్కి నొప్పఁ బం
బినకమసీయహైమజల ♦ బిందువికీర్ణసరోరుహోత్కరల్
నినుచెలికోరునట్టులిల ♦ నీరజబాంధవుఁ జూడఁగోరెడిన్.

మిత్రమా ! విశారదుం డీపాటికి పాంచాలదేశముఁ జేరి మనరాకఁ బ్రతీక్షించుచుండెడు. మనముకూడ పాంచాలదేశమును సమీపించితిమి. శీఘ్రముపోవుదమురమ్ము. అదిగో, సూర్యోదయమగుచున్నది. చూడుము-

చ. కలువలదాయ కుక్కుభని ♦ కాయముతో బ్రలఁడాయ చీఁకటుల్
బలువిడిపాయ పక్షులెడఁ ♦ బాయుచుఁ గూఁతలుకూయ దీపికా
కళికలకాంతిమాయ నల ♦ కంజములన్వికసింపఁజేయ పాం
థులుతమబాటరోయ నదె ♦ తోఁచెడుఁ బ్రాఙ్నగశృంగమందునన్

సుధా-ఓహోహో ! మిత్రమా ! హిమబిందుసందోహ పూరితంబగు నాపుష్పదళంబు లెంతమనోహరముగ నున్నవో చూడుము.

(అంత విశారదుఁడు ప్రవేశించి)

విశా- సఖా ! సుధాకరా !

మ. అమితౌత్సుక్యతనిన్నుఁగోరు చెలి నే ♦ త్రాబ్జంబులం బోల్చన
త్యమలీభూత ముదాగతాంబుకణసం ♦ తానంబులోనాఁగ నా
సుమజాతంబుల మంచుబిందులలరున్ ♦ జోద్యంబు నాప్రాహ్ణస
త్సమయంబందున నుద్భ్రమద్భ్రమర సం ♦ జాతప్రకీర్ణంబులై.

మిత్రమా ! నన్నుమాయచేసి పోఁదలంచితే?

సుధా- సఖా ! మనలిద్దరిని చిత్రసేనుండే మాయచేసి తెచ్చెను. నేనేమియు నెఱుంగను

విశా- ఏమీ? నాడు మనతోఁగూడ కారాగృహబద్ధుండై యుండిన చిత్రసేనుం డీతండేనా?

సుధా-అవును.

చిత్ర- మిత్రులారా! మనము పట్టణము సమీపించితిమి. నిఖిలదేశాగతులగు మానవేంద్రులు స్వయంవరమహోత్సవసందర్శన కుతూహలులై యెట్లు పోవుచున్నారో చూడుఁడు.

సుధా-సఖా! చిత్రసేనా! ప్రత్యర్థులమగు మనమెట్లు బాహాటంబుగఁ బురిఁజేర గలిగెదము. ఇంతియేగాక.

స్రగ్ధర.

భానుండాకాశ వీథిన్ ♦ బ్రబలుచు వెలుగన్ ♦ బాంధులా యెండకోర్వం
గానోపక్ జాలకన్ వృక్షములదరికిఁబో ♦ గానవే చెట్లనీడన్
నానాగోవ్రాతమెంతో నవసియుదకపా ♦ నంబుఁగాంక్షించుచుండెన్
భూనాథోత్తంస! కంఠే! పులుఁగులు మెకముల్ ♦ పొక్కుచున్ గూళ్లదూరెన్.

కావున

ఉ. కాలమతిక్రమించెమన ♦ కాళ్లును బొబ్బలు పొక్కె నెత్తియున్
గాలుచునుండె మింటదిన ♦ నాథుఁడు క్రాలఁగ వేఁడి యెండఁ బో
జాలము గాన నొక్కనిము ♦ సంబిటవృక్షపునీడలందు భూ
పాలక విశ్రమించి పిద ♦ పన్ బురిలోనికిఁ బోవ గాదగున్.

చిత్ర- రాజకుమారా! పిపాసాపీడితులమై యున్న మనమీవృక్షచ్ఛాయలనపేక్షించితిమేని శ్రమాపగతుల మయ్యెదమే మొకదా.

విశా- చిత్రసేనా! దవ్వులనొక జలాశయంబుండవచ్చునని తలంచెద. ఏమన.

ఉ. నిల్కడలేక సౌరభము ♦ నించెను వాయువుపద్మగర్భకిం
జల్కములందుఁజిల్లుమధు ♦ సారముగ్రోలెడు తేంట్లఝుంకృతుల్
చిల్కలుకూడి పండ్లఁదిను ♦ చెంచుపుటంబులఁజీల్చి మెక్కుచున్
బల్కెడుపల్కులుండెఁబువు ♦ ప్రాణసఖా! కమలాకరస్థితిన్.

కావున, మనమటకేగి యందలి నిర్మలోదకపానంబుచే సేదదేరి పిమ్మట ప్రచ్ఛన్న వేషంబుల ధరించి బయలు వెడలవలయును.

చిత్ర-మంచిది. మీరట్టులనే జేయుఁడు. నేనటుంముబోయి మిమ్మునుగౌరవింపఁదగు ప్రయత్నంబుల జరిగించెద. (సుధాకరునితో) మిత్రమా! నీవు ధరింపవలసిన వేషము నీతోడనే యున్నది. మాచికొనుము. నేనుపోయివచ్చెద.

[అని చిత్రసేనుఁడు నిష్క్రమించుచున్నాఁడు.]

సుధా- మిత్రమా ! మనముకూడ బోవుదమురమ్ము. స్వయంవరమహోత్సవము ప్రారంభమయ్యెడు.

విశా- మంచిది. (అని సుధాకరవిశారదులు నిష్క్రమించుచున్నారు.)

[అంత దక్షమహారాజు మంత్రియైన మారుతియు బ్రవేశించుచున్నారు.]

దక్షు- మంత్రిశేఖరా ! స్వయంవర మహోత్సవంబునకు మనచే నాహూయమానులగు మానవేంద్రులందరు వచ్చియుండిరా ?

మారు-దేవా ! వినుండు-

ఉ. చోళపురాధినాథుఁడును ♦ జొప్పడమాగధభూవరుండునే
పాళనరేంద్రుఁడాంధ్రపతి ♦ పౌండ్రమహీధవుఁడంగవంగభూ
పాళవరాటకొంకణనృ ♦ పాలురువచ్చిరిసింధుదేశభూ
పాలుఁడుసింహళావనిప ♦ వర్యుఁడురానలెభూపయింకిటన్.

దక్షు-అటులైన, మారుతీ ! నాకుమారీమణి నలంకృతురాలునిగాఁజేసి తోడ్కొనిరా పుణ్యాంగనా జనంబుల నంపుము.

మారు-చిత్తము (అని మారుతి నిష్క్రమించుచున్నాఁడు.)

దక్షు-నేనుగూడఁబోయి యావచ్చెడు రాజలోకంబునెల్ల సమాదరింపవలయును, అయిన ముందుగ నేనంతిపురంబునకుఁబోయి నాకుమారీమణి చిత్తంబు స్వయంవరాయత్తంబై యుండెనోలేదో తెలిసికొనివచ్చెద. (అని దక్షుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

(అంతరోహిణీమాధవులు ప్రవేశించుచున్నారు.)

మాధ-సఖీ ! ఉద్యానవనంబులో నిర్దయురాలవై నన్నొంటరిగ విడనాడి నీవెటకేగితివే?

రోహి- (తలవంచుకొని యూరకున్నది.)

మాధ- నీవెంతనెరజాణవే ప్రియసఖీ. మగధదేశాధిపతియగు రాజశేఖరుని పైకంగీకరింపనట్లభినయించుచు నంతరంగంబున వానిపై నెంతయనురాగపూరితురాలవై యుంటివే నెచ్చెలీ.

రోహి-సఖీ ! రాజశేఖరుని వరింప నామనంబెన్నడు నిచ్చగింపదు,

మాధ- సఖీ ! కల్లబొల్లిమాటలచే నన్నేల మాయచేసెదవు. నీముద్దుటుంగరి మేమయ్యెనో నిజము దెల్పుము.

రోహి-నాముద్దుటుంగరము నాజీవితేశ్వరునియొద్ద నేయున్నది.

మాధ- సఖీ ! నిజముచెప్పితివి. నీహృదయమును హరించిన పుణ్యాత్ముడే నీయుంగరమును ధరింపనర్హుడు. అట్లగుట నేటికిరాజశేఖరుండు సఫలీకృతమనోరథుండయ్యె గాఁబోలు.

రోహి-సఖీ ! నీవట్లు పలుమారు రాజశేఖరునిపేరు తలపెట్టిన నేను సహింపఁజాల రాజద్రోహుల కపటోపాయంబుచే నాముద్దుటుంగరము కాలకర్మవశంబున నాతనిచేతఁజిక్కియున్నను నామనంబారిణభీరువు నంగీకరింతుఁజాలను. ఇంకను నీవిట్టి దుర్భాషలాపంబులఁ దలంచినచో నాయొద్దనుండవలదుపొమ్ము.

మాధ- (నవ్వుచు) నెచ్చెలీ ! కినియకుము.

తే. గీ. తమ్మికంటిరోనీమనోం ♦ తర్గతంబు
నీవుచెప్పంగవినఁగోరి ♦ నిన్నునట్లు
మాయఁజేసితినేగాని ♦ మగువమున్నె
యెఱింగియుంటిననీమనో ♦ హరుని నేను,

చెలీ ! నీముద్దుటుంగర మాతనిచేఁజిక్కలేదు. నాయొద్దనేయున్నది. ఇదిగో తీసికొనుము. (అని యుంగరమును చేతికిచ్చుచున్నది.)

రోహి-(ఉంగరముగైకొని) సఖీ ! కోపగించితివాయేమి ?

మాధ- ప్రియసఖీ ! ఎన్నడైన నీపైకోపగించితినే ? అదిగో మహారాజుగారిటులనే వచ్చుచున్నారు.

(అంత దక్షమహారాజు ప్రవేశించి)

దక్షు-ప్రియాత్మజా ! స్వయంవరసమయంబాసన్నమైయున్నయది. సకలదేశాధీశులును వచ్చియుండిరి. కావున నీవలంకృతురాలవై నీనెచ్చెలులంగూడి యావచ్చిన రాజలోకంబున నీమనఃకాంతుని తెలిసికొనిరమ్ము.

(అంతదమనుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రోహి-(దమనుని వీక్షించి) ఓహో ! దమనా! వచ్చితివా. కృతార్థుఁడవైతివి కాఁబోలు.

దమ- తల్లీ ! పూర్ణకృతార్థుండనైవచ్చితి. మీమనోభీష్టమింక ననివార్యంబుగ నెరవేరెడు మీరు నిశ్చలచిత్తులై యుండుడు.

దక్షు- దమనా ! మాసములోగా వచ్చెదనని చెప్పిపోయి నీవేల దడసితివి ?

దమ- దేవా ! నేనిదివరలో నొకసారివచ్చి మీకుమారీమణికి తగు చికిత్సలు చేసి మరల స్వయంవరపత్రికటనకై యమ్మగారి పంపునఁబోయి వచ్చితి.

దక్షు- దమనా ! వచ్చినీవేల నాకంటఁబడవైతివి ?

దమ-దేవా! దేవరవారి కఠినశాసనంబునకుఁ దలంకి నేనుమీదృష్టిపథంబునఁబడఁజాలనైతి

దక్షు- (మందస్మితముఖుండై) దమనా ! ఎట్లయినను నీకతంబున నాముద్దులగున్న సుముఖురాలైయున్నయది. కావుననిన్నుక్షమించితి. (అనిరోహిణితో) బిడ్డా నీవుశీఘ్రంబుగ రావలయుంజుమీ. (అనిదక్షుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రోహి- దమనా ! రాజశేఖరుండు స్వయంవరంబునకు వచ్చియుండెనా ?

దమ- తల్లీ ! అమావేందుఁడు సుధాకరునిచేమున్ను పరాభవంబునొందియునుఁడివో నిమత్సరంబువృనః సింహళద్వీపంబుపై దాడివెడలి యచ్చట నాతనితో ఘోరయుద్ధంబుజేసి పరాజితుండై ప్రాణావశిష్టంబుగ వచ్చియున్నాఁడు.

రోహి-మేలు, దమనా ! బహుబాగుగఁ జరిగినది. అయితే, భాస్వంతుని సంగతివారెవ్వరికైనఁ దెలిసియుండెనాయేమి ?

దమ- తల్లీ! తెలియలేదు. అదిగో వకుళమణిమంజరులిటులనే వచ్చుచున్నారు. నేనాస్థానంబునకేగెద. (నిష్క్రమించుచున్నాఁడు.)

(అంత వకుళమణిమంజరులు ప్రవేశించుచున్నారు.)

మణి- తల్లీ! స్వయంవరసమయమైనది. మీతండ్రిగారు మీరాకకై నిరీక్షించుచుండెదరు నీవలంకృతురాలవు కావలయును. పోవుదమురమ్ము.

రోహి-మంచిది. మాధవీ ! నీవుకూడరమ్ము! (అని వకుళమాధవిమణిమంజరులతో రోహిణి నిష్క్రమించుచున్నది.)

(అంత, దక్షమహారాజు, మారుతి , అన్యదేశాగతులగు మానవేంద్రులు స్వయంవరాస్థానంబును ప్రవేశించుచున్నారు.)

దక్షు- భూజానులారా ! నేడునాభాగ్యోదయ ప్రభావంబున మీవంటిరాజబృందంబు నొక్కచోఁగంటిః కృతార్థుండనైతి.

మానవేం. రాజా! జగన్మోహనాంగియైన మీకుమారీమణి మోహలతాబద్ధులమగు మేమిందరమొక్కచో గూడియుండుటబ్బురమే?

దక్షు- ధరాధ్యక్షులారా ! నాపట్టియిప్పుడేవచ్చి మీలోనొక్క భూవరకుమారుని వరిం

చును. అప్పుడితరులైన మహేంద్రవరులుం గక వాత్సల్య భావంబుచే వధూవరుల నాశీర్వదింపఁ బ్రార్థించెద.

రాజ- రాజా! మీతనూజారత్నము కులశీలవయోరూపంబుల నెఱింగి వరించినచో మేము టులనే జరిగించెదము.

దక్షు- (మారుతితో) మంత్రిశేఖరా! నాకుమారీమణియింకను రాకఁదడసె. కారణ మేమొకదా.

మారు- దేవా! ఆకోమలాంగిని దోడ్కొని వచ్చుటకు పుణ్యాంగనాజనంబుల నంపియుంటి. అదిగో దమనుఁడు నిటుల వచ్చుచున్నాఁడు.

(అంత దమనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దక్షు- (దవ్వులదమనునిఁగని) దమనా! నాకుమారీమణి పూర్ణాలంకృతురాలై వచ్చుచుండెనా?

దమ-చిత్తము దేవా. నెచ్చెలులుదాను నిప్పుడే బయలుదేరి వచ్చుచున్నారు.

మారు- దేవా! అదిగో చూడుఁడు:—

తే. గీ. రిక్కచెలికత్తియలతోఁడ ♦ రేవెలుంగుఁ
గదియఁబోయెడు రోహిణీ ♦ కాంతయనగ
మురియునరపాలలోకస ♦ నోమ్మహనాస్త్ర
మనగరోహిణి సఖులతో ♦ నదిగొవచ్చె.

(అంత రోహిణిప్రవేశించుచున్నది.)

దక్షు- (రోహిణిని ప్రియమారఁ దగ్గరఁజేర్చి) ప్రియాత్మజా! స్వయంవర సమయమైనది. ఈవచ్చినరాజలోకంబునెల్ల నీవుబాగుగ వీక్షించి నీకిష్టము గలిగినవాని వరించి వానిమెడలో నీపుష్పహారమును గీలింపుము. (అనియొకపువ్వులదండ చేతి కిచ్చుచున్నాఁడు.)

రోహి-(పుష్పహారమును గైకొని రాజసభ నవలోకించుచున్నయది.)

దక్షు- మారుతీ! నీవుకూడఁబోయి ప్రత్యేకంబుగ నారాజవరులనీరమామణికిఁజూపిరమ్ము

మారు-చిత్తము- చిత్తము (అని యాకోమలాంగిని వెంబడించి) ఏణాక్షీ! చూడుము.

ఉ. ప్రాలునృపాలమౌళిమణి ♦ రంజితపాదపయోజయుగ్ముఁడై
లీలగచందనాగరువి ♦ లేపనలన్బాలుపొందిజాళువా

మేలిపటంబుఁగట్టినెటి ♦ మించుతనుద్యుతినొప్పు పాంచ్రభూ
పాలవరేణ్యుఁడీతఁడని ♦ వార్యపరాక్రముఁడాజి కోమలీ.

రోహి- (తనలో) ఈతండతిలోభియు గర్వసంపన్నుండునగుటచే వీనింజూడరాదు.
(అనితొలఁగిపోవుచున్నది)

మారు-రాజాననా ! వీనినిఁజూడుము.

ఉ. రాజితరూపమందునల ♦ రాజభిమానధనంబునందురా
రాజు శరీరకాంతినుతు ♦ రాజుఁ బరాక్రమమందునంబికా
రాజును దానమందుయువ ♦ రాజును వైభవమందుదేవతా
రాజననొప్పునీమగధ ♦ రాజునుజూచితెరాజశేఖరుఁ.

రోహి-(తనలో) రణభీరువును దుర్మదాంధుండునగు నీతండు కదనంబున పరాజయంబు నొంది వచ్చినజీవచ్ఛవము. కావున వీనిమొగముఁజూడరాదు. (అని కోపముతో తొలంగిపోవుచున్నది.)

మారు- కోమలీ !

మత్తకోకిల. పాళిమైగనుఁగొంటెశాత్రవ ♦ పంకజాకరదంతిభూ
పాలకేంద్రుఁడురూపనిర్జిత ♦ భావజుండును వైభవ్రా
ద్వేలుఁడాంధ్రమహీధవుండును ♦ దివ్యశీలియునైననే
పాళభూపతిఁజూడువీరల ♦ పద్మపత్రవిలోచనా.

రోహి-(తనలో) అతిదుర్వ్యసనాసక్తులును రణభీరువులునగు వీరిని వరింపసామనంబిచ్చగింపదు. (అని తొలంగిపోవుచున్నది.)

మారు- కమలాక్షీ !

ఉ. ఆయతకీర్తిచంద్రికస ♦ మావృతసర్వదిగంతరుండు శో
భాయతసత్ప్రచారుఁడన ♦ ఘాత్మకుఁడర్థిచకోరచంద్రుఁడుఁ
కాయజరూపసంపదలఁ ♦ గ్రాలెడుచోళపురాధినాథుఁడో
తోయజనేత్ర ! చూడు మని ♦ దోర్బలనిర్జితవైరియీతనిన్.

రోహి- (తనలో) ఈతండు క్రూరుండును దుర్న్యాయప్రవర్తకుండునగుటచే వీనిసేనంగీకరింపఁజాల. (అని తొలంగిపోవుచున్నది.]

మాయ- లతాంగీ!

ఉ. వారిజమిత్రు(డోనలు(డో ♦ వాసవు(డో నలకూబరుండొయి
చ్చారతి(జూడుమీతనివ ♦ సంతు(డొ కంతు(డొ నాజయంతు(డో
ధారుణిపై వెలింగెడుసు ♦ ధాకరు(డో తెలియంగరాదహో
భూరిసువర్ణభూషణవి ♦ భూషితు(డీనృపపుత్రు(డెవ్వరో.

ఏణాక్షీ ! కిరీటమకరకుండలకేయూరహాటకాంబర మణిమయాలంకార భూషితులై పరికాశింపు నీరాజలోకంబున నీకిచ్చవచ్చిన వారెవ్వరో చూపుము.

శోభి- (తనలో) దేందమా ! త్వరపడకుము. త్వరపడకుము. ఓభగవానుడా! సంకల్ప సంభవా! దాక్షిణ్యమూర్తి వగునీవు సాపైకరుణించి నామనోహరుని చిత్తమును నిష్కళంకంబుగ జేయుము. (అని సభికులందరు( జూచుచుండ సుధాకరుని మెడలో పుష్పహారంబును గీలింపుచున్నది.)

(అంతదమను(డు ప్రవేశించి)

దమ- సభాధ్యక్షులారా !

చ. విమలయశోవిశాలపృథి ♦ వీపతులారా ! కనుండుపంచభూ
తములునుమీరునాక్షులుక ♦ దావనితామణిచిత్తచోరుమో
దమునననుగాంచివీనియఘ ♦ తక్షదగిలించెనువేడ్క(బుష్పదా
మమునువధూమణిన్వరుని ♦ మత్సరమూనక(బెండ్లి(గూర్పుడీ.

[అంత సభ్యులందరు విఫలితమనోరథులై చూచుచుండ రాజశేఖరు(డులేచి.]

రాజ- రాజా ! దక్షమహీధవా !

ఉ. ఓధరణీపయేలమము ♦ నోయ్యన(బిల్వగ(బంచితీవురా
జాధమనీతనూజనుస్వ ♦ యంవరమన్మిష చేతసింహళ
శౌర్యధవసూనుచేనిశిమ్ము ♦ పావచనంబులుపల్కియిట్లుపృ
థ్వీధవులందరిక్షబరిభ ♦ వించితివైననుం(బోవనిత్తుమే.

దక్షు- ఆ( ! ఏమి ! ఎంతపనిజరిగెను ! (అని మహాకోపముతో పండ్లు పెటపెట(గొఱుకుచు గద్దెయుకెగ్గి) ఓరోరిరాజశేఖరా ! క్షత్రియకులపాంసనా ! యేమిరా, నీ

విల్లుత్రింపుమీదు నెఱుంగక సాహసించితివి ? ఇపుడు నిన్నేమి చేసెదనో చూడుము.

(అని సుధాకరుని జేయిబట్టుకొని యదలించుచున్నాఁడు.)

సుధా- (కరంబుదిగిచికొని కోపఘూర్ణమానతారకుండై పండ్లు పెటపెట గొఱుకుచు). ఓనరపాలకుల కలంకులారా!

ఉ. త్రుళ్లిపడంగ నేలనిదె ♦ దోర్బలవృత్తినటించి నేడ్కనో
విల్లునుబూనియున్న పృథి ♦ వీపతులార ! రణంబులోమిమున్
ద్రెళ్లగఁజేసిరాతుసవి ♦ ధన్ గ్రహియించెదఁగన్య దంతికిన్
చెల్లునె కేసరింగదియఁ ♦ జేరఁగచూడుడునాప్రతాపమున్.

[అనిసభ్యులందరుఁ గలంగునటుల ధనుష్టంకారంబుఁజేయ రోహిణి మూర్ఛిల్లుచున్నది.]

దక్షు- ఓసర్వంసహాధ్యక్షులారా ! నాముద్దులపట్టి మూర్ఛాగతురాలై యున్నయది మీరలిట్లు మారణోత్సాహపరులై వీరావేశంబులఁ బ్రకటించుచుండిన నీమె ప్రాణములనునిలుపజాలను. కావునమీరిప్పటికిశాంతింపుఁడు.మీకు నమస్కరించెద

రాజ- మేమీనరాధముని సంహరించినంగాని శాంతిబొందజాలము. (అని వీరావేశంబున గొనయంబు సారించి విల్లెక్కిడి, సుధాకరుని డగ్గర) ఓరోరి మానుసాధమా!

ఉ. నీవెటకేగెదింకధర ♦ ణీవరులందరుజూచుచుండని
న్నేవిధినైన నేనుసమ ♦ యించెదచంపియుఁబొట్టఁజీల్చినీ
పేగులఁదాల్తునాయతుల ♦ వెచ్చనినెత్తురుద్రావివెండ్లికిన్
బేర్వుమటంచుఁబోయెదవ ♦ రించెదఁగన్యకఁజూడుదుర్మతీ.

సుధా-ఓరీ ! నీచాధమా ! విస్రంభవాచాటా ! ఏమనిరా ప్రేలుచుంటివి ? ఇదిగో నీమదము సదమదము జేసెద చూడుము. [అనివరలోనికత్తి పైకిదీసి ఝళిపించుచు ఓరి తుఱువా !

శా. భూతప్రేతపిశాచసంఘములకున్ ♦ బూర్ణంబుగావిందు వి
ఖ్యాతింజేయుగఁజూడుమోతులువ ! దు ♦ర్గర్వాంధ! నిన్నిప్డె దే
శాతాసిన్ గడతేర్తునిల్వుమిటనీ ♦ చా! సిగ్గులేదోసినున్
జేతఃప్రీతినిద్రెళ్ల జేయనెఘనా ♦ జిన్ గాయములార్తనెనే.

(అని యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

దక్షు- ఓహో! యోధవరులారా! శాంతింపుఁడు, శాంతింపుఁడు అన్నన్నా! ఎంతయుపద్రవము తటస్థించెను! నాపట్టి గాఢమూర్ఛాపరవశురాలై యున్నయది. వీరందరు దారుణ రణోత్సాహులై విజృంభించుచున్నారు. ఇంక నెట్లోగదా. (అని సన్నిహితవస్తులగు చెలికత్తియలతో) ఓ పుణ్యాంగనలారా! మీరలీకోమలి నెత్తికొనిపోయి యంతిపురంబున శయనింపఁజేసి.

చ. అలరులపుప్పొడుల్విరచి ♦ నట్టిమనోహరహంసతూలికా
తలమునఁబండఁజేసి విరి ♦ దమ్ములవీచుచు పైహిమాంబువుల్
జిలుకుచు మేనచందనము ♦ జెన్నుగఁబూయుచు చెంతఁజేరి రం
జిలు మృదులంపుపల్కులను ♦ జెప్పుచు జేయుఁడు శైత్యసేవలన్

దమనా! నీవుకూడ వీరివెంటనేగి తగుచికిత్సలొనరింపుమండుము.

దమ- చిత్తము. చిత్తము. (అని చెలికత్తియలుదాను రోహిణి నెత్తుకొని నిష్క్రమించుచున్నారు)

(అంత గగనంబునుండి యొకధ్వని)

గంధ- ఓహో దుర్మదోదగ్రులగు రాజాధములారా! ఏలమీరిట్లు నిష్కారణము సమరసన్నాహులై కలగుండుపడియెదరు? శాంతింపుఁడు: శాంతింపుఁడు. ఓ దక్షమహీధవా!

ఉ. పూర్వభవంబునందుబహు ♦ పుణ్యులఁజేసి నృపాల వీరి నీ
యుర్విఁజరించుచుంగని ము ♦ హోజ్జ్వలతేజముకోటుఁజెందఁగం
ధర్వాలమేము వీరినొక ♦ తట్టునఁజేర్చి పరస్పరంబుదృ
క్పర్వములౌనటుల్సలుపఁ ♦ బాయనిమోహముఁ జెందికొందురుల్.

క. కావునశంకింపకనీ,
భావజరూపునకునీదు ♦ పట్టినొసఁగి ప్ర
ద్యోవర సల్పుము వేగమె,
వైవాహికశుభమువీరు ♦ వర్ధిలునిలన్.

(అని యంతర్ధానము చేయుచున్నారు.)

దక్షు- ఆహాహా! సభ్యులారా! వింటిరా గంధర్వవరుల పలుకులు? దేవతాప్రేరితంబగు నీకార్యం బవశ్యకర్తవ్యంబని తోచెను. మీయభిప్రాయమేమి

సభ్యు-రాజా ! నీవెంతమాత్రము సంశయింపక నీశుభకర్మంబును శీఘ్రింబుగ నెరవేర్పుము. దేవతాభిమానోన్నతులగు నీవధూవరులు చిరానురాగవైభవ సమృద్ధులై వర్ధిల్లఁగలరు.

రాజ- రాజా ! మాయావులగు గంధర్వుల పలుకులువిశ్వసింపకుము. క్షత్రియధర్మంబును విడనాడకుము. న్యాయముఁదలంపుము. (అని సుధాకరునితో యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

దక్షు- ఓవీరులారా ! మీరు వేఱొక బహిఃప్రదేశంబునకుఁబోయి న్యాయయుద్ధంబు జేయుఁడు. అందు జయలక్ష్మిం జేకొనివచ్చిన పురుషుండే నాకుమారీమణినిఁ జేకొననర్హుండు.

రాజ- మంచిది. (అని సుధాకరునితో) సుధాకరా! నీవుపౌరుషముగలవాఁడవైనచో నాతో న్యాయయుద్ధంబుఁజేయ వేఱొక బహిఃప్రదేశంబునకురమ్ము. లేనిచో నోడితినను ము.

సుధా-ఓరిపృథాభిమానీ ! రమ్ము. ఈసారెశత్రుశేషంబుఁదీర్చి కృతార్థుండనయ్యెద.

[అని సుధాకరుడు రాజశేఖరుని చెయిపట్టి తోడ్కొని పోవుచున్నాఁడు.]

దక్షు- సభాధ్యక్షులారా ! మీరుకూడ దయచేసిచని వారియుద్ధంబున న్యాయాన్యాయంబుల విమర్శించిరండు.

సభ్యు-మంచిది (అనిసభ్యులు నిష్క్రమించుచున్నారు.)

దక్షు- మంత్రిపుంగవా ! నాపుత్రికారత్నంబునకుఁ దగిన శైత్యోపచారంబులు జరుగుచుండెనా? ఆకోమలిమూర్ఛ యిపుడెట్టిస్థితిలో నుండెనో తెలియరాదు.

మాను-దేవా! ఆగాఢమూర్ఛ క్రమక్రమముగ చెలికత్తెయలొనర్చు శైత్యోపచారంబులవలనఁదగ్గిపోవుచున్నదఁట. అదిగోదమనుఁడు నిటులనే వచ్చుచున్నాఁడు.

[అంతదమనుఁడుప్రవేశించుచున్నాఁడు]

దక్షు- దమనా! నాపట్టిమూర్ఛ యిపుడెట్టిస్థితిలో నున్నదో తెల్పుము.

దమ-చిత్తము, దేవా ! వినుండు.

సీ. ఘనసారచందన ♦ కలితలేపనముల,
నలఁదఁబోయిననెంతో ♦ యులికిపడును
పునుఁగుజవ్వాజియు ♦ తనువునఁబూయంగఁ
గడగినమొయిగగు ♦ ర్పొడునవెదరు

పీఁక తోయజతాళ • వృంతంబులనుపీవఁ
బివిధినఁగృద్ధయై • తేరిజూచు
నరవిరిపూసెజ్జ • యందు బండగఁజేయఁ
బూన మంటలటంచుఁ • బొదలుచుండు.

తే. గీ. శిరసునకు మంచిపన్నీరు • చిలుక నేఁ బ
యత్న మెంతయొనర్చిన • నడటుఁజెందు
నానరమీాపుత్రికకునుశై • త్యోపచార
ములను క్రమముగ మూర్ఛయుఁ • దెలియుచుండె.

[అంతవిజయోల్లాసితుండగు సుధాకరుఁడు సభ్యులలోఁ ప్రవేశించుచున్నాఁడు.]

సుధా- రాజేంద్రా ! న్యాయయుద్ధంబున పూర్ణవిజయుండనై వచ్చితి. ధర్మమార్గానుసారంబుగ మీకుమారీమణిని నాకొసంగవలయు.

దక్షు- అద్వంద యుద్ధమున రాజశేఖరుండు నిహతుండయ్యెనాయేమి ?

సుధా- దేవా ! రాజశేఖరుం డప్సరోంగనలపొందు నభిలషించి దివంబున కరిగియున్నాఁడు.

దక్షు- అన్నన్నా ! ఎంతపని జరిగెను.

తే. గీ. చిరతరస్నేహభావంబు • గరిమఁజూప
వచ్చి నాపుత్రికాస్వయం • వరమునకును
కటకటా!నీవు పరలోక • గతుఁడవైతె
కదనమునవోడి రాజశే • ఖరసఖుండ.

అయ్యయో ! వీరిని నేనేల యుద్ధమునకు ఘొనయఁజేసితి.

[అంత నంతరిక్షమునుండి యొకధ్వని.]

గగనవాణి-రాజా ! గతించినదానికై చింతింపకుము. ఈ రోహిణీసుధాకరుల కిదివరకే గాంధర్వ వివాహమైయున్నది. వినుము.

శా. క్షోణీనాధ! సుధాకరుండు నిజభ • క్తుండౌటవాత్సల్యముల్
రాణింపంగ వివాహమొల్లకతివై • రాగ్యంబుచేనుండఁబూ
బోణీరోహిణినీ కుమారిగవిధిన్ • బుట్టింపనేమించె వి
న్నాణుండాహరి వీనికై యొసగు క • న్యారత్నము న్వేడుకన్.

మఱియు

మ. భగవంతుండు రమామనోహరుఁడు నా • పద్మాంధవుం డిద్ధస
న్నిగమాంతర్గతసుప్రచారుఁడు మహా • నిర్నిద్రవాత్సల్యుఁడై
నగభేదిన్ బనిచెన్ సధూవసులసం • ధానంబుఁగావింపఁగాఁ
దగదైవాజ్ఞయునట్టిదేయగుటను • ద్వాహంబువే సల్పుఁడీ.

దక్షు- ఓహోహో! సభికులారా! ఇంక మనము కాలవిళంబనము చేయరాదు. మారుతీ! శుభముహూర్తంబు నిర్ణయింప మౌహూర్తికులరావింపుము. ఈశుభవర్తమానంబుసు సింహళద్వీప ధరావరేంద్రుండగు రత్నాకరమహారాజుగారి కెఱింగింప చారులను బంపుము. తక్కుంగల బంధువర్గంబుల కెల్ల సంభాషణపూర్వకంబుగ శుభలేఖల వ్రాయించుము. మఱియు

శా. ఆపద్బాంధవుఁడయి శౌరికోరినటులా • హా రోహిణిన్ సింహళ
ద్వీపాధ్యక్షసుతుండుకోరుటనువే • విస్ఫారఘంటాధ్వనుల్
ప్రాపొందంగ సుదావళంబుపయిశం • భల్లిలవై వాహికం
బేపారున్విను డంచు జాటుముజనుల్ • తృప్తింగనంగన్ బురిన్.

మారు- చిత్తము దేవా. [అనిమారుతి నిష్క్రమించుచున్నాఁడు]

సభ్యు-రాజా! మేమిప్పటికి పీడ్కొనియెదము. (అని సభ్యులు నిష్క్రమించుచున్నారు.

దక్షు- (దమనునితో) దమనా! నీవునాకు మహోపకారివి. ఏమిచ్చినను నీఋణంబు దీర్పఁజాల. ఇట్టిమహోత్సాహసమయం బెన్నటికైనఁ జేకూరునని స్వప్నమునందైనఁ దలంచితినే? ఎన్నటికైన నీమేలు మఱువజాలుదునే?

చిత్ర- దేవా! వినుండు.

చ. దమనుఁడుఁగాను నేనుమును • తల్లిని బాసి యనేకదేశముల్
క్రమముగసంచరించితుది • గ్రమ్మఱివచ్చియు వెండిరోహిణీ
కమలదళాయతాక్షినిజ • కాంతునిరోయగఁ బోయి నేటికిన్
సుమశరతేజునిన్నృపత • నూజునిఁ దెచ్చినచిత్రసేనుఁడన్.

దక్షు- ఓహోహో! చిత్రసేనా! ఎంతకాలమునకు నిన్నుఁదిరుగఁ జూడగలిగితినిరా బహుకాలను పరదేశవాసముఁజేయుచు నెన్నియిడుమలం గుడిచియుంటివో కదా నీవు శీఘ్రంబుగ నంతిపురంబునకుఁజని నీరాకకై యత్యంతాసక్తితో నిరీక్షించుచుండెడు నీతల్లినిఁజూచిరమ్ము.

దమ- దేవా! నేనిదివరకే రాజననికిని రోహిణీకన్యకను గనఁబడియుంటిని.

దక్షు- మంచిది. అట్లులైన నీవు ఖనికశిల్పికాదివరులరావించి పెండ్లిపందిళ్లనిర్మింపఁ జేయుము. మఱియు

చ. పగడముమంచిముత్తియము, పచ్చపసిండియుఁ గూర్చితీరుగా
జిగిబిగితోరణంబులను, జెల్వుగఁగట్టుడుమానికంబులన్
సొగసుగరంగవల్లికల, సొంపుగఁ దీర్చియలంకరింపుఁడిం
పుగ వెలుగొందఁజేయుఁడుమి, భూతిఁదలిర్పవివాహవేదికన్.

చిత్ర- చిత్తము. చిత్తము. (అనిచిత్రసేనుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

దక్షు- (తనలో) ఈవర్తమానము తెలిసినచో రత్నాకరుండు కుపితుండౌనేమో కదా.

(అంతమారుతి ససంభ్రమంబుగాఁ బఱతెంచి.)

మారు- దేవా! సింహళద్వీప ధరాపరుండగు రత్నాకర మహారాజు ప్రళయకాల మేఘ గర్జన గంభీరనినాదంబుల ననుకరించు శంఖకాహళ భేరీభాంకృతుల తోడను, వీర భట సింహనాదంబులతోడను, కరటిఘటాఘోటక బృంహిత హేషారవంబుల తోడను, ఘోరకలశగునటుల ప్రచండవాతోద్ధూతనీరాకరవీచికానికరంబుల మాడ్కి ఘూర్ణిల్లు భీషణచతురంగబల సమేతుండై మనదేశంబుపైకి వచ్చుచున్నాఁడు. దేవాకర్తవ్యమూహింపుడు.

దక్షు- ఆఁ! రత్నాకరుండు తనపుత్రిని మనము చెరఁబట్టితిమనే దుర్భ్రాంతిని వచ్చుచుండెను కాఁబోలు. ఎట్లయిన నీయుత్పాతంబునపనయింప సుధాకరుండే సమర్థుండనితోచెడు.

సుధా- మామా! మీరుసందేహింపనేల? నేనిప్పుడే కుపితులైయుండు మాతండ్రిగారి యొద్దకేగి యాయనను శాంతింపఁజేసెద.

దక్షు- మంచిది. పోయిరమ్ము. మేమును నీవెనువెంటనే వచ్చెదము.

సుధా- చిత్తము (అనినిష్క్రమించుచున్నాఁడు.)

దక్షు మారుతీ! మనముకూడఁబోయి యారాజేంద్రుని యథోచితగౌరవంబుల శాంతింపఁ జేసితోడ్కొని వత్తమురమ్ము.

(అని దక్షమహారాజు మారుతియు నిష్క్రమించుచున్నారు)

(అంత రత్నాకరమహారాజు శ్రుతకీర్తియు ప్రవేశించుచున్నారు.)

రత్నా-శ్రుతకీర్తీ ! నాపుత్త్రుండు దుర్మదాంధుఁడగు దక్షరాజాధముని యురులలో జిక్కియుండిన సంగతినిశ్చయ మేనా ?

(అంత వలాహకుండు ప్రవేశించి)

వలా- దేవా ! దేవరవారి కుమారుఁడు దక్షపుత్రికయగు రోహిణీకన్య మోహజాలంబునఁ జిక్కియున్నాఁడు. ఏతత్పరిణయ మహోత్సవంబాసన్నమై యున్నయది

రత్నా-ఏమేమీ ! ఓకులద్రోహీ! వింటివా శ్రుతకీర్తీ ! శత్రుకన్యాకరగ్రహణలాలసుండగు నాపాలసునిఁ బరిత్యజించుటయ మేలు. కావున మనమింక మరలుదమురమ్ము

శ్రుత-దేవా ! త్వరపడుట యుచితంబుకాదు. పుత్రునిపై మీరేలఁగినిసెదరు ? అదిగో మనసుధాకరుఁడిటులనే వచ్చుచున్నాఁడు.

(అంత సుధాకరుఁడుప్రవేశించి.)

సుధా-తండ్రీ ! నేనపరాధినైతిని. నన్నను గ్రహింపుఁడు. (అనితండ్రిపాదములపై వ్రాలుచున్నాఁడు)

రత్నా-సుధాకరా ! కలుషాత్మా ! వృద్ధులైన జననీజనకులను దుఃఖపెట్టి శత్రువుల నాశ్రయించిన కులదూషణుండవగు నీమొగముఁ జూడరాదు. తొలఁగియుండుము

(అని త్రోసివేయుచున్నాఁడు.)

(అంతగగనంబునుండి యొకధ్వని.)

గగనవాణి-రాజా ! పుత్రునిపైఁ గినియకుము. భగవద్భక్తుండును పరమపావన చారిత్రుండునగుసుధాకరునిఁజాయగా నీరోహిణీకన్యసృజియింపఁబడినది. దైవప్రేరితంబగు నిమ్మిథునాను బంధంబునుగుఱించి నీవుచింతింపవలదు. భగవదానుగ్రహసంపన్నులగు నీవధూవరులు చిరతరానూనపరస్పరానురాగవైభవ సమృద్ధులై వర్ధిల్లగలరు కావున నీవెంతమాత్రమును శంకింపకుము.

రత్నా-ఓహోహో ! ఆశ్చర్యము ! ఆశ్చర్యము ! నేనింక ధన్యుడనయ్యెద. (అనిపుత్రుని లేవనెత్తి) కుమారా ! పరాత్పరుండగు శ్రీమన్నారాయణమూర్తి యఖండకారుణ్య భాగధేయుండవగునీమహిమను గుర్తింపఁగఁ జాలనైతినిరా తండ్రీ.

శా. రారా! రాజకులైకభూష! తనయా • రారా ! లతాంతాయుధా
రారా! సారవిచారశీలసిత! రా • రా! చిన్నప్రోడా! కుమా
రా! రాజీవదళాక్షు! ముద్దిడగరా • రా! కౌఁగిటంజేరరా
రా! రామామణిబెండ్లియాడినుఖివై • రాజిల్లరాపుత్రకా

[అని పుత్రుని గాఢాలింగనంబొనర్చుచున్నాఁడు.]

(అంత విశారదుఁడు ప్రవేశించి)

విశా.- దేవా, నేనపరాధినైతిని, నన్ననుగ్రహింపుఁడు. (అని పాదములపైఁ బ్రాలుచున్నాఁడు.)

రత్నా.- విశారదా! క్షమించితి. లెమ్ము.

[అంత దక్ష మహారాజు మారుతియుఁ బ్రవేశించుచున్నారు.]

దక్షు.- (రత్నాకరుని సమీపించి) మహారాజా! మన యుభయులము పూర్వవైరంబులందిగనాడి యన్యోన్య సంబంధ బాంధవ్యంబులచేఁ బరస్పర మైత్రినుండవలయునని నా కోరిక. అట్టి నా యభీష్టంబొనగూర్పనా ముద్దుకూఁతుఁ దమకోడలుగాఁ గైకొనుఁడు.

రత్నా.- మిత్రమా! దక్షమహీధవా! ఇంతకన్న మేలెయ్యది? నీవంటివానితో వియ్యమందుటకన్న నాకు వేఱొండు భాగ్యమున్నదే?

(అని కరలగ్నంబుల నన్యోన్యమైత్రిఁ బ్రకటింపుచున్నారు.)

దక్షు.- (రత్నాకరునితో) మహారాజా! వివాహమంటపమును బ్రవేశింతమురండు.

రత్నా.- మంచిది (అనియందరు వివాహమంటపమును బ్రవేశింపుచున్నారు.)

(అంత మంగళతూర్యనినాదంబులును బ్రాహ్మణాశీర్వాదంబులును జెలంగ రోహిణి సుధాకరుని మెడను పుష్పహారమును గీలింపుచున్నది.)

దక్షు.- (సుధాకరునిడగ్గఱి) రాజకుమారా! మున్ను నీమహిమను గుర్తెఱుంగఁజాలక నీయెడల నేనొనర్చిన మహాపరాధంబుల నెల్లసైరించి నాపుత్రికారత్నంబును బరిగ్రహించితివి. ధన్యుండనైతి. మఱియు,

శా. నారీరత్నము నీకొసంగితినిభూ • నాథాత్మజా! నీవుమం
దారోర్వీజమువోట నిందుముఖిపాం • తెన్ మల్లెతీవోటఁ ద
ద్భారంబీవుసహించియిచ్చుచునుశ • శ్వత్కామితార్థంబులన్
నీరక్షీరములట్లమీరుమనుఁడీ • నిత్యానురాగంబునన్

(అని రత్నాకరునితో) మహారాజా!

ఉ. పొంకముమీరఁబూర్వభవ • పుణ్యవశంబునమిమ్ముఁబోలు వి
య్యంకునిఁగంటిఁగావునఁగృ • తార్థుఁడనైతివధూవరుల్సదా
యంకిలిలేనిమైత్రివెల • యున్ భువివర్ధిలదీవసంబునే
నుంకువగానొసంగెదన • హా! నృపవీర! సమాదరింపుమా.

[అంతరోహిణి మామకు ప్రణమిల్లుచున్నది]

రత్నా-ఓసన్నపారత్నమా ! ఈసుధాకరుండను నాసత్కులదీపము నీగుణశీలస్నేహ ప్రేరితంబై బహువిధంబులుగఁ బ్రజ్వరిల్లెడు.

పత్ము- (పుత్రికనతిప్రేమచేడగ్గఱఁజేర్చి) పుత్రికారత్నమా !

చ. కలికిరో! నీవుసీపతియు ♦ గాఢపరస్పరరాగపూర్ణులై
యలరుచుభూరిరాజ్యవిభ ♦ వాన్వితులై తనరారిపుత్రులన్
బలువుగగాంచికీర్తిఁగని ♦ సాయయ భక్తినిసత్త్వమానులన్
బలుమహసేవలం బసిఁడి భూసిలు మన్త్రసుపీడఁబోకుమీ,

రత్నా-పక్షమహీంధనా! నేటికిఁభగవత్కటాక్షంబున మనకోరికలన్నియు నెరవేరినవి.
ఇంకనేమి కావలయును.

దుష్య. మాలిని. నీతిగనీధర♦నేపతులందరు♦నెమ్మనిరాజ్యము లేలవలెన్
ఖ్యాతిగమేఘుఁడ ♦ ఖండసువృష్టినిఁ♦గల్గగఁజేయుఫలోన్నతిపూ
ర్ణోత్తలమందున ♦ మానవులప్రీతి♦ మానసుఖంబులవర్ధిలుచున్
గోత్రిగనాథగ ♦ పంతుపివిశ్వల ♦భక్తినుతింపుచునుండవలెన్.

సగవాంగోః తథాస్తు. తథాస్తు.

[అందరు నిష్క్రమించుచున్నారు.]

గద్య.

ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షవీక్షణాసాదితసమాసాదిత రసబంధుర
కవిత్వవైఖరీ ప్రకటనాపస్తంబసూత్ర శాండిల్యసగోత్ర పవిత్రహోతృపుల
కలశార్ణవరాకాకైరవమిత్ర వేంకటరత్న సుపుత్ర వెంకమాంబా
గర్భశుక్తిముక్తాఫల వివిధ విద్వజ్జనవిధేయ వేంకట
కృష్ణనామధేయ ప్రణీతంబైన రోహిణీ
సుధాకరవిజయంబను నాటకంబున
సర్వమును సప్తమాంకము

సంపూర్ణము.